శ్రీరస్తు, శుభమస్తు, అవిఘ్నమస్తు.

హరిహరహిరణ్యగర్భేభ్యో నమః.

# త్రిలింగలక్షణము

## చతుర్థభాగము

### 1. సంజ్ఞాప్రకరణము

1. శ్రీశైలము, కాళహస్తి, దాక్షారామము ననుమూఁడు క్షేత్రములందును మూఁడు స్వయంభువశివలింగము లున్నవి. ఈ మూఁడు శివలింగములకును మధ్య నున్నదేశమును త్రిలింగదేశము లేక తెలుంగుదేశ మందురు. ఈదేశమునందు నివసించువారు తెలుఁగువారు. వీరిభాష తెలుఁగుభాష. మనము తెలుఁగువారము. మనభాష తెలుఁగుభాష. తెలుఁగుభాషను తెనుఁగు,ఆంధ్రము- ననికూడ నందురు.

మన ముపయోగించు తెలుఁగుభాషలోనికి చాల సంస్కృత పదములు వచ్చి చేరినవి; కావున సంస్కృతమును ఆద్యప్రకృతి యనుచున్నారు. ప్రాకృతమునుండి కొన్నిపదములు మాత్రము తెలుఁగులోనికి వచ్చినవి. కావున ప్రాకృతమును ద్వితీయప్రకృతి యనుచున్నారు. మార్పులను బొందిన ( = వికారములను బొందిన) సంస్కృతప్రాకృతపదములు తెలుఁగుభాషలో నున్నవి. కావున ఆంధ్రభాషను వికృతియనుచున్నారు.

సంస్కృతం బాద్యప్రకృతి. ప్రాకృతంబు
ద్వితీయప్రకృతి. ఆంధ్రభాష వికృతి.

ఆంధ్రభాషాపదముల సాధుత్వము పెద్దల వ్యవహారమువలనఁ దెలియును. లోకవ్యవహారము (=పెద్దల వ్యవహారము) నిత్యమైనదై యొకేరీతిగ నుండును. శబ్దములసాధుత్వాసాధుత్వములను గూర్చి

చెప్పుశాస్త్రమును వ్యాకరణ మందురు. ఇది భాషయొక్క నియమము (కట్టుబాటు) లనుగూర్చి ముచ్చటించుచుండును.

శబ్దసిద్ధి లోకంబువలనఁ దెలియును. శాస్త్రంబు
నియమమునకొఱకు.

౨. సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది (=50)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః ॥ 16 ॥ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ ॥34॥.

వర్ణములు-అర్ణములు-లిపులు-వ్రాలు-మాతృకలు-అక్కరములు-అక్షరములు-అని అక్షరముల పేరులు- అకారము మొదలు అః వఱకుఁగల పదునాఱక్షరములను అచ్చులు అందురు. క-కారము మొదలు ళ-కారము వఱకు నున్న ముప్పదినాలుగక్షరములను హల్లు లందురు. క-కారము మొదలు మ-కారమువఱకుఁ గలయిరువదియై దక్షరములను స్పర్శము లందురు. వీని నైదైదింటొక్కొకవర్గముగా విభజించియున్నారు.

క ఖ గ ఘ ఙ - కవర్గము.
చ ఛ జ ఝ ఞ - చవర్గము.
ట ఠ డ ఢ ణ - టవర్గము.
త థ ద ధ న - తవర్గము.
ప ఫ బ భ మ - పవర్గము.

౩. ప్రాకృతమునకు వర్ణములు నలువది (=40)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః ॥ 10 ॥ క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ ॥30॥

ఋ-ౠ-ఌ-ౡ-ఐ-ఔ-ఙ-ఞ-శ-ష-అనుపదియక్షరములును ప్రాకృతమున లేవు. ఇవి సంస్కృతమునందు మాత్ర మున్నవి.

4. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు (=36)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అఁ ॥ 14॥ క గ చ చ̄ జ జ̄ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ ॥22॥

ఋ ౠ ఌ ౡ విసర్గ (=అః) ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష అనుపందొమ్మిదియక్షరములును సంస్కృతమునందు మాత్రము కలవు. ఇవి తెలుఁగున లేవు. ఇవి గలపదము లన్నియు సంస్కృతపద ములే యని యెఱుంగునది. ఋషి - కౢప్తము - అంతఃకరణము - ఖగము - ఛత్రము - కమఠము - రథము - ఫలము - ఘటము - ఝరము - ఢక్క - ధనము - భరము - శార్ఙ్గము - యజ్ఞము - శమము - షండము.

ఎ-ఒ-అర్ధానుస్వారము (=అఁ) ౘ - ౙ-ఱ - అనునాలుగక్షరములును తెనుఁగులో మాత్ర మున్నవి. ఇవి సంస్కృతమునందు లేవు. ఇవి గల పదములు తెలుఁగుపదములే యని యెఱుంగునది. ఎండ-ఒంటి-అరఁటి-ౘవి- ౙత- అంకె.

5. i. అకారాదులు అచ్చులు (Vowels). అచ్చులను స్వర ములు-ప్రాణములు-అనికూడ వ్యవహరింతురు. అ-ఇ-ఉ-ఋ-ఌ-ఎ-ఒ-లు హ్రస్వాచ్చులు. ఆ-ఈ-ఊ-ౠ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-లు దీర్ఘాచ్చులు. అఁ-అం-అః-వీనిని ఉభయాక్షరము లందురు. పూర్వమునం దచ్చు లేక యివి యుండఁజాలవు. అచ్చు ననుసరించియే యివి యుండును; గావున వీనిని పూర్వాక్షరములనుండి వేఱుచేసి వ్రాయఁగూడదు. ఎ-ఏ-ఒ-ఓ-లు వక్రములు- ఐ-ఔ-లు వక్రతమములు.

ii. కకారాదులు హల్లులు (Consonants): హల్లులను వ్యంజన ములు - ప్రాణులు - అనికూడ వ్యవహరింతురు.

క-చ-ట-త-ప—పరుషములు. గ-జ-డ-ద-బ—సరళములు.

ఒత్తక్షరములు వర్గయుక్కులు. ఙ-ఞ-ణ-న-మ-అనునాసికములు. య-ర-ల-వ- అంతస్థములు. శ-ష-స-హ- ఊష్మములు. పరుషసరళ ములుగాక తక్కిన వర్ణములు స్థిరములు. ఖ-ఘ-ఙ,-ఛ-ఝ-ఞ,-ఠ-ఢ-ణ, థ-ధ-న,-ఫ-భ-మ,-య-ర-ల-వ-శ-ష-స-హ-ళ ॥24॥

6. అనుస్వారము బిందువు. స్వరము ననుసరించి యుండునది గావున దీని ననుస్వారమనుచున్నారు. దీనినిబింధువనియు ననుచున్నారు.

బిందువు i. సిద్ధము ii. సాధ్యము నని రెండువిధములు: i. పద ములందు స్వతస్సిద్ధముగా నున్న బిందువును సిద్ధబిందు వందురు.

ఉ. అందము-చందము-ఏనుఁగు-ఆఁబోతు.

ii. వ్యాకరణవిధులవలనఁ గలిగినబిందువును సాధ్యబిందు వందురు:

ఉ. చెందొవ-కెందమ్మి-రేఁగులు-గోఁగులు.

iii. పూర్ణబిందువు iv. ఖండబిందువునని బిందువు రెండువిధములు.

వంట-పంట-ఇందలివి సిద్ధపూర్ణములు.

వీఁట-బీఁట- ఇందలివి సిద్ధఖండములు.

కెంగేలు-వింజామర- ఇందలివి సాధ్యపూర్ణములు.

పూఁదేనె-లేఁదూడ- ఇందలివి సాధ్యఖండములు.

7. హ్రస్వముమీఁది ఖండబిందువునై కల్పికముగాఁ బూర్ణబిందు వగును. ఇట ఖండబిందువనఁగా సిద్ధఖండమే యని యెఱుంగునది. కలఁగు-కలంగు. చెలఁగు-చెలంగు. వెలుఁగు-వెలుంగు-మెలఁగు-మెలంగు.

8. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు. క్రిఁదొడ- కాఁబట్టి- వాఁడు- రాఁడు- రేఁగు- వ్రాఁత.

9. తెనుఁగుశబ్దములందుఁ బరుషసరళములకు ముందే బిందు వుండును. వంక-మంచు-గంట-ముంత-కంప-కొంగ-రుంజ-దండ- మంద- డంబు. ఊఁక-ఊఁచ-తోఁట-మూఁత-పీఁవు-మూఁగ-బూఁజు-మూఁడు- ఊఁదర-తాఁబేలు.

ఇట్లు చెప్పుటచే స్థిరాక్షరములకు ముందు బిందువు లున్న పద ములు సంస్కృతంబులే యని యెఱుంగునది. అంశము- మాంసము- సింహము-హంస-ఇత్యాదులు సంస్కృతములు. కమసాలి-యను తెలుఁగు శబ్దమును బిందువుతో వ్రాయఁజన దనుట యీనియమముచేతనే యని యెఱుఁగునది.

10. i. దంత్యములు, ii. తాలవ్యములునని చ-జ-లు రెండు విధములు. దంతముల సహాయమునఁ బలుకఁబడునవి దంత్యములనియు,

తాలువు (మూర్ధోపరిభాగము) ల సహాయమునఁ బలుకఁబడునవి తాలవ్యములనియు నెఱుంగునది.

అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ-లంగూడిన చ-జ-లు దంత్యములు:
చమురు- చాకలి- చుంచు- చూలు- చొప్పు- చోటు- చౌక- జత- జాతర- జుట్టు- జూలు- జొంపము- జోదు- జౌకు.

ఇ ఈ ఎ ఏ- లం గూడిన చ-జ-లు తాలవ్యములు.

చిగురు- చీర- చెలిమి- చేడియ- జిగి- జీతము- జెండా- జేన.

చై-జై-లు గల పదములు తెలుఁగుభాషలో లేవు. నెయిదము- చెయువులు. చై- జై- లు గలపదములు సంస్కృతములు: చైత్రము- జైత్రుఁడు.

11. చ-జ-లకు విధించుకార్యము లన్నియు చ-జ-లకుఁ గూడ వచ్చును. చ- కారముతోపాటు చ- కారమును బరుషమనియు, జ- కారముతోపాటు జ- కారమును సరళమనియు వ్యవహరించుచున్నారు. దంత్యతాలవ్యములయిన చ- జ- లు పరస్పరము యతిప్రాసములకుఁ జెల్లుచుండును.

ఆ॥ వె॥ చక్కదనము లోకజయవైభవము వల
రాచవారు వడసి రాచరించి.

12. నకారంబు ద్రుతంబు. ద్రుతాంతంబు లయినపదంబులు ద్రుతప్రకృతికంబులు.

ప్రత్యయములందలివియు- ఆగమములందలివియు- అవ్యయములందలివియు నగు- ను- ని- న్- లు ద్రుతము లనఁబడుచున్నవి. ద్రుతమనఁగాఁ గరఁగిపోవునది; అక్కఱలేనప్పుడు లోపించునది యని భావము

"ప్రథమా-కయి-పట్టి-యొక్కతరవిభక్తులు, ఉత్తమపురుషైకవచనంబులు, భూతతద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనంబులు, ఆశీరాద్యర్థకంబులయిన-ఎడు- త- వర్ణకంబులు: శతృతుమూనంతర్యచేఘాద్యర్థ

కంబులు, నేను- తాను- పదంబులు, వలె- ప్రభృతులు ద్రుతప్రకృతి కంబులు.*

1. నామవాచకములలో ద్వితీయ-తృతీయ-పంచమి-సప్తములు కొఱకు- కి- కు- లో- లోపల- ప్రత్యయములు ద్రుతాంతములు.

రామునిన్ - రామునిచేతన్ - రామునికొఱకున్ - రామునివలనన్- రామునికంటెన్ - రామునికిన్ - రామునకున్- రామునిలోపలన్- రాముల యందున్.

2. సమాపకక్రియలలో —ఉత్తమపురుషైకవచనములు: చదువు చున్నాను- చదివితిని-చదువఁగలను-చదువుదును-చదివెదను-చదువను.

ii. భూతార్థకప్రథమపురుషైకవచనములు: చదివెను. తద్ధర్మా ర్థకప్రథమపురుషైకవచనములు: చదువున్-చదివెడున్-చదివెడిన్.

iii. ఆశీరర్థకంబుల యున-ఎడు-త-వర్ణకములు: ప్రసన్నులయ్యెడున్- చిరాయువు వీవగుత. అనునవి ద్రుతప్రకృతికములు.

3. అసమాపకక్రియలలో: i. శత్రర్థకములు: చదువుచున్- ii. తుమర్థకములు: చదువన్. iii. అనంతర్యార్థకములు; చదువుడున్. iv. చేదర్థకములు: చదివినన్. అనునవి ద్రుతప్రకృతికములు.

4. సర్వనామములలో: నేను-తాను-పదంబులును, వీనివి శేషణం బులును, ద్రుతప్రకృతికములు.

5. అవ్యయములలో: యు-ను- అనుసముచ్చయములును, వలెన్- పోలెన్-మాడ్కిన్-కైవడిన్- మున్నగునవియు; శీఘ్రముగా ననునర్థము గలపదములగు-క్రిచ్చఱన్-గ్రక్కునన్-చివాలునన్ -చెచ్చెరన్ - చయ్యు నన్- దిగ్గనన్-మున్నగునవియు-ద్రుతప్రకృతికములు.

13. ద్రుతప్రకృతులు కానిశబ్దములు కళలు.

ప్రథమ-కయి-పట్టి-యొక్క-విభక్తులు; నేను-తాను-భిన్నంబులగు సర్వనామంబులు; విశేషణంబులు; ఉత్తమపురుషబహువచనంబులు; భవి ష్యద్వర్తమానవ్యతిరేకప్రథమపురుషంబులు; మధ్యమపురుషంబులు

భావక్త్వార్థకంబులు; కించిత్ప్రశంసనాద్భుతసంతాపయుదాతద్యాకిమేవకిల తూష్ణీమర్థకంబులు;-ఏలప్రభృతులు కళలు.

i. నామవాచకములలో ప్రథమ-కయి-పట్టి-యొక్క - విభక్తులు-కళలు.

రాముఁడు-ధనము-ధేనువు-రామునికయి-జ్ఞానముంబట్టి-రాముని యొక్క-చిగురు-సీత-చేను-తేను-మేను-ఓరాములు-ఓరాములార.

ii. సర్వనామములలో - నేను - తాను - గాక మిగిలినవి కళలు: అందఱు-అన్ని-పెక్కు-పలు-వాఁడు-నీవు-ఏది.

iii విశేషణములన్నియుఁ గళలు: ఎఱ్ఱని-తెల్లని-చదువుచున్న-చదివిన-చదువఁగల-చదువు-చదివెడు-చదివెడి-చదువని.

iv. సమాపకక్రియలలో (a) ఉత్తమపురుషబహువచనములు: చదువుచున్నాము-చదివితిమి-చదువఁగలము-చదువుదము-చదివెదము-చదువుదము-చదువము. (b) భూతతద్ధర్మార్థకప్రథమపురుషబహువచనములు: చదివిరి, చదువుదురు, చదివెదరు. (c) భవిష్యద్వర్తమానవ్యతిరేకప్రథమపురుషంబులు.- చదువఁగలఁడు - చదువఁగలరు - చదువుచున్నాఁడు - చదువఁడు. (d) మధ్యమపురుషంబులు: చదువుచున్నావు-చదువుచున్నారు. చదివెదవు - చదువఁగలరు - చదువుదువు - చదువవు-చదువ... ... ...నది.

v. అసమాపకక్రియలలో: (a) భావార్థకములు కళలు: చదువుట, చదువమి. (b) క్త్వార్థకములు కళలు. చదివి - చదువక.

vi ప్రతిపదోక్తావ్యయములలో: (a) కించిదర్థకములు కళలు: ఉ॥ ఇంచుక, కొంచెము, కాసంత, గోరంత, కొండంత, ఇత్యాదులు.

(b) ప్రశంసనార్థకములు కళలు: ఉ॥ బళా-బళీ-బళారే-బళిర-బాపు-బాపురే-మున్నగునవి.

(c) ఆశ్చర్యార్థకములు కళలు. ఉ: ఓహో-ఔర-మజ్జారె-మజ్జా-చాగురే-అమ్మచెల్ల-అమ్మకచెల్ల-అమ్మహో-ఆయ్యారే-అహో-హాయురే-మొదలయినవి.

(d) సంతాపార్థకములు కళలు. ఉ॥ అయ్యో-అక్కటా-కట్టా-కటకటా-అన్నా-ఆహా-ఇత్యాదులు.

(e) యదార్థకములు కళలు. ఉ॥ ఎప్పుడు.

(f) తదార్థకములు కళలు. ఉ॥ అప్పుడు.

(g) ఇదానీమర్థకములు కళలు. ఉ॥ ఇప్పుడు.

(h) కిమర్థకములు కళలు. ఉ॥ ఏమి-ఏల.

(i) ఏవార్థకములు (అ- ఎ-ఏ) కళలు. నిన్న-నిన్నె-నిన్నే-నీవ-నీవె-నీవే.

(j) కిలార్థకములు కళలు. ఉ॥ అఁట - అంట - కద - కదా.

(k) తూష్ణీమర్థకములు కళలు. ఉ॥ ఊరక - మిన్నక.

(l) ఏల - ప్రభృతులు కళలు. ఏలా- చుమ్ము-ఇప్పుడు-మఱి-వెండి. పరిమాణార్థకంబులయిన -అంత-ఇంత-ఎంత; అట్లు-ఇట్లు-ఎట్లు-కాని-కాఁబట్టి-మిక్కిలి-పదపడి-మునుకొని-ఉవ్వెత్తు-మున్నగునవి.

14. య-ర-ల-వ-లు i లఘువులని, ii యలఘువులని, రెండు విధములు : సిద్ధ య-వ-లు అలఘువులు, సిద్ధ ర-ల-లు లఘువులు.

(i) సంధిరానియప్పు డధికముగా వచ్చు-య-కారము లఘువు : హరి యధికుఁడు. సిరి యొసఁగెను. పదములందు స్వతస్సిద్ధముగానున్న-య-కార మలఘువు : కాయ - మాయ.

(ii) రేఫము లఘువు, శకటరేఫ మలఘువు : దొర-పొర-ఇందలి రేఫము లఘువు. కఱచు-పఱచు-ఇందలి-ఱ-కార మలఘువు.

(iii) ల-కారము లఘువు : కల - వల. బహువచనంబునందు-ర-ల-డ-లకు బదులుగా వచ్చిన-ళ-కార మలఘువు : ఊళులు- మొగిళులు-గుమ్మళులు.

పదములందు స్వతస్సిద్ధముగా నున్న-ళ-కారముల నలఘులకారములని భ్రమింపరాదు. తళుకుబెళుకులు - ఇత్యాదులందలి- ళ-కారము ప్రత్యేకాక్షరమేకాని యలఘులకారము కాదని యెఱుంగునది.

iv. ప్రథమమీఁది - ప - కారమునకు బదులుగా వచ్చిన - వ - కారము లఘువు : హారి వలికె- లేములు వాపె. శబ్దములందు స్వతస్సిద్ధముగా నున్న వకార మలఘువు : వంక- వంచ.

15. యకారంబును వృవృూవౌవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు : ఎండ- ఎవఁడు- ఉంగరము- ఊరు- ఒడలు- ఓట.

16. శబ్దములందలి రేఫములు శకటరేఫములో కావో తెలిసికొనుట కీదిగువసూత్రములు కొంతవఱకుఁ దోడ్పడుచుండును.

(i). ద్విత్వరేఫము లన్నియు శకటరేఫములు: కఱ్ఱ-కత్తి-గుఱ్ఱము జెఱ్ఱి-గొఱ్ఱె.

(ii). వీనిద్విత్వములు లోపించుటవలనఁగలుగురూపాంతరముల లోనివిగూడ శకటరేఫములే యగును :- కఱి మేఁక -జెఱిపోఁతు-గొఱియ.

(iii). శకటరేఫముమీఁదియచ్చు లోపించినయెడల నది రేఫమగును:- వేఱువేఱు-వేర్వేఱు. తీఱుచు- తీర్చు. మాఱుచు - మార్చు.

(iv). దీర్ఘము పూర్వమందుఁ గలరేఫము, హ్రస్వపూర్వమగుచో శకటరేఫ మగును: చేకూరు- చేకుఱు.

(v). అందఱు- ఇందఱు- ఎందఱు- కొందఱు- ఇద్దఱు- అను సర్వనామములచివరల నుండునవి శకటరేఫములు.

(vi). సంఖ్యావాచకములలో- ఆఱు- నూఱు- అనువానిలోనివి శకటరేఫములు.

(vii). క్రియాపదములచివరలం దుండునవి రేఫములేగాని శకటరేఫములు గావు : చూచిరి- చూచెదరు- చూచితిరి.

(viii). నశించుట-అనునర్థములో వచ్చు- అఱు- అనుదానిలోనిది శకటరేఫము : పెంపఱి- దూపఱి- సిగ్గఱి.

శకటరేఫములుగల యితర పదములను విద్యార్థులు గ్రంథములనుండి గ్రహించునది.

17. తెనుఁగుభాషలోనిపదములు i. తత్సమములు ii. తద్భవములు, iii. దేశ్యములు iv. గ్రామ్యములు- అని నాలుగువిధములు.

i. సంస్కృతప్రాకృతప్రకృతులకుఁ దెలుఁగువిభక్తులను జేర్చుటవలన నైనవి తత్సమములు: రాముఁడు- వృక్షము- ధేనువు- హారి- ధనుస్సు. అగ్గి- ఓలి- జడ- జముఁడు- రాణి.

ii. వర్ణలోప - వర్ణాగమ - వర్ణాదేశ - వర్ణవ్యత్యయము లను నాలుగువిధముల మార్పులను బొందిన సంస్కృతప్రాకృతప్రకృతులకుఁ దెలుఁగువిభక్తులనుఁ జేర్చుటవలన నైనవి తద్భవములు: ఆకసము-గోడ- తామర- మరుఁడు. ఇంగలము- అచ్చెరువు- పుడమి- జన్నము- వెజ్జు- వెన్నుఁడు.

(iii) తెలుఁగు దేశమువందలి జనులు వాడుకొనుశబ్దములను దేశ్యము లందురు: పాలు- పెరుఁగు- నెయ్యి- ఆోలు.

(iv) లక్షణవిరుద్ధ మయినభాష గ్రామ్యము: i అనింద్యగ్రామ్యము, ii నింద్యగ్రామ్యము అని గ్రామ్యము రెండు విధములు.

కటకంతుఁడు- ప్రాణగొడ్డము-జీవగఱ్ఱ- ఇవి మహాకవులు ప్రయోగించినగ్రామ్యములు గావున నివి యనింద్యగ్రామ్యము లనఁబడుచున్నవి.

అడ- ఈడ- ఏడ- ఆడేరు- పాడేరు- యినుతిసేసె - అషువలె- ఇషువలె- ఉండాడు- ఆడదారి- బొమ్మడు- వచ్చేని- పొయ్యేని- ఇవి గ్రామ్యములు. ఇతరులను నిందించుటకు గ్రామ్యము నుపయోగింతురు. తక్కుచోట్ల దీనిని బ్రయోగింపరాదు.

## Exercise.

1. సంస్కృతమునం దుండి తెనుఁగున లేనియక్షరము లెవ్వి? 2. తెలుఁగులో మాత్రముండి సంస్కృతములో లేనియక్షరము లెవ్వి? 3. తెనుఁగుభాషలో నేయక్షరములకు ముందే సున్న యుండును? 4. ఈమూఁడుప్రశ్నలసహాయమున నీదిగువవి సంస్కృతపదములో తెలుఁగుపదములో చెప్పుము. ఎంత-ఒంటె-చెండు-కొంప-చక్కిలము-చాప-జాజి-జొంపము-కొఱడు-చెఱకు-మెఱుపు-ఋషి-ధూపము-గాఢము-సింహము-అంతఃకరణము-పీఁట-మూఁగ. 5. అచ్చు లెవ్వి? దీర్ఘాచ్చులు-వక్రములు-వక్రతమములు-వ్రాయుము. 6. హల్లు లెవ్వి? పరుషములు- సరళములు- అంతస్థములు- ఊష్మములు- వ్రాయుము. 7. ఏయచ్చులతోఁగూడిన చ-జ-లు తాలవ్యములు-వేనితోఁగూడిన -చ-

జ-లు దంత్యములు? 8. య-ర-ల-వ-లలో నేవి లఘువులు? ఏవి యలఘువులు?. 9. తళ తళ-శ్రీశైలము-కళవరము-ఏళులు-ఊళులు-పేళులు-త్రాళులు-వీనిలోని యలఘుల కారము లెవ్వి? 10. ద్రుతమని దేనికి పేరు: ద్రుతప్రకృతికములను జేర్చుచు నుదాహరణములను వ్రాయుము. 11. పాఠ్యపుస్తకములోని పద్యములపదవిభాగమును జేసి వానిలో నేవి కళలో యేవి ద్రుతప్రకృతికములో వ్రాయుము. 12. తత్సమమన నేమి? తద్భవమన నేమి? 5 తత్సమపదములను, 5 తద్భవపదములను వ్రాయుము. 13. దేశ్యములన నేమి? 5 దేశ్యపదములను వ్రాయుము. 14. గ్రామ్యములని వేనికిఁ బేరు? రెండుఅనింద్యగ్రామ్యములను రెండు నింద్యగ్రామ్యములను నుదాహరింపుము. 15. శకటరేఫములకు సంబంధించిన మూఁడుసూత్రముల నుదాహరణములతోఁ డ వ్రాయుము,

# 2. సంధిప్రకరణము

## i అచ్సంధులు.

1. పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు: మొదటిపదముచివర నుండు అచ్చునకును, తరువాత నున్న పదము మొదట నున్న అచ్చునకును బదులుగా రెండవపదము మొదటి అచ్చొక్కటియే వచ్చుట సంధి అనఁబడును.

చింత....ఆకు = చింత్....అ + ఆ....కు = చింత్....ఆ....కు = చింతాకు.

2. ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు: హ్రస్వ-ఉ-కారమునకు అచ్చు పరమయినపుడు సంధి నిత్యము(=తప్పకవచ్చును).

బాలుఁడు...అడిగెను...బాలుఁడడిగెను.
వరము...ఇచ్చెను...వరమిచ్చెను.
వారు...ఏఁగిరి...వారేఁగిరి.

3. ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును: ను- కొఱకు- కు- అందు- అనువిభక్తుల యొక్క-యు, క్రియాపదములచివరశత్రర్థమునందు వచ్చు-చు-రొక్క-యు హ్రస్వ-ఉ- కారమునకు సంధి వైకల్పికము(=ఒకసారి వచ్చుట-ఒకసారి రాకుండుట).

| | |
|---|---|
| నన్నుఁ . . ఏలె ... | నన్నేలె. <br> నన్ను నేలె. |
| నాకొఱకుఁ ... ఇచ్చె ... | నాకొఱకిచ్చె. <br> నాకొఱకు నిచ్చె. |
| నాకుఁ ... ఇష్టము ... | నాకిష్టము. <br> నాకు నిష్టము |
| నాయందుఁ ... అనురక్తి. | నాయందనురక్తి. <br> నాయందు ననురక్తి. |
| ఆడుచుఁ ... ఉండెఁ ... | ఆడుచుండెఁ. <br> ఆడుచునుండెఁ. |

4. ఉద్భిన్నాచ్చులకు సంధి లేదు: సంధి లేనిచోట స్వరంబు కంటెం బరంబయినస్వరంబునకు యడాగమం బగు: హ్రస్వ-ఉ-కారమునకుఁదప్ప తక్కినయచ్చులకు సంధి లేదు. సంధి రానియప్పుడు రెండవయచ్చునకుఁ బూర్వము-యు-కార మధికముగా వచ్చును.

ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు క్రొత్త యక్షరము అధికముగా వచ్చుట ఆగమము

హంస ... ఏది ... హంస యేది.
రవి ... ఉదయించెను ... రవి యుదయించెను.
వన్నె ... ఒల్లె ... వన్నె యొల్లె.
ఇచ్చునో ... ఈయఁడో ... ఇచ్చునో యీయఁడో.
మా ... అమ్మ ... మాయమ్మ.
మీ ... ఊరు ... మీయూరు.

5. శ్రేష్ఠతావాచకంబులు పరంబు లగునపుడన్ని యచ్చులకును సంధి నిత్యము: అయ్య-అమ్మ-అప్ప-ఆయి- మొదలయిన శ్రేష్ఠతావాచకములు పరమగునపుడు అన్నియచ్చులకును సంధి నిత్యముగా నగును.

భద్ర ... అయ్య .... భద్రయ్య.
లక్ష్మి ... అమ్మ .... లక్ష్మమ్మ.

6. అత్తునకు సంధి బహుళముగా నగు: హ్రస్వ-అ-కారమునకు సంధి బహుళము. i. కొన్నియెడల సంధి నిత్యముగా వచ్చుట, ii. కొన్నియెడల వైకల్పికముగా వచ్చుట, iii. కొన్నియెడల రాకుం

డుట, iv. కొన్నియెడల నితరకార్యములుకూడ వచ్చుట, అనునది బహుళ మనఁబడును.

i. శ్లిష్టతావాచకంబులును, ఆకు-ప్రభృతులును బరమైయి నపుడు హ్రస్వ-అ-కారమునకు సంధి నిత్యము.

సీత ... అమ్మ ... సీతమ్మ.
చింత ... ఆకు ... చింతాకు.

ii. మేనామలహ్రస్వ-అ-కారమునకు సంధి వైకల్పికము.

మేన ... అత్త ... { మేనత్త / మేనయత్త

చొచ్చిన ... ఇల్లు ... { చొచ్చినిల్లు / చొచ్చినయిల్లు

iii. స్త్రీవాచక, తత్సమ, సంబోధ, నావధారణాంతంబులకును, వెలయాల్యాదులకును సంధి లేదు.

అత్త .... అడిగెను .... అత్త యడిగెను.
దూత .... ఏఁగెను ... దూత యేఁగెను.
రాముఁడ .... ఇదిగో .... రాముఁడ యిదిగో.
మీర ... ఎఱుంగుదురు .... మీర యెఱుంగుదురు.
వెల .... ఆలు .... వెలయాలు.

7. ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు : ఏమి-మొదలుగాఁ గలశబ్దములహ్రస్వ-ఇ-కారమునకు సంధి వైకల్పికము.

ఏమి- మఱి- కిమర్థి- అది- అవి- ఇది- ఇవి-ఏది- ఏవి- ఇది యాకృతిగణంబు. హ్రస్వ-ఇ-కారమునకు వైకల్పికసంధి వచ్చుట యనుపోలిక గలపదము లన్నియును,-ఏమ్యాదులని యెఱుంగునది.

ఏమి .... అయ్యా .... { ఏమయ్యా. / ఏమి యయ్యా.

మఱి .... ఒకటి .... { మఱొకటి. / మఱి యొకటి.

పతికిన్ .... ఇచ్చె .... { పతి కిచ్చె / పతికి నిచ్చె

8. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగును: ప్రథమపురుషక్రియల చివరలందును, ఉత్తమపురుషక్రియల చివరలందును ఉన్న హ్రస్వ-ఇ- కారమునకు సంధి వైకల్పికము.

వచ్చిరి .... అమరులు .... { వచ్చి రమరులు / వచ్చిరి యమరులు

చూచితిమి .... అంబను .... { చూచితి మంబను / చూచితిమి యంబను

కొలిచితిని .... అబ్ధిజన్ .... { కొలిచితి నబ్ధిజన్ / కొలిచితిని యబ్ధిజన్

పలికితిన్ ... ఇట్లు .... { పలికి తిట్లు / పలికితి నిట్లు

9. మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును: మధ్యమపురుషక్రియలచివరలం దున్న హ్రస్వ -ఇ- కారమునకు సంధి నిత్యము.

సేవించితివి .... అచ్యుతున్ .... సేవించితి వచ్యుతున్.
సేవించితి .... అచలజన్ ... సేవించి తచలజన్.
సేవించితిరి ... అబ్జజున్ .... సేవించితి రబ్జజున్.

10. క్త్వార్థం బైనయిత్తునకు సంధిలేదు: క్త్వార్థకక్రియారూపములచివరలం దున్న హ్రస్వ -ఇ-కారమునకు సంధి లేదు.

మెచ్చి .... ఇచ్చెను .... మెచ్చి యిచ్చెను.

11. ఇఁకాదులకుఁదప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. ఉకారాంతప్రథమేతరవిభక్తులు-శత్రర్థకచువర్ణము -ఇఁకాదులు- తప్ప తక్కిన ద్రుతప్రకృతికములకు సంధి లేదు.

కొలుతున్ .... అవనిజన్ .... కొలుతు నవనిజన్.
చూచెన్ ... అతఁడు ... చూచె నతఁడు.
చూడన్ .... అయితిని .... చూడనయితిని.
చూచెడిన్ .... అతఁడు .... చూచెడి నతఁడు.

ఇఁక-ఇఁగ- ఎట్టకేలకు-ఎట్టకేని- ఈయవి యిఁకాదులని యెఱుంగునది. వీనికి సంధి వైకల్పికము.

ఇఁకన్ .... అయినన్.... { ఇఁక యినన్ / ఇఁక నయినన్

ఎట్టకున్ .... ఏని .... { ఎట్టకేని / ఎట్టకు నేని

12. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు : అచ్చు మొదటఁ గలపదము రెండుసారులు వచ్చినయెడల, అన్ని

యచ్చులకును సంధి నిత్యముగా వచ్చును. కొన్నియెడల వైకల్పిక ముగాఁగూడ వచ్చును.

ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు : రెండు మాఱు లుచ్చరింపఁబడినశబ్దములలో రెండవదానిని ఆమ్రేడిత మందురు.

ఔర .... ఔర.... ఔరౌర.

అహా .... అహా .... అహాహా.

ఎట్టూ .... ఎట్టూ .... ఎట్టెట్టూ

ఓహో .... ఓహో .... ఓహోహో.

ఏది .... ఏది .... { ఏదేది / ఏది యేది

13. అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు. ప్రత్యయములయు, ఆగమములయు, ఆదేశము లయు, అచ్చులు పరమైనపుడు సంధి నిత్యముగా వచ్చును. అందు- అనుప్రత్యయమును అవ- అను ఆగమమును బరమైనపుడు కొన్నియెడల సంధి నిత్యముగాను, కొన్నియెడల వైకల్పికముగాను వచ్చును.

జేన .... ఎఁడు .... జేనెఁడు.

నాతి .... ఉక .... నాతుక.

ఓసర .... ఇంచు .... ఓసరించు.

హనుమ .... ఆన .... హనుమాన.

విష్ణునందున్ - విష్ణునియందున్; అగ్నియందున్; తొమ్మిదవ - తొమ్మిదియవ; పదునొకటవ.

## Exercise.

1. ఈక్రిందివానిని విడఁదీసి సంధికార్యములను వివరించి సూత్రములను చెప్పుము : 1. రావాకు. 2. మేనల్లుడు. 3. రెండుంగరము. 4. ఆడుచునుండె. 5. ఏమేమీ. 6. నిర్జించు. 7. మానెఁడు. 8. కొమ్మయింద. 9. అనునోయనఁడో. 10. అడుగునోయడుగడో. 11. రోయీవి. 12. చూడకున్నాడు. 13. నాశ్రయము. 14. మాయూవు. 15. నాయందనురాగము. 16. నీవ యడిగితివి. 17. భీముఁడ యరిభీముఁడ. 18. కవి యేడి.. 19. ధాత యిచ్చెను 20. మఱేమి. 21. వచ్చి రబలలు. 22. వచ్చెడి నావులు. 23. వచ్చియిచ్చెను 24. చూచితి వార్యులను. 25. చదివి తమరము. 26. ఆడిరప్పుడు. 27. పాడితి రిప్పుడు. 28. ఏవేవి. 29. ఎట్టకే నిట్లనియె. 30. దేవుఁ డొక్కఁడే.

2. ఈదిగువవానిని గలిపి వ్రాయుచు, సూత్రములను చేర్కొనుము: 1. ఇంట ఉండెను. 2. ఎదుటకు ఏఁగెను. 3. ఓహో అనెను. 4. పుట్టిన ఇల్లు. 5. అక్క అడిగెను. 6. అమ్మా అక్క ఏది. 7. విధాత్యుఁడు ఏ మన్నావో. 8. ఊరక ఉండెను. 9. రావి ఆకు. 10. కంచి ఆరాత. 11. శతృవులను ఓర్చెను. 12. పూలకొలకు అరిగెను. *13.* తెచ్చిరి అంజనము. 14. చనుచుండి అర్యులు. 15. చూచి అడిగెను. *16.* ఆహా ఆహా. *17.* ఎట్టకేలకు అడిగెను. *18.* ఇచ్చిరివి ఆశీర్యము. *19.* ఇచ్చిరి అగ్రహారములు. *20.* పోలవ అయితి. **21.** ఏమి అయ్యా. *22.* వీని ఎడు. *33.* వ్రాసితి అప్పుడు. 24. వన్నె ఒల్లె. 25. నాకు ఇష్టము. 27. కంకుబట్ట అడుదమె. 27. ఇనక ఉండెను. 28. ఏది అమ్మ.

## ii. ఆదేశసంధులు

14. కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల అచ్చుల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు: కుఱు- చిఱు- కడు- నడు- నిడు అను నీయైదుశబ్దములకును అచ్చు పరమయినప్పుడు సినిచివరలం దున్న -ఱ-డ అనువానికి బదులుగా ద్విత్వటకారము వచ్చును.

కుఱు .... ఊపిరి .... కుట్టూపిరి.
చిఱు .... అడవి .... చిట్టడవి.
కడు .... అలుక .... కట్టలుక.
నడు .... ఏఱు .... నట్టేఱు.
నిడు .... ఊరుపు .... నిట్టూరుపు.

15. ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగును: ప్రథమావిభక్తిలో నున్న పదములకుఁ బరమందున్న -క-చ-ట-త-ప లకుఁ గ్రమముగా-గ-జ-డ-ద-బ-లు వైకల్పిముగావచ్చును.

వాఁడు .... కనియె .... { వాఁడు గనియె / వాఁడు కనియె
వీఁడు .... చెప్పె .... { వీఁడు సెప్పె / వీఁడు చెప్పె
అతఁడు .... టక్కరి .... { అతఁడు డక్కరి / అతఁడు టక్కరి
ఇతఁడు .... తగవరి .... { ఇతఁడు దగవరి / ఇతఁడు తగవరి
నిజము .... పలికె .... { నిజము వలికె / నిజము పలికె

ఈకార్యము కళ లగుక్రియాపదములమీఁద సహితముకానంబడియెడి : కళ లగుక్రియాపదములకుఁ బరమం దున్న-క-చ-ట-త-ప-లకుఁ గూడఁ గ్రమముగా గ-స-డ-ద-వ లాదేశంబగును(=ఒకదానిస్థానమున మఱియొకవర్ణమువచ్చుట ఆదేశము).

వినరు.... కదా .... { వినరుగదా / వినరుకదా }

తునిమి .... పోయెను.... { తునిమివోయెను / తునిమిపోయెను }

16. తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గ-స-డ-ద-వ-లు-రావు: తెలుఁగుపదములకు పరమయిన సంస్కృతపదముల మొదట నున్న, క-చ-ట-త-ప-లకు మాత్రము గ-స-డ-ద-వ-లు రావు.

వాఁడు .... కమలాక్షుఁడు .... వాఁడు కమలాక్షుఁడు
వీఁడు .... చిత్రజ్ఞుఁడు .... వీఁడు చిత్రజ్ఞుఁడు
అతఁడు .... టంకాయుధుఁడు .... అతఁడు టంకాయుధుఁడు
ఇతఁడు .... తామరసవైరి .... ఇతఁడు తామరసవైరి
అతఁడు .... పరబ్రహ్మము .... అతఁడు పరబ్రహ్మము

17. ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ-స-డ-ద-వ-లగు: ద్వంద్వసమాసమునందు రెండవ పదమునకు మొదటనున్న-క-చ-ట-త-ప-లకుఁ గ్రమముగా గ-స-డ-ద-వ- లాదేశం బగును.

కూర .... కాయ ... కూరగాయలు
కాలు .... చేయి .... కాలుసేతులు
టక్కు .... టెక్కు .... టక్కుడెక్కులు
తల్లి .... తండ్రి ... తల్లిదండ్రులు
ఊరు .... పల్లె .... ఊరువల్లెలు

18. ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళములగు: ద్రుతప్రకృతికములకుఁ బరమం దున్న-క-చ-ట-త-ప-లకు నిత్యముగా-గ-జ-డ-ద-బ-లు ఆదేశ మగును.

తెఱచెను .... కన్నులు .... తెఱచెను గన్నులు
నేర్చెను .... చదువులు .... నేర్చెను జదువులు
చేసెను .... టక్కులు .... చేసెను డక్కులు
మాన్చెను .... తగవులు .... మాన్చెను దగవులు
ఎత్తెను .... పడగలు .... ఎత్తెను బడగలు

**19.** ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు: ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు మాఱుగా సరళములు వచ్చినతరువాత ఆసరళములకుఁ బూర్వమందున్న ద్రుతము, i. బిందువుగా మాఱుటో, ii. మీఁది హల్లుతోఁ గలిసిపోవుటో (=సంశ్లేషము) iii. అది యట్లుండుటో (=స్వత్వము) జరుగును.

తెలచెనుగన్నులు ... { తెలచెంగన్నులు / తెలచెఁగన్నులు / తెలచెన్గన్నులు }

నేర్చెనుజదువులు .... { నేర్చెంజదువులు / నేర్చెఁజదువులు / నేర్చెన్జదువులు }

చేసెనుడక్కులు .... { చేసెండక్కులు / చేసెఁడక్కులు / చేసెన్డక్కులు }

మానెనుదగవులు .... { మానెందగవులు / మానెఁదగవులు / మానెన్దగవులు }

ఎత్తెనుబడగలు .... { ఎత్తెంబడగలు / ఎత్తెఁబడగలు / ఎత్తెన్బడగలు }

**20.** ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు. దుృతమునకు సరళములును స్థిరములును బరమయినపుడు ఆదుృతము (i) లోపించుటో, (ii) మీఁది హల్లుతోఁ గలియుటో, (iii) దాని నిజరూపముతో నుండుటో జరుగును.

తెచ్చెను ... గంగ = { తెచ్చెగంగ / తెచ్చెన్గంగ / తెచ్చెనుగంగ }

పుచ్చెను .... సద్గతికి = { పుచ్చెసద్గతికి / పుచ్చెన్సద్గతికి / పుచ్చెనుసద్గతికి }

**21.** వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి: ద్రుతమునకు ఒత్తక్షరము

లును, సరళములును బరమయినపుడు ఆద్రుతమునకుఁ బూర్ణబిందువు వచ్చినప్రయోగములుకూడ నచ్చటచ్చటఁ గాన్పించుచున్నవి.

కాంచెను ... భూమిజన్ ... కాంచెం భూమిజన్.

కల్మిన్ ... జనించు ... కల్మిం జనించు.

నీకున్ ... దక్కితి ... నీకుం దక్కితి.

22. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు: వాక్యములయు, పద్యపాదములయు, చివరలం దుండు ద్రుతముయొక్క యచ్చుగాని ద్రుతముగాని, బహుళముగా లోపించును.

వెలయఁజేసెన్ – వెలయఁజేసె – వెలయఁజేసెను.

అహో! దైవము దోసకారులకు తోడై వచ్చు నెప్పట్టునన్.

23. అఁట-యిఁక-చుఁడు-శబ్దంబులందప్పనుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు: అఁట-ఇఁక-చుఁడు-అను మూఁడుపదములలోను పదముయొక్క మొదటిహ్రస్వాచ్చునకుఁ దరువాత నఱసున్నలున్నవి. ఇవిగాక మఱియేపదములయందును మొదటి హ్రస్వాచ్చునకుఁ దరువాత నఱసున్నలుండవు, ద్రుతమునకు లోపమును గలుగదు. ఈద్రుతము i. పూర్ణబిందువుగా మాఱుటో, ii. మీఁది హల్లుతోఁ గలియుటో, iii. స్వత్వరూపముతో నుండుటో చూచుచున్నాము.

ముంజేయి. కొంచెమట. కందోయి – కన్దోయి – కనుదోయి.

24. తాను- నేను- పదంబులద్రుతంబునకు సంశ్లేషంబు లేదు: తాను-నేను-పదముల ద్రుతములు మీఁదిహల్లుతోఁ గూడియుండవు. తా-నే-లు దీర్ఘములు గావున వీనికిఁబరమందు పూర్ణబిందువులు రావు.

తాను .... చెప్పె .... { తాఁజెప్పె / తానుజెప్పె }

నేను .... చదివితి .... { నేఁ జదివితి / నేను జదివితి }

25. సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు: సమాసముచేసినపుడు మొదటిపదము చివర నుండుద్రుతము లోపించును,

ఎల్లయాళ్ళయాప్తులు – ఎల్లకెదువులు,

26. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు : సమాసములందు ద్రుతము స్వత్వరూపముతో నుండఁజాలదు. "గండును గోయిల" వంటి సమాసము లుండవని యెఱుంగునది.

27. తలఁబ్రాలు- మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు: తలఁబ్రాలు- మొదలుగాఁగలసమాసములలోని మొదటి పదముతుదఁ గలద్రుతముమాత్రము లోపించుట లేదు. ఇది బిందువుగాఁ గాన్పించుచున్నది.

తలఁబ్రాలు–ఒడిఁబ్రాలు–సేసఁబ్రాలు–ఊరఁబంది–ఊరఁబిచ్చుక–తోడఁబుట్టువు–తోఁబుట్టువు–ఒల్లఁబాటు–ఒడఁబాటు–ఇత్యాదులు.

## Exercise.

i. ఈ దిగువ వానిని విడఁదీసి వీనియందలి సంధికార్యములను ససూత్రముగ వివరింపుడు;— 1. హారంగొలిచి, 2. తాఁ జదివె, 3. కట్టుసురు, 4. నిట్టూర్పు, 5. ఎల్లతావులు, 6. వాఁడు సనేను, 7. సిరిచంచలము, 8. పలుకుదు సత్యము, 9. ఈ వేల్పుతోయాధిపతి, 10. అపుడు గరుణించె, 11, అంబఁగొలిచెద, 12. శుభంబుఁ బడసెద, 13. లేదుగదా, 14. కాంచెంబావ, 15. వచ్చెనతఁడు. 16 చిగురుఁగైదువు, 17. తోఁడఁబుట్టువు, 18. గండుఁగోయిల, 19. అక్క–సెల్లెండ్రు, 20. కట్టాయితము, 21. చిట్టెలకి, 22. సిరిగలవాఁడు.

ii. ఈ దిగువ వానిని గలుపుము;— 1. చిఱుఎలుక, 2. వాఁడుటక్కరి 3. రారుకదా, 4. ఎపుడుచనియె, 5. వాఁడుకమంతుఁడు 6. కూడుకూర, 7. మెచ్చెనుచెయ్వులు, 8. విరిసెను కమలములు, 9. పాడెను గంధర్వుఁడు, 10. మొగిడెను పద్మము, 11. మెఱసెను ఖడ్గము, 12. నిర్వ్యాజతన్, 13. వటవిటపి నీడ నెలమి వసించెన్. 14. ముందుచేయి, 15. కన్‌దోయి, 16. తానుచదివె, 17. నేనుచూచితిని, 18. ఎల్లపాలకులు, 19. ఊరన్‌పంది, 20. హారన్‌గొలిచెదన్.

### iii. ఆ గ మ సం ధు లు

28. సమాసంబుల నుదంతంబు లగు * స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు : సమాసములందు హ్రస్వ-ఉ-కారము చివరఁగల స్త్రీసమములకును, పు-ంపు-లకును, పరుషములుగాని సరళములుగాని పరమయినపుడు ఆహ్రస్వ-ఉ-కారమునకు దరువాత-ను-వర్ణము అధికముగా వచ్చును.

* ప్రథమావిభక్తి ప్రత్యయములు లోపించిన పదములు స్త్రీసమములు

పరుషములు పరమయినపుడు (సూ. 19 చే) ద్రుతమునకు i. పూర్ణబిందువు ii. ఖండబిందువు iii. సంశ్లేషము వచ్చి మూఁడు రూపములు గలుగును. సరళములు పరమయినపుడు (సూ. 20,21 లచే) i. పూర్ణబిందువు ii. లోపము iii. సంశ్లేషము వచ్చి మూఁడురూపములు గలుగును. ప్రత్యేకముగా విధించికొనినది గావున నీద్రుతమునకు లోపము లేదు. సమాసంబునందలిది గావున (26 సూ. చే) స్వత్వరూపముతో నుండఁజాలదు.

గండు .... కోయిల .... { గండుంగోయిల, గండుఁగోయిల, గండుఙ్గోయిల }

అలరు .... జొంపములు .... { అలరుజొంపములు, అలరుఞ్జొంపములు, అలరుంజొంపములు }

సరసపు .... పలుకు.... { సరసపుంబలుకు, సరసపుఁబలుకు, సరసపుమ్బలుకు }

కనకంపు.... బొమ్మ.... { కనకంపుబొమ్మ, కనకంపుమ్బొమ్మ, కనకంపుంబొమ్మ }

29. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు-టు-గాగమం బగు: కర్మధారయసమాసములందును, షష్ఠీతత్పురుషము మొదలగు సమాసములందును మొదటిపదముచివర నుండు హ్రస్వ ఉ-కారమునకు అచ్చు పరమయినపుడు ఆహ్రస్వ-ఉ-కారమునకుఁ దరువాత టు-వర్ణ మధికముగా వచ్చును.

విచ్చు .... ఆకు .... విచ్చుటాకు
మించు .... అద్దము .... మించుటద్దము
మదపు .... ఏనుఁగు .... మదపుటేనుఁగు
వేల్పు .... ఆవు .... వేల్పుటావు
చెక్కు .... అద్దము .... చెక్కుటద్దము

30. కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు: కర్మధారయసమాసమునందు పేరు-

మొదలగు* రేఫాంతశబ్దముల తుదిహ్రస్వ ఉ-కారమున కచ్చు పరమయి నపుడు ఆహ్రస్వ-ఉ-కారముతరువాత వైకల్పికముగా టు-వర్ణ మధిక ముగా వచ్చును.

పేరు .... ఆమని .... { పేరుటామని / పేరామని

వెదురు .... ఆకు .... { వెదురుటాకు / వెదురాకు

అలరు .... అమ్మ .... { అలరుటమ్మ / అలరమ్మ

వ్యవస్థితవిభాషచే పేరోలగ మనుచో టుగాగమంబు లేదు.

31. పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధార యంబునందు రుగాగమం బగు: పేద- మొదలగు శబ్దములు-ఆలు-అను శబ్దముతోఁగూడి కర్మధారయసమాసము లయినపుడు, పేద-మొద లగువానికిఁ దరువాత రు-వర్ణ మధికముగా వచ్చును.

పేద .... ఆలు .... పేదరాలు
బీద .... ఆలు .... బీదరాలు

పేద- బీద -ముద్ద- బాలెంత- [illegible] అయిదువ- మనుమ- గొడ్డు- ఇత్యాదులు పేదాదులు.

32. కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగు నపు డత్వం[illegible] కుత్వంబును రుగాగమంబు నగు: హ్రస్వ అ-కారము చివరఁ గలతత్సమపదములు ఆలు-శబ్దముతోఁగూడి కర్మధారయసమా సము లయినపుడు ఆతత్సమపదములతుది-అ-కారమునకు -ఉ-కారమును, దానికిఁ బరమందు-రు-వర్ణ మధికముగాను, వచ్చును.

పూజ్య .... ఆలు .... పూజ్యురాలు.
సామంత .... ఆలు .... సామంతురాలు.

ఈ రెండు సూత్రములందలి యుదాహరణములలోను-ఆలు-అను శబ్దమునకు స్త్రీ- లేక- ఆఁడుది-అనియర్థము.

33. కర్మధారయంబులందు మువర్ణకమునకుం బుంపు లగు: కర్మధారయసమాసములందును, షష్ఠీసమాసములందును మొదటిపద

---

* "రేఫవిరామదియుత్వమ్ముల కెల్ల వికల్పమ్ముగ నటువుగలిగియుండు"- గణపవరపు వేంకటకవి.

ముచివరనుండు-ము (=౦బు)-వర్ణకము (=ప్రత్యయము) నకు బదులుగా-పు-౦పు-లు వచ్చును.

నిక్క-ము .... గతి .... { నిక్క-పుగతి / నిక్క-౦పుగతి

కనకము .... బొమ్మ .... { కనకపుబొమ్మ / కనక౦పుబొమ్మ

సి౦గము .... కొదమ .... { సి౦గపుఁగొదమ / సి౦గ౦పుఁగొదమ.

34. ఉద౦త మగుతద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమ౦ బగు: హ్రస్వ ఉ-కారముచివరఁగల తద్ధర్మార్థక విశేషణము నకు అచ్చు పరమయినపుడు ఆవిశేషణముతరువాత ను-వర్ణ మధిక ముగా వచ్చును.

రక్షి౦చు .... అ౦బ .... రక్షి౦చున౦బ.

రక్షి౦చెడు .... అ౦బ .... రక్షి౦చెడున౦బ.

35. షష్ఠీసమాసమున౦ దుకారఋకారముల కచ్చు పరమగున పుడు నుగాగమ౦ బగు: షష్ఠీసమాసములో మొదటిపదముచివర నున్న హ్రస్వ ఉ-కారమునకుఁగాని-ఋ-కారమునకుఁగాని యచ్చుపరమయినపు డా-ఉ-కార-ఋ-కారములకుఁ దరువాత-ను-వర్ణ మధికముగా వచ్చును.

దనుజు(నియొక్క-) .... అనుజు౦డు .... దనుజునను జు౦డు

సవిత్రు (నియొక్క-) .... ఉదయము .... సవిత్రునుదయము

36. ఉద౦తస్త్రీసమ౦బులకును, బు౦పులకును, నద౦తగుణవాచక౦బులకును, దన౦బు పర౦ బగునపుడు నుగాగమ౦ బగు: హ్రస్వ ఉ-కారము చివరఁగల స్త్రీసమములకును- పు-౦పు-లకును, హ్రస్వ అ-కారముచివరఁగలగుణవాచకములకును,-తనము-అనుప్రత్యయము పరమయి నపుడు ఆస్త్రీసమాదులకుఁ జివర-ను-వర్ణ మధికముగా వచ్చును.

నీటు .... తనము .... { నీటు౦దనము / నీటుఁదనము / నీటునతనము

సరసపు ... తనము.... { సరసపుందనము / సరసపుఁదనము / సరసపున్దనము }

అగ్గలంపు....తనము.... { అగ్గలంపుందనము / అగ్గలంపుఁదనము / అగ్గలంపున్దనము }

చక్క .... తనము .... { చక్కందనము / చక్కఁదనము / చక్కన్దనము }

37. సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు: ప్రాఁత- మొదలగునవి మొదటి పదములుగాఁ గలసమాసములందు, ఈపదములయొక్క మొదటి యచ్చునకుఁ దరువాత నున్న యక్షరము లన్నియు (అఱసున్నయు, తదితరాక్షరములును) బహుళముగా లోపించును:

ప్రాఁత .... అందలము ... ప్రాయందలము, ప్రాఁతయందలము
లేఁత .... నవ్వు .... లేనవ్వు, లేఁతనవ్వు
పూవు .... మొగడ ... పూమొగడ, పూవుమొగడ

38. లుప్తశేషంబునకుం బరుషములు పరములగునప్పుడు నుగాగమం బగు: 37 వ సూత్రముచే లోపింపఁగా మిగిలినప్రాఁతాదులతొలి యక్షరములకు-పరుషములు పరమయినపుడు ఆలుప్తశేషములకు తరువాత-ను-వర్ణ మధికముగా వచ్చును.

ప్రాఁత .... కడియము .... ప్రాఁగడియము.
లేఁత .... చిగురు .... లేఁజిగురు.
పూవు .... తూపు ... పూఁదూపు,
మీఁదు .... కడ .... మీఁగడ.
కెంపు .... తమ్మి .... కెందమ్మి.
చెన్ను .... తోవ .... చెందోవ.

సమాసమునందు-చెన్ను-శబ్దమునకు-ఎఱుపు-అనియర్థము. 37లో లోపము బహుళముగా నగునని చెప్పుటచే మీఁదు - మొదలగువాని యందిల్లోపము నిత్యముగా వచ్చును. ప్రయోగముల ననుసరించిచేసిన నియమము గావున నీద్రుతమునకు మీఁదిహల్లుతో సంయోగములేదు.

39. క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు:
క్రొత్త-శబ్దముయొక్క తొలియచ్చుమీఁదివర్ణములు లోపింపఁగా మిగిలిన మొదటియక్షరములకుఁ బరుషములు పరములయినపుడు కొన్నిప్రయోగములందు నుగాగమమును, మఱికొన్నిట నా మొదటియక్షరమునకుఁ బరమం దున్న హల్లునకు ద్విత్వమును గాన్పించుచున్నవి.

క్రొత్త .... చాయ .... క్రొంజాయ.
క్రొత్త .... తమ్మి .... క్రొందమ్మి,
క్రొత్త .... పుట్టము .... క్రొంబుట్టము.
క్రొత్త .... కారు .... క్రొక్కారు.
క్రొత్త .... తావి .... క్రొత్తావి.

క్రొత్తశబ్దముయొక్క యాద్యక్షరశేషమునకు పరుషములుగాక తక్కినయక్షరములు పరమైనపుడు నుగాగము రాఁజాలదు గావున ద్విత్వమే వచ్చును.

క్రొత్త .... గండి .... క్రొగ్గండి.
క్రొత్త .... నెల .... క్రొన్నెల.
క్రొత్త .... ముడి .... క్రొమ్ముడి.

పరుషేతరములు పరమయినపుడు బిందువులు వచ్చిన 'కెంధూళి-కెంజడలు' అనుప్రయోగములు కాన్పించుచున్నవి.

ప్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళముగా నగునని చెప్పుటచే (i) మీఁదు- మొదలగువానియందు లోపము నిత్యమనియు, (ii) క్రొత్తకుండ- మొదలగువానియందు లోపము రాదనియు, (iii) ప్రాయందలము- ప్రాఁతయందలము- మొదలగువానియందు లోపము వైకల్పికమనియు (iv) క్రీఁదల- మొదలగువానియందు విధింపని దీర్ఘముకూడ వచ్చినదనియు నెఱుంగునది.

40. ఆమ్రేడితంబు పరంబగునపుడు [illegible] మీఁది వర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్తటకార[illegible]

తము పరమయినప్పుడు కడ- మొదలగువాని మొదటియచ్చునకుఁ దరువాత నున్న అన్నియక్షరములకును బదులుగా హ్రస్వ అ- కారము చివరఁగల ద్విత్వటకారము వచ్చును. మిక్కిలి యనునర్థమును సూచించుటకై రెండుమాఱులు వచ్చినశబ్దముపట్లనే యిది వర్తించును.

కడ .... కడ .... కట్టకడ

తుద .... తుద .... తుట్టతుద

కడ- ఎదురు-కొన- చివర- తుద- తెన్ను- తెరువు- నడుము- పగలు- పిడుగు- బయలు- మొదలు- ఇత్యాదులు కడాదులు.

41. ఆమ్రేడితంబు పరంబగునప్పుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు: ఆమ్రేడితము పరమయినప్పుడు మొదటిపదముచివర నుండు ప్రత్యయములు బహుళముగా లోపించును.

అచ్చటన్ ... అచ్చటన్ .... అచ్చటచ్చటన్, అచ్చటనచ్చటన్

అంతకున్ .... అంతకున్ .... అంతకంతకున్, అంతకునంతకున్

ఇంటికిన్ .... ఇంటికిన్ .... ఇంటింటికిన్; ఇంటికినింటికిన్

ఊరన్ ... ఊరన్ ... ఊరూరన్, ఊరనూరన్

ఇంచుక- నాఁడు - మొదలగుశబ్దముల కామ్రేడితము పరమయినప్పుడు వీని చివరయక్షరములు వైకల్పికముగా లోపించును.

ఇంచుక .... ఇంచుక .... ఇంచించుక, ఇంచుకించుక

నాఁడు .... నాఁడు .... నానాఁడు, నాఁడునాఁడు

42. చేత-తోడ-వలన-ల కిత్వంబు సమాసంబులం దగు: అలుక్సమాసంబులందు- చేత-తోడ-వలన-అనుప్రత్యయముల చివరలం దున్న హ్రస్వ అ-కారములకు మాఱుగా హ్రస్వ ఇ-కారములు వచ్చును.

వైరిచేతన్ .... ఖడ్గము ... వైరిచేతిఖడ్గము.

రామునితోడన్ ... వైరము .... రామునితోడివైరము.

దనుజువలనన్ .... కీడు ... దనుజువలనికీడు.

43. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు: అలుక్సమాసంబులందు-అందు-ఇందు-ఎందు- అనువానిచివరలందు- అలి-అనునది అధికముగా వచ్చును.

నాయందున్ .... కరుణ .... నాయందలికరుణ.
ఇందున్ .... మునులు ... ఇందలిమునులు.
ఎందున్ .... తలిరులు .... ఎందలితలిరులు.

44. అది-యవి-శబ్దంబులయుత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు: సమాసములందు త్తరపదములుగా నున్న-అది-అవి- శబ్దములహ్రస్వ అ-కారమునకు లోపము బహుళముగా నగును.

నీ .... అది .... నీది, నీయది
నీ .... అవి .... నీవి, నీయవి

45. పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు: "పడు-పట్టు-పాటు-పఱుచు-పుచ్చు-పెట్టు-పోవు-"మున్నగుశబ్దములు పరమయినపుడు వానికర్మవాచకముల చివరలందుండువిభక్తి-ము-వైకల్పికముగా లోపించును.

సంతసము...పడు... { సంతసపడు / సంతసంపడు / సంతసముపడు }

సూత్రము...పట్టు... { సూత్రపట్టు / సూత్రంపట్టు / సూత్రముపట్టు }

## Exercise.

I. ఈదిగువవానిని విడఁదీసి వీనియందలి సంధికార్యములను సమూత్రముగ వివరింపుము;— 1. చిగురుగ్గొడుపు 2. చిగురుటాకు. 3. వేల్పుటేఱు. 4. పువ్వుంబోణి. 5. పేరుటురము. 6. సరసపుటలుక. 7. మనుమరాలు. 8. గుణవంతురాలు. 9. బెళుకుంజూపులు. 10. బాలెంతరాలు. 11. సరసపువచనము. 12. వాదపుఁబంతములు. 13. విధాతృనానతి. 14. నల్లఁదనము. 15. క్రొందళుకు. 16. మున్నీరు. 17. మత్తుటేనుగు. 18. రాఘవునాజ్ఞ. 19. సెత్తావి. 20. మొట్టమొదట. 21. విక్రమపుగతి. 22. ఘోరంపుఁబని. 23. నీయందలికరుణ. 24. నీచేతిప్రోత్తు. 25. శ్రమపడు.

II. ఈక్రిందివానిని గలుపుము;— 1. పేరుఉరము. 2. మోసముపుచ్చు. 3. నాయందున్‌కరుణ. 4. నావలనన్‌నేరము. 5. వేలుపుఅవు. 6. బెట్టిదముతలిపు. 7. కడకడ. 8. ఇంటన్‌ఇంటన్. 9. సరసముఅలుక. 10. సింగముకొదమ. 11. పుల్లతనము. 12. కలకుఅమ్ము. 13. విరసముపలుకు. 14. ఇగురుజొంపములు

15. కొమలలు. 16. ధీరలలు. 17. నిలువుటద్దము. 18. నీచేతకాఖడ్గము. 19. చెక్కుటద్దము. 20. నెతినడుము. 21. క్రొత్తవిరి. 22. కెంపుతమ్మి. 23. దరహాసము చంద్రిక. 24. ఇంటికి ఇంటికి. 25. విరసముతనము.

## 3. వాక్యములు (Sentences)

1. మనము మాట్లాడునప్పుడు వాక్యముల నుపయోగింతుము:

వాల్మీకి రామాయణమును రచించెను.
శ్రీకృష్ణుడు శిశుపాలుని జంపెను.
ఆవులను మళ్ళించినవాడే యర్జునుడు.

ఈమూడును సంపూర్ణ మగునభిప్రాయములను బ్రకటించుచున్నవి. ఇవి పదముల సమూహములవలన నేర్పడుచున్నవి.

" సంపూర్ణాభిప్రాయమును వెల్లడించుపదసముదాయమును వాక్య మందురు.

2 నిర్దేశములు, ప్రశ్నలు, కోర్కెలు, రాగవాక్యములు నని వాక్యము నాలుగువిధములు.

i. ఒకవిషయమునుగూర్చి చెప్పువాక్యములు నిర్దేశములు (Statements)

వ్యాసుడు భారతమును రచించెను.
శివుడు మన్మథుని భస్మముచేసెను.
రాజు శత్రువులను జయించుచున్నాడు.

ii. ఒకవిషయమునుగూర్చి ప్రశ్నించువాక్యములు ప్రశ్నలు: (Questions).

రాజరాజనరేంద్రునిముఖ్యపట్టణ మేది?
బౌద్ధమత మెవరు స్థాపించిరి?
ప్రమాణ మెట్లు కలుగుచున్నవి?

ప్రశ్నవాక్యముల చివరలందు ప్రశ్నచిహ్నమును (=?) వేయుదురు.

iii. ఆజ్ఞాపనలను, విజ్ఞాపనలను, ప్రార్థనలను, దీవనలను బ్రకటించు వాక్యములు కోర్కెలు (Desires).

మంచిగుణముల నలవరించికొనుము,
రావే, కావవే వరద, సరక్షింపు భద్రాత్మకా.
మీకు శుభం బగుగాక.

నిర్దేశములయు, కోర్కులయు చివరలందు బిందువులను (=.) ఉంతురు.

iv. తాత్కాలికముగ మనమనస్సులందుఁ బుట్టునాశ్చర్యాది రాగములను బ్రకటించువాక్యములను రాగవాక్యములు (Exclamations) అందురు.

అపు డ్వెంతచక్కగా నున్నది !
సీత యెంతవిద్వాంసురా లైనది !
యశోదానందు లెంత పుణ్యాత్ములో కదా !

రాగవాక్యములచివరలం దాశ్చర్యార్థకచిహ్నమును (= ! ) వేయుదురు.

వాక్యవిశ్లేషణము (Analysis).

3 ప్రతివాక్యమును ఏదో ఒకదానినిగూర్చిన ఏదో ఒక విషయమును జెప్పుచుండును; కావున ప్రతివాక్యమునందును రెండుభాగము లుండును. మనము దేనినిగూర్చి చెప్పుచున్నామో దానినామాదులు గలభాగమును కర్తృభాగ మందురు: మన మొకదానినిగూర్చి ఏమి చెప్పుచున్నామో దానిని క్రియాభాగ మందురు.

సూర్యుఁడు ఉదయించెను.

అనువాక్యములో మనము సూర్యునిగూర్చి చెప్పుచున్నాము. కావున 'సూర్యుఁడు' అనునది కర్తృభాగము. సూర్యుని యుదయించుటనుగూర్చి మనము చెప్పుచున్నాము. కావున 'ఉదయించెను' అనునది క్రియాభాగము.

(a) వాక్యముయొక్క కర్తృభాగములో i. కర్తృపదమును, ii. దాని విశేషణములును ఉండును.

తెల్లని హంసలు మానసపసరోవరమున కెగిరిపోవుచున్నవి.

ఇందు తెల్లనిహంసలు-అను కర్తృభాగములో-హంసలు- అనునది కర్తృపదము, తెల్లని- అనునది విశేషణము.

(b) వాక్యముయొక్క క్రియాభాగములో i. కర్మపదము, ii. క్రియాపదము, iii. వీని విశేషణాదులు ఉండును.

తెలివిగలయా బాలుఁడు చక్కని పుస్తకమును త్వరగాఁ జదివెను.

ఇందు బాలుఁడు- అనునది కర్తృపదము. తెలివిగల-ఆ- అనునవి దీని విశేషణములు. చక్కనిపుస్తకమును త్వరగాఁ జదివెను- అనునది క్రియాభాగము. ఈక్రియాభాగములో చక్కనిపుస్తకమును - అను కర్మవాచకమును, దాని విశేషణమును;— త్వరగాఁ జదివెను- అను క్రియాపదము దాని విశేషణమును గలవు.

మనము వాక్యముల నీదిగువవిధముగ విశ్లేషింపవచ్చును.

| కర్తృభాగము | | క్రియాభాగము | | | | |
|---|---|---|---|---|---|---|
| కర్త | విశేషణము | కర్మ | విశేషణము | క్రియ | విశేషణము | అవ్యయములు |
| బాలుఁడు | తెలివిగల ఆ | పుస్తకమును | చక్కని | చదివెను | త్వరగా | ,, |

అవసరమునుబట్టి యీపట్టికలో క్రియ— అనుదానిని సమాపకము- అసమాపకము- అని రెండు విభాగములుగఁగూడఁ జేసికొనవచ్చును.

ఈదిగువవాక్యములలోని పదములను పైపట్టికలోవలె విశ్లేషించి వ్రాయుఁడు:

1. రాముఁడు సీతను పెండ్లాడెను.
2. అర్జునుఁడు వాఁడిబాణములను త్వరగా వేసెను.
3. అనల్లనిబాలుఁడు ఈచక్కనికన్యను వెంటనే పెండ్లిచేసికొనెను.
4. గోవిందుఁడు తెల్లని యావును చౌకగా కొనెను.
5. పుణ్యాత్ముఁడైనయాభక్తుఁడు సునాయాసముగ మరణించెను.
6. దుర్యోధనాదులు లక్కయింటిని నిర్దయులయి తగులఁబెట్టిరి.
7. ఈదారుణమైనవార్త వానిని వెంటనే మూర్ఛిల్లఁజేసెను.
8. భరతుఁడు రాముపాదుకలను భక్తితో నభిషేకించెను.
9. ఎఱ్ఱని సూర్యబింబమును హనుమంతుఁడు పండుగా భావించెను.
10. హనుమంతుఁడు సముద్రమును చిఱాలున దాఁటెను.

# 4. భాషాభాగములు

1. తెలుఁగుభాషలోనిపదములు 1. విశేష్యములు, 2. విశేషణములు, 3. సర్వనామములు, 4. క్రియలు, 5. అవ్యయములు అని ఐదు విధములు.

2. పేరును జెప్పునది విశేష్యము లేక నామవాచకము (noun)

శివుఁడు-కృష్ణుఁడు- చెట్టు-పక్షి-ఆదివారము- గోదావరి- రాత్రి-చిన్నతనము- జబ్బు- గీత- మంద- మోద- రాగి- బంగారము.

3. నామవాచకముల యర్థమును బెంపొందించుపదములు విశేషణములు (adjectives).

నల్లని- తెల్లని- తియ్యని- దయగల- అందమైన- నల్లనిమేక- తెల్లనిపువ్వు- తియ్యనిపండు- దయగలగురువు- విశ్వాసముగలబంటు- అందమైనవిగ్రహము.

4. నామవాచకమునకు బదులుగా నుపయోగింపఁబడు పదములు సర్వనామములు. (Pronouns).

బాలుఁడు చదువుచున్నాఁడు. వాఁడు తెలివిగలవాఁడు.

ఆవు వచ్చుచున్నది. అది మంచి మృగము.

బాలిక బడికిఁ బోవుచున్నది. ఆమె శ్రావ్యముగాఁ బాడును.

నీవు బడికి వచ్చెదవా ? నేను వచ్చెదను.

ఈయిల్లు మీది. అదిమాది.

5. వ్యాపారములను జెప్పుపదములు క్రియలు (Verbs):

రాముఁడు చదువుచున్నాఁడు- పక్షులు ఎగురుచున్నవి- ఎద్దులు దున్నుచున్నవి- పంటలు పండెను- వర్షము కురియును- గోవిందుఁడు ర ను-

6. లింగవిభక్తివచనములు లేనిపదములు అవ్యయములు (Indeclinables)

బాలుఁడు చక్కగా చదివినాఁడు-గుఱ్ఱము వడిగా పరుగెత్తినది-వాఁడు నిన్నవచ్చెను - ఆమె ఇక్కడ లేదు - చెట్టుమీఁద కోఁతి కూర్చున్నది - ఆహా! ఎంత చక్కనిబొమ్మ.

# ౫. నామవాచకములు (Nouns)

1. మనుష్యులనుగాని, వస్తువులనుగాని, పేర్కొనుట కుపయోగించుపదములు నామవాచకములు.

విష్ణుమూర్తి-ఆవు-మంద-బంగారము-చీకటి-పులుపు-చిన్నతనము-గీత.

## ౧. విభాగములు (Kinds)

2. సంజ్ఞావాచకములు (Proper nouns) సాధారణవాచకములు (Common nouns), సమూహవాచకములు (Collective nouns), ద్రవ్యవాచకములు (Material nouns), గుణాదివాచకములు (Abstract nouns) అని నామవాచకము లయిదువిధములు.

3. ఒక మనుష్యునియొక్కగాని, యొక వస్తువుయొక్కగాని ప్రత్యేకనామమును సంజ్ఞావాచకము (Proper noun) అందురు.

రాముడు-జటాయువు-గంగ-గోదావరి-వింధ్యము-శార్దూలము-కౌమోదకి-భారతము-రామాయణము-కలకత్తా-రాజమహేంద్రవరము-ఆసియా-ఆఫ్రికా.

4. ఒకేజాతికి జెందినవాని కన్నింటికిని సామాన్యముగా నుపయోగించు పేరులు సాధారణనామములు (Common nouns).

మనుష్యుడు-గోవు-సింహము-చెట్టు-నది-పర్వతము-ఊరు-దేశము.

5. ఒకేజాతికిగాని, ఒకే తెగకుగాని, చెందినవానిసమూహములను జెప్పునవి సమూహవాచకములు (Collective nouns)

గుంపు-సభ-మంద-గుంపు-పిండు-తోపు-మోద-గుచ్ఛము-కవిలె.

6. వస్తువు లేపదార్థమువలన నేర్పడుచుండునో యాపదార్థముల పేరులను ద్రవ్యవాచకములు (Material nouns) అందురు.

బంగారము-వెండి-మన్ను-కట్టె-ఇనుము.

7. గుణములను, అవస్థలను, కర్మలను జెప్పునవి గుణాదివాచకములు (Abstract nouns).

తీపు-చేదు-పులుపు-బాల్యము-వార్ధకము-యౌవనము-చిన్నతనము-పెద్దతికము-చెలిమి-వంట.

8. నామవాచకములకు లింగము, విభక్తి, వచనము, కలవు.

## ౨. లింగము (Gender).

9. వీఁడు పురుషుఁడు, ఈమె స్త్రీ, ఇది స్త్రీపురుషులలో నేదియును గాదని చెప్పునది లింగము (Gender).

తెలుఁగుశబ్దములను భాషానైసర్గికమునుబట్టి i. మహదర్థకములు ii. అమహదర్థకములు నని రెండువిభాగములుగఁ జేసియున్నారు.

i. పురుషులపేరులు మహదర్థకములు ii తక్కినవానిపేరులమహదర్థకములు.

i. మహదర్థకములు : రాముఁడు-కృష్ణుఁడు_గోవిందుఁడు-మనుమఁడు-తాత.

ii. అమహదర్థకములలోని వగు స్త్రీవాచకములను మహతీవాచకము లందురు సీత-రుక్మిణి-లక్ష్మి-మనుమరాలు-అమ్మ-వదినె.

తక్కినవి యమహత్తులు : ఎద్దు- ఆవు- గుఱ్ఱము- గోడిగ- పాము- పక్షి- పర్వతము- మేఘము- గోడ.

సంస్కృతశబ్దములు- పుంలింగములు- స్త్రీలింగములు- నపుంసకలింగములు- నని మూఁడువిధములు. ఈభాషలో లింగము శబ్దముల నాశ్రయించియుండునేకాని యర్థమునుబట్టి యుండదు. దార-భార్యా-కళత్ర- శబ్దములు మూఁడింటికి నర్థ మొక్కటేయైనప్పటికిని నివి క్రమముగా పుంస్త్రీనపుంసకంబు లగుచున్నవి. తత్సమశబ్దములకు వాని ప్రకృతుల లింగములే యుండును. బాలుర యుపయోగార్థ మిటఁ గొన్ని సంస్కృతశబ్దములను వాని స్త్రీలింగరూపములను బొందుపఱిచెదను.

| పుం. | | స్త్రీ. | పుం. | | స్త్రీ. |
|---|---|---|---|---|---|
| ఉపాధ్యాయుఁడు | — | ఉపాధ్యాయాని, ఉపాధ్యాయి | పితామహుఁడు | — | పితామహి |
| కుమారుఁడు | — | కుమారి | పుత్త్రుఁడు | — | పుత్త్రి |
| గంధర్వుఁడు | — | గంధర్వి | భగవంతుఁడు | — | భగవతి |
| గాయకుఁడు | — | గాయకి | యువకుఁడు | — | యువతి |
| దేవుఁడు | — | దేవి | రాక్షసుఁడు | — | రాక్షసి |
| ధీమంతుఁడు | — | ధీమతి | విద్వాంసుఁడు | — | విదుషి |
| సఖుఁడు | — | సఖి | వృద్ధుఁడు | — | వృద్ధ |
| పతి | — | పత్ని | కపోతము | — | కపోతి |
| రాజు | — | రాజ్ఞి | మయూరము | — | మయూరి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్షత్రియుఁడు | — | క్షత్రియ | మర్కటము | — | మర్కటి |
| తనూజుఁడు | — | తనూజ | మహిషము | — | మహిషి |
| బాలుఁడు | — | బాల | శునకము | — | శుని |
| యోగ్యుఁడు | — | యోగ్య | హంస | — | హంసి |

### 3. విభక్తి (Case)

10. సంస్కృతమునందువలెనే తెనుఁగునందుఁగూడ నెనిమిదివిభక్తులు గలవు. ఆయావిభక్తుల నిటఁ బొందుపఱిచెద.

డు-ము-వు-లు—ప్రథమ (Nominative case)
ని-ను-లన్—ద్వితీయ (Accusative Case)
చేత-చే-తోడ-తో—తృతీయ (Instrumental Case)
కొఱకు-కై — చతుర్థి (Dative Case)
వలన-కంటె — పంచమి (Ablative Case)
కి-కు-యొక్క-లో-లోపల — షష్ఠి (Possessive Case)
అందు-న — సప్తమి (Locative Case)
ఓ-ఓయి-ఓరి-ఓసి — సంబోధనప్రథమ (Vocative Case)

11. ప్రథమ-కై-షష్ఠి-యొక్క-తప్ప తక్కినప్రత్యయము లన్నిటి చివరను నకార ముండును: రామునిన్ - రామునిచేతన్ - రామునికొఱకున్-రామునికంటెన్-రామునికిన్-రామునియందున్-వనమునన్.

బాలురచే నీదిగువశబ్దములయన్నిరూపములను జెప్పించి వ్రాయింపవలయును :

రాముఁడు-కృష్ణుఁడు-మనుష్యుఁడు-అల్లుఁడు-బాలుఁడు-తమ్ముఁడు-హరి-కవి-బంతి-చెవి. తరువు-మనువు-గోవు-విష్ణువు-ధేనువు-వృక్షము-ధనము-అన్నము-బెల్లము - దైవము

### 4. ఔపవిభక్తికములు

12. పైన చెప్పినవిభక్తులకు సమీపమున వచ్చు- ఇ- టి- తి- వర్ణములను ఉపవిభక్తు లందురు. ఉపవిభక్తులు గలపదములను ఔపవిభక్తికము లనుచున్నారు.

13. డు- ను- న్న- యి- రు- ఱు- ట్టు- లి- లు- ల్లు- అనునవి చివరలఁగలకొన్ని శబ్దములకు ద్వితీయ మొదలగు విభక్తులు పరమయి

నపుడావిభక్తిప్రత్యయములకు ముందు- ఇ- టి- ంటి- తి- అనునుప విభక్తులు బహుళముగా వచ్చును. సమాసములందుఁగూడ వీని కీయుప విభక్తులు వచ్చుచుండును.

త్రాడు — త్రాటిని — త్రాటిమెలి
మ్రాను — మ్రానిని — మ్రానిపసుపు
కన్ను — కంటికి — కంటిఱెప్ప
నేయి — నేతితో — నేతిగిన్నె
నీరు — నీటియందు — నీటివెల్లువ
ఏఱు — ఏటిని — ఏటినీరు
అఱ్ఱు — అఱుతన్ — అఱుతితోడవు
గొడ్డలి — గొడ్డటికై — గొడ్డటిదెబ్బ
కాలు — కాలిని — కాలిగోరు
ఇల్లు — ఇంటిని — ఇంటికప్పు

బాలురు వ్రాయునపుడును జదువునపుడును నేవి యేపవిభక్తికములో నేవి కావో గుర్తింపవలయును. ఈదిగువశబ్దములను బాలురచేఁ జెప్పించి వ్రాయింపవలయును :

త్రాడు- కన్ను- మన్ను- మిన్ను- నేయి- గోయి- చేయి- వాయి- ఊరు- ఏఱు-అఱ్ఱు- కొఱ్ఱు- కొడవలి- కోడలు- చెలియలు- మఱదలు- విల్లు, పల్లు- మల్లు.

### కొన్ని విశేషాంశములు

14. ము- అను ప్రత్యయమునకు బదులుగా -మ్ము -ంబు- లు కూడ వచ్చుచుండును :

వృక్షము- వృక్షమ్ము- వృక్షంబు.

15. లు-ల-న- అను ప్రత్యయములు పరమయినపుడు వానికిఁ బూర్వమం దున్న -ము- వర్ణమునకు లోపంబును, దానికిఁబూర్వమునం దున్న హ్రస్వాచ్చునకు దీర్ఘమును నొక్కొకప్పుడు వచ్చుచుండును.

ఉ. వజ్రములు- వజ్రాలు- వజ్రాన. డెందములు- డెందాలు- డెందాన.

16. ఔపవిభక్తికశబ్దముల తృతీయాసప్తములకు -అ- త్వము వచ్చును.

కంటన్ - నీటన్ - గొడ్డటన్ - గోరన్,

## ౫. వచనము (Number)

17. తెనుఁగున *i.* ఏకవచనము (Singular Number) ii. బహువచనము (Plural Number) అని రెండువచనములు గలవు.

*i.* ఒక్కదానిని జెప్పుప్రత్యయ మేకవచనము.

*ii.* పెక్కింటిని జెప్పుప్రత్యయము బహువచనము.

18. సాధారణముగాఁ బ్రథమైకవచనరూపములకు -లు- వర్ణకమును జేర్చుటవలన బహువచనరూపము లేర్పడును :

| ఏ | | బ | ఏ | | బ |
|---|---|---|---|---|---|
| ఆకు | ... | ఆకులు | మేఁక | ... | మేఁకలు |
| దూడ | ... | దూడలు | పిట్ట | ... | పిట్టలు |
| పాము | ... | పాములు | గోవు | ... | గోవులు |
| వనము | ... | వనములు | మనువు | ... | మనువులు |

19. డుమంతములకు -లు- వర్ణకమును జేర్చుటవలన వాని బహువచనరూపము లేర్పడును.

| ఏ | | బ | ఏ | | బ |
|---|---|---|---|---|---|
| రాముఁడు | ... | రాములు | మనుమఁడు | ... | మనుమలు |
| కృష్ణుఁడు | ... | కృష్ణులు | బ్రాహ్మణుఁడు | ... | బ్రాహ్మణులు |

20. హ్రస్వ -ఇ- కారము చివరఁగలశబ్దములకు బహువచన-లు- వర్ణకము పరమయినపుడు, వాని తుది-ఇ-త్వమునకు ఉ-త్వమువచ్చును.

| ఏ | | బ | ఏ | | బ |
|---|---|---|---|---|---|
| హరి. | ... | హరులు | బావి | ... | బావులు |
| కవి | ... | కవులు | పిల్లి | ... | పిల్లులు |

21. కొన్నిశబ్దముల బహువచన -లు-వర్ణకమునకు -రు-వర్ణంబగు

| ఏ | | బ | ఏ | | బ |
|---|---|---|---|---|---|
| గోపాలుఁడు | ... | గోపాలురు | అల్లుఁడు | ... | అల్లురు |
| నృపాలుఁడు | ... | నృపాలురు | బాలుఁడు | ... | బాలురు |

22. కొన్నిశబ్దముల బహువచన -లు-వర్ణకమునకు బదులుగాఁ బూర్ణబిందుపూర్వక -డ్రు- వర్ణము వచ్చును. ఈ -ండ్రు- పరమయి నపుడు ప్రాతిపదికము చివర నుండు -లు- వర్ణము లోపించును.

| ఏ | | బ | ఏ | | బ |
|---|---|---|---|---|---|
| ఆలు | ... | ఆండ్రు. | మఱఁదలు | ... | మఱఁదండ్రు. |
| కోడలు | ... | కోడండ్రు. | జవరాలు | ... | జవరాండ్రు. |
| చెల్లెలు | ... | చెల్లెండ్రు. | గండఁడు | ... | గండండ్రు. |

23. కొన్ని శబ్దముల బహువచన -లు- వర్ణకంబునకు బదులుగాఁ బూర్ణబిందుపూర్వక -డ్రు- వర్ణముగాని, -ఱు- వర్ణముగాని వచ్చును.

| ఏ | | బ | | |
|---|---|---|---|---|
| ఆటకాఁడు | ... | ఆటకాండ్రు | ... | ఆటకాఱు. |
| వేఁటకాఁడు | .... | వేఁటకాండ్రు | .... | వేఁటకాఱు. |

24. బహువచన -లు- వర్ణకము పరమయినపుడు కొన్ని శబ్దముల తుదియక్షరములు నిత్యముగాను, మఱికొన్ని టియంతిమాక్షరములు వైకల్పికముగాను లోపించును.

| ఏ | | బ | ఏ | | బ | | |
|---|---|---|---|---|---|---|---|
| చేను | .... | చేలు. | ఆవు | .... | ఆవులు | .... | ఆలు. |
| పేను | ... | పేలు. | చుట్టము | .... | చుట్టములు | .... | చుట్టలు |
| మీను | .... | మీలు. | జాము | .... | జాములు | .... | జాలు. |
| రేయి | .... | రేలు | మాసము | .... | మాసములు. | .... | మాసలు |
| వ్రాయి | .... | వ్రాలు | తెరువు | .... | తెరువులు | .... | తెరులు. |
| ఱాయి | .... | ఱాలు | ధేనువు | .... | ధేనువులు | .... | ధేనులు |

25. బహువచన -లు- వర్ణకము పరమయినపుడు శబ్దముల చివరలందుండు -డ-ల-ర- వర్ణములకు మాఱుగా -ళ- కారము బహుళముగా వచ్చును. ఇందలి -డులు- లులు -రులు- లకు బదులుగా -ళ్లు- కూడ వచ్చును.

| ఏ. | | బ. |
|---|---|---|
| వ్రాఁడు | .... | వ్రాఁడులు, వ్రాఁళులు, వ్రాళ్లు |
| గుమ్మడి | .... | గుమ్మడులు, గుమ్మళులు, గుమ్మళ్లు |
| అంబలి | .... | అంబలులు, అంబళులు, అంబళ్లు. |
| పిడికిలి | .... | పిడికిలులు, పిడికిళులు పిడికిళ్లు |
| పందిరి | .... | పందిరులు, పందిళులు, పందిళ్లు |
| గోరు | .... | గోరులు, గోళులు, గోళ్లు |
| ఊరు | .... | ఊరులు, ఊళులు, ఊళ్లు |

26. బహువచన-లు-వర్ణకము పరమయినపుడు-డ-ల-ట-ర-వర్ణంబుల ఉ-కారము బహుళముగా లోపించును.

| ఏ | | బ |
|---|---|---|
| గుండు | .... | గుండులు, గుండ్లు |
| కాలు | .... | కాలులు, కాళ్లు |
| తుంటి | .... | తుంటులు, తుంట్లు |
| గోరు | .... | గోరులు, గోర్లు |

27. లి-ల్లు-వర్ణములు చివరలందుఁ గలయాపవిభక్తికశబ్దములకు బహువచన -లు-వర్ణకము పరమయినపుడా -లి-ల్లు-అనువానికి బదులు -ండు- వర్ణము బహుళముగా వచ్చును.

| ఏ | | బ |
|---|---|---|
| కొడవలి | .... | కొడవండులు, కొడవండ్లు, కొడవళులు, కొడవళ్లు, కొడవలులు. |
| రోఁకలి | .... | రోఁకండులు, రోకండ్లు, రోకళులు, రోకళ్లు, రోకలులు. |
| గొడ్డలి | .... | గొడ్డండులు, గొడ్డండ్లు, గొడ్డళులు, గొడ్డళ్లు, గొడ్డలులు. |
| ఇల్లు | .... | ఇండులు, ఇండ్లు, ఇల్లులు. |
| విల్లు | .... | విండులు, విండ్లు, విల్లులు. |
| ముల్లు | .... | ముండులు, ముండ్లు, ముల్లులు. |

28. కలను- మొదలగుశబ్దములకు బహువచన -లు- వర్ణకము పరమయినపుడు వాని యంతిమ -ను- వర్ణమునకు బదులుగా బిందుపూర్వక -క- వర్ణము వచ్చును. ఇట్లే-రేను- గోను- పదంబుల -ను-వర్ణమునకు బిందుపూర్వక -గు- వర్ణము వచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏ. కలను | ... | బ. కలఁకులు | ఏ. గవను | ... | బ. గవఁకులు |
| కెలను | ... | కెలఁకులు | రేను | ... | రేఁగులు |
| కొలను | ... | కొలఁకులు | గోను | ... | గోఁగులు |

ఈశబ్దంబులకు ద్వితీయాద్యేకవచనములందు వైకల్పికముగను, సమాసములందు నిత్యముగను నీయాదేశం బగును.

కెలఁకునకు- కెలనునకు. గోఁగునార- రేఁగుచెట్టు.

29. ఈదిగువశబ్దములకు బహువచనములు లేవు:

కేలు- నిన్న- పాఁడి- పైఁడి- మాపు- మొన్న- రేపు- వరి, పెసర, మున్నగు సస్యవాచకములు.

30. ఈదిగువశబ్దముల కేకవచనములు లేవు:

ఇరులు- కురులు- పాలు- మనము- అన్ని-అంపజు- వడ్లు, కందులు, పెసలు మున్నగు ధాన్యవాచకములు.

## Exercise.

1. నామవాచకమననేమి? 2. నామవాచకములెన్ని విధములో వివరించి యొక్కొకవిధమునకు రెండేసి యుదాహరణములను వ్రాయుము. 3. లింగమననేమి? సంస్కృతమున లింగమెన్నివిధములు? తత్సమముల లింగము నెట్లునిర్ణయింతువు? 4. తెలుగునకు నైసర్గికమైన లింగవిభేదమును జేర్కొని దానిని వివరించి రకమునకు రెండేసి యుదాహరణముల చొప్పున వ్రాయుడు. 5. ఈదిగువవాని స్త్రీలింగరూపములను వ్రాయుము:— హంస - వృద్ధుఁడు - విద్వాంసుఁడు - మయూరము - పతి-గాయకుఁడు- క్షత్రియుఁడు- యోగ్యుఁడు- మర్కటము- భగవంతుఁడు. 6. ఈదిగువవాని పుంలింగ రూపములను వ్రాయుఁడు:— శుని- పుత్రి- తనూజ-రాజ్ఞి- గంధర్వీ-దేవి- మహిషి- కపోతి- పితామహి- మయూరి. 7. విభక్తులను వ్రాసి వానిలో నేవి కళలో యేవిద్రుత ప్రకృతికములో విపరింపుము. 8. ఉపవిభక్తులననేమి? ఔపవిభక్తికములననేమి? ఉపవిభక్తుల నెప్పుడుపయోగింతురు? నాలుగుదాహరణములను వ్రాయుము. 9. పెక్కుచందాలంబడు - నీవుప్రాణాన- పాదాలు- భీష్మునకున్- ఇంపలి వ్యాకరణవిశేషములను వివరింపుడు. 10. ఈదిగువవాని బహువచనరూపములను వ్రాయుఁడు. గోడ- బాలుఁడు- గురువు- కింకరుఁడు- విరి- కొమరాలు- వేఁటకాఁడు- పేను- ఆవు ఊరు- గొడ్డలి- విల్లు- గోను- కొలను. 11. ఈదిగువవాని యేకవచనరూపములను వ్రాయుము:- కేఁగులు, తాలు, విలుకాఁడు, మనువులు, మునులు, భర్తలు, చెల్లెండ్రు, నృపాలురు, ముల్లులు, ఏళ్లు, మీసలు, ధేనులు. 12. రెండు నిత్యైకవచనములను, రెండు నిత్యబహువచనములను వ్రాయుము.

## సర్వనామములు (Pronouns)

1. నామవాచకములకు బదులుగా వాడఁబడుశబ్దములను సర్వనామము లందురు. నామవాచకమును దిరిగితిరిగి యుపయోగింపకుండుటకివి యుపయోగపడుచుండును.

"రాముఁ డరణ్యమునఁ దిరుగుచుండెను. రాముఁడు జటాయువును జూచెను. జటాయువు రామునితో సీతవార్తను జెప్పి ప్రాణము

లను విడిచెను. రాముఁడు జటాయువున కుత్తరక్రియలు చేసెను". ఈ వాక్యములలో రాముఁడు- జటాయువు- అనునామవాచకములను దిరిగితిరిగి పలుమారు లుపయోగించితిమి. వీనికి బదులుగా సర్వనామముల నుపయోగించిన నీవాక్యము లందముగా నుండును. "రాముఁడరణ్యమునఁ దిరుగుచుండెను. అతఁడు జటాయువును జూచెను. అది యాతనితో సీతవార్తను జెప్పి ప్రాణములను విడిచెను. అంత నాతఁడు దాని కుత్తరక్రియలు చేసెను."

2. అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు- అనునవియు, సంఖ్యావాచకములును గాక తక్కినసర్వనామము లన్నియు- ఆ- ఈ- ఏ- నీ- నా- మన- తా-యనువానినుండి పుట్టుచున్నవి. ఆ-ఈ ఏ-యను వానిని మూఁడింటిని త్రిక మందురు.

3. i. పురుషసర్వనామములు (Personal Pronouns); ii. నిర్దేశకసర్వనామములు (Demonstrative Pronouns); iii. సంబంధసర్వనామములు (Relative Pronouns); iv. ప్రశ్నవాచకసర్వనామములు (Interrogative Pronouns); v. సంఖ్యావాచకసర్వనామములు (Numeral Pronouns); అని తెనుఁగులోని సర్వనామము లైదువిధములు.

1. పురుష సర్వనామములు

4. i. ప్రథమపురుష (Third Person); ii. మధ్యమపురుష (Second Person); iii. ఉత్తమపురుష (First Person); అని పురుష సర్వనామములు మూఁడువిధములు: ఎదుటివానినిగూర్చి చెప్పుట కుపయోగింపఁబడు సర్వనామములు మధ్యమపురుషసర్వనామములు ఏ.నీవు ...బ. మీరు. తన్నుగూర్చి చెప్పుట కుపయోగింపఁబడు సర్వనామములు ఉత్తమపురుషసర్వనామములు ఏ. నేను...బ. మేము. ఇతరులనుగూర్చి చెప్పుట కుపయోగింపఁబడు సర్వనామములు ప్రథమ పురుషసర్వనామములు. ఏ. వాఁడు, ఆమె, అది. బ. వారు, అవి.

1. ప్రథమపురుష (Third person) సర్వనామములు: ప్రథమ పురుషసర్వనామములు ౧. మహద్వాచకములు, ౨. మహతీవాచకములు, 3. అమహద్వాచకములు నని మూఁడు తెఱఁగులు :

౧. మహద్వాచకములు :

1. ఆ-శబ్దము : ఏ. వాఁడు ... బ. వారు - వారలు- వాండ్రు. పూజ్యతను దెల్పుటకు - వాఁడు - నకు బదులుగా - అతఁడు - ఆతఁడు- అనివాడుదురు.

2. ఈ-శబ్దము: ఏ. వీఁడు ... బ. వీరు-వీరలు-వీండ్రు. పూజ్యతను దెల్పుటకు-వీఁడు-నకు బదులుగా-ఇతఁడు- ఈతఁడు-అని వాడుదురు.

3. ఏ-శబ్దము : ఏ. ఏఁడు ... ఏరు
ఎవఁడు ... ఎవరు
ఎవ్వఁడు ... ఎవ్వరు
ఏవాఁడు ... ఏవారు
ఎవ్వాఁడు ... ఎవ్వారు

4. అన్ని-శబ్దము నిత్యబహువచనాంతము. బ. అందఱు.
5. ఇన్ని-శబ్దము. " -బ. ఇందఱు.
6. ఎన్ని -శబ్దము. " -బ. ఎందఱు.
7. కొన్ని -శబ్దము. " -బ. కొందఱు.
8. పెక్కు-శబ్దము. " -బ. పెక్కండ్రు.
9. పలు-శబ్దము " -బ. పలువురు.

౨. మహతీవాచకంబులు :

1. ఆ-శబ్దము : ఏ. ఆమె-ఆపె ... బ. వారు-వారలు-వాండ్రు
2. ఈ-శబ్దము : ఏ. ఈమె-ఈపె... బ. వీరు-వీరలు-వీండ్రు
3. ఏ-శబ్దము : ఏ. ఏమె-ఏపె ... బ. ఎవరు

మహతీవాచకంబులగు-4. అన్ని-5. ఇన్ని-6. ఎన్ని-7. కొన్ని-8. పెక్కు- 9 పలు-శబ్దములరూపములు మహద్వాచకముల రూపములవలెనే యుండును.

౩. అమహద్వాచకములు :

1. ఆ-శబ్దము : ప్ర. ఏ. అది ... బ. అవి
ద్వి. దానిని ... బ. వానిని

2. ఈశబ్దము : ప్ర. ఏ. ఇది ... బ. ఇవి
ద్వి. దీనిని ... బ. వీనిని

[ఆ-ఈ-ఏ- శబ్దంబులకు ద్వితీయాదిబహువచనములందు వాటిని-వీటిని-వేటిని- వంటిరూపంబు లాధునికవ్యవహారంబునఁ గాననయ్యెడి.]

3. ఏ- శబ్దము : ప్ర. ఏ. ఎది - ఏది ... బ. ఎవి - ఏవి
ద్వి. దేనిని వేనిని

4. అన్ని- 5. ఇన్ని- 6. ఎన్ని- 7. కొన్ని- శబ్దములు నిత్య బహువచనాంతములు. ప్రథమావిభక్తియం దివి యీరూపములతోనే యుండును.

8. పెక్కు- శబ్దము. ఏ. పెక్కు ... బ. పెక్కులు.

9. పలు- శబ్దమున కమహదర్థంబున విడిగా ప్రయోగములేదు.
అన్ని- ఇన్ని- ఎన్ని- కొన్ని- పెక్కు- పలు- అనుశబ్దము లమహదర్థంబున నాపవిభక్తికంబులు.

2. మధ్యమపురుష (Second Person) సర్వనామములు :

1. నీ-శబ్దము : ఏ. నీవు ... బ. మీరు - మీరలు
ఈవు... ఈరు ఈరలు

3. ఉత్తమపురుష (First person) సర్వనామములు.

1. నాశబ్దము :- ఏ.నేను ... బ. మేము - నేము
ఏను ఏము

2. మన- శబ్దము నిత్యబహువచనాంతము. నీవు- నేను- అను నర్థముగలది. బ. మనము.

3. తా- శబ్దము. ఆత్మార్థకము:
ఏ. తాను ... బ. తాము-తారు-తమరు.

[ఈశబ్దముల నన్నింటిని బాలురచేఁ జెప్పించి వ్రాయింపవలయును].

2. నిర్దేశకసర్వనామములు (Demonstrative Pronouns)

5. దేనినైనను గనపఱచుట కుపయోగింపఁబడుసర్వనామములను నిర్దేశకసర్వనామము లందురు. ఇవి -ఆ-ఈ- లనుండి పుట్టుచున్నవి. వాఁడు- అతఁడు- వీఁడు- ఇతఁడు- ఆమె- ఈమె- అది- ఇది-యును, వీని బహువచనరూపములును నిర్దేశకసర్వనామములు.

వాఁడు చక్రపాణి- అతఁడు శార్ఙ్గధరుఁడు- ఇతఁడు దామోదరుఁడు- వీఁడు పాకశాసనుఁడు. ఆమె పార్వతి- ఈమె సరస్వతి- వీరు శ్రీభూనీళలు- అది హేమకూటము- ఇది మాల్యవంతము.

3. సంబంధసర్వనామములు (Relative Pronouns)

6. ఏ-ఆ-యనుశబ్దములు నిత్యసంబంధము గలవియై యొకేవ్యక్తిని బోధించుచుండును. ఇట్టినిత్యసంబంధము గలసర్వనామములను సంబంధసర్వనామములు (Relative Pronouns) అందురు. ఎవఁడు- ఎవతె- ఏది- వీనిబహువచనములును సంబంధసర్వనామములు.

ఎవఁడు గజరాజును బ్రోచెనో యాహరి నన్ను రక్షించుఁగాక, ఎవతెరాముని విజయము గలుగునని కలగాంచెనో యామెయే త్రిజట. ఏది సౌందర్యము నొసఁగునో యదియే యలంకారము. ఎందఱు సభకు వచ్చిరో యందఱును నుపన్యసించిరి.

4. ప్రశ్నవాచకసర్వనామములు.

7. ప్రశ్నించుటయం దుపయోగపడుసర్వనామములను ప్రశ్నవాచకసర్వనామములు (Interrogative pronouns) అందురు. ఇవి -ఏ-నుండి పుట్టుచున్నవి. ఎవఁడు? ఎవతె? ఏది? యును, వీనిబహువచనములును ప్రశ్నవాచకసర్వనామములు.

ఎవ్వఁడవురోరి? ఎవ్వతె వీవు? ఏదిపోయినది? ఎందఱు వచ్చిరి? ఎన్నియూళ్లు చూచితివి? ఎంత పట్టుకొని వచ్చితివి?

5. సంఖ్యావాచకసర్వనామములు.

8. i. కేవలసంఖ్యావాచకములు, ii. సంఖ్యేయవాచకములు నని సంఖ్యావాచకసర్వనామములు (Numeral Pronouns) రెండు విధములు.

i. అమహద్వాచకములకు బదులుగా నుపయోగింపఁబడుసంఖ్యావాచకములు కేవలసంఖ్యావాచకములు.

ii. మహద్వాచకములకును మహతీవాచకములకును బదులుగా నుపయోగింపఁబడుసంఖ్యావాచకములు సంఖ్యేయవాచకములు. ఇవి సాధారణముగా సంఖ్యావాచకములకు-గురు-అనుదానిని జేర్చుటవలన నేర్పడును.

i. ఈదిగువయుదాహరణములను బరీక్షింపుము.

1. మానాన్నగారైదుమామిడిపండ్లు తెచ్చినారు : రెండు నాకిచ్చినారు, మూఁడు మాయక్కకిచ్చినారు.

2. మాక్లాసులో పదుగురుకృతార్థులయిరి : నలుగురు మొదటితరగతిలోను నాఱుగురు రెండవతరగతిలోను నుత్తీర్ణులయిరి.

1 లో రెండు, మూఁడు అనునవి రెండుపండ్లు- మూఁడుపండ్లు-అనువానికి బదులుగాఁ బ్రయోగింపఁబడినవి. కావున నివి సంఖ్యావాచకసర్వనామము లగుచున్నవి. ఇవి అమహద్వాచకములకు బదులుగా వాడఁబడినవి కావున నివి కేవలసంఖ్యావాచకము లగుచున్నవి. 2లో -నలుగురు-ఆఱుగురు-అనునవి నలుగురు బాలురు- ఆఱుగురు బాలురు-అనువానికి బదులుగా వాడఁబడినవి, కావున నివి సంఖ్యావాచకసర్వనామములు. ఇవి బాలురు అనుమహద్వాచకమునకు బదులుగా వాడఁబడినవి కావున సంఖ్యేయవాచకములు.

సంఖ్యావాచకములకుఁ దరువాత నామవాచకములున్నవి సంఖ్యావిశేషణము లనియు, నామవాచకములు తరువాత లేనివి సంఖ్యావాచకసర్వనామము లనియు తెలియుంగునది.

9. బాలురయుపయోగార్థము కొన్ని సంఖ్యావాచకములను వానిసంఖ్యేయవాచకములను నిటఁ బొందుపఱిచెద :

| సంఖ్యావాచకము | సంఖ్యేయవాచకము |
|---|---|
| ఒకటి | ఒకఁడు ... ఒకతె |
| ఒక్కటి | ఒక్కఁడు ... ఒక్కతె |
| రెండు | ఇద్దఱు |
| మూఁడు | ముగ్గురు |
| నాలుగు | నలుగురు |
| ఎనిమిది | ఎనమండ్రు |
| తొమ్మిది | తొమ్మండ్రు |
| పది | పదుగురు |
| ఇరువది | ఇరువండ్రు |
|ముప్పది | ముప్పండ్రు |

[బాలురచే నూఱువఱకు సంఖ్యావాచకములను సంఖ్యేయవాచకములను జెప్పించి వ్రాయించునది]

## Exercise.

ఈక్రిందివాక్యములలోని సర్వనామములను వేర్పఱిచి యవి యేయేజాతివో వ్రాయుము.

1. రాముఁడు వనమునకుఁ బోయెను. అతఁడు బంగారులేడిని వెన్నాడెను. దాని నాతఁడు బాణముతోఁ గొట్టెను. వెంటనే అది "హా! లక్ష్మణా!" అనుచు నేలఁ గూలెను.
2. ఆయగ్రహారములో నిరువదియిండ్లున్నవి. వానిలో పదునాలు బ్రాహ్మణులవి.
3. అవిగో నావులు, ఏవి యెవరివో నీవెఱుఁగుదువా ? అవి మావి ; ఇవి మీవి.
4. ఏవానిబంధుమిత్రులు జీవధనంబులుఁ జెడు, వానిని గృశునింగా నెన్నుదురు.
5. నీవు దేనిని గోరిన దానినే యిచ్చెదను.
6. ఎవ్వరు వచ్చిరి ? ఎంత యిచ్చిరి ? ఏది యడిగినారు ? ఏమి చెప్పినావు ?
7. పదుగురు వెళ్ళిరి. వారిలో ముగ్గు రింకను రాలేదు.
8. ఎందఱినో యడిగినాఁడను. ఐదుగురుమాత్రము సమాధానమును జెప్పిరి,

## 7. వి శే ష ణ ము లు (Adjectives)

1. నామవాచకములయు, వ్యాపారములయు గుణాదులను దెలుపుచు వానియర్థమును విస్తరించుపదములను విశేషణము లందురు. 1. తెల్లనిపువ్వులు తెచ్చి నాఁడు. 2. ఐదుపువ్వులుమాత్రము నా కిచ్చి నాఁడు. 3. ఆపువ్వు బాగుగా నున్నది. ఈయుదాహరణములలో పువ్వులు ఎటువంటివి ? ఎన్నిపువ్వులు ఇచ్చినాఁడు ? ఏపువ్వు బాగుగా నున్నది ? ఈప్రశ్నలకు సమాధానములయిన తెల్లని- ఐదు- ఆ- అను నవి విశేషణములు. ఇవి వాని తరువాత నున్న నామవాచకముల యర్థమును బెంపొందించు చున్నవి.

2. విశేషణములను సాధారణముగా విశేష్యములకు ముందే ప్రయోగింతురు. ఉ. తెల్లని తురఁగము.

విశేష్యమునకుఁ దరువాత నుపయోగించిన విశేషణమునువిధేయ విశేషణ మందురు. ఉ. వాఁడు ధనవంతుఁడు- ఆమె గుణవతి.

3. i. నామవిశేషణములు, ii. విధేయవిశేషణములు, iii. క్రియావిశేషణములు, iv. క్రియాజన్యవిశేషణములు, v. క్రియాప్రయుక్త విశేషణములు నని విశేషణము లైదువిధములు.

4. నామవాచకములవిశేషణములను జెప్పునవి నామవిశేషణములు. ఇవి i. గుణవాచకములు, ii. గుణప్రయుక్తవిశేషణములు, iii. సంజ్ఞావిశేషణములు, iv. సంజ్ఞాప్రయుక్తవిశేషణములు, v. జాతిప్రయుక్తవిశేషణములు, vi. ద్రవ్యప్రయుక్తవిశేషణములు, vii. పరిమితివాచకములు, viii. సంఖ్యావిశేషణములు, ix. నిర్దేశకవిశేషణములు, x. ప్రశ్నవిశేషణములు అని పది విధములు.

1. నామవిశేషణములు.

5. నామవాచకములగుణములను జెప్పునవి గుణవాచకములు (Adjectives of Quality): తెల్లతామర- నల్లకలువ- ఇట- తామరయొక్కయు- కలువయొక్కయు గుణములను జెప్పు- తెల్ల- నల్ల- అనునవి గుణవాచకములు.

6. గుణవాచకములకు తచ్ఛబ్దములను జేర్చుటవలన గుణప్రయుక్తవిశేషణము లేర్పడును : మన్మథుఁడు చక్కనివాఁడు- కృష్ణుఁడు నల్లనివాఁడు - రతీదేవి యందమైనది. ఇట "మన్మథుఁడు_కృష్ణుఁడు-రతీదేవి-ఎట్టివారో" చెప్పు- చక్క-నల్ల-అందమైన-అనుగుణవాచకములకు-వాఁడు-అది-అనుతచ్ఛబ్దములను జేర్చుటవలన నేర్పడిన-చక్కనివాఁడు-నల్లనివాఁడు_అందమైనది-అనునవి గుణప్రయుక్తవిశేషణములు. (వాఁడు-వారు-అది-అవి- అనునవి తచ్ఛబ్దము లనఁబడును.)

7. సంజ్ఞావాచకములను ఇతరనామవాచకములకు విశేషణములుగ నుపయోగింతురు. వానిని సంజ్ఞావిశేషణములు (Proper Adjectives) అందురు : ఉ. జపానుమల్లు-ఇంగ్లీషుట్వీల్లు-చైనాయాత్రికుఁడు-జర్మనురంగులు-ఫ్రెంచిరాయబారులు. ఇట- జపాను-ఇంగ్లీషు-చైనా_జర్మను-ఫ్రెంచి-అనుసంజ్ఞలు వీనికిఁబరమందున్ననామవాచకములకు విశేషణము లగుచున్నవికావున నివి సంజ్ఞావిశేషణములు.

8. విశేషణములవలె వాడిన పేరులను సంజ్ఞాప్రయుక్తవిశేషణము లందురు. ఉ: వాఁడు సుయోధనుఁడు-వీఁడు కర్ణుఁడు-ఆమె త్రిజట-ఇది గోదావరి. ఇట సుయోధనుఁడు-కర్ణుఁడు-త్రిజట-గోదావరి-అనునవి వానికిఁ బూర్వమం దున్న సర్వనామములకు విశేషణము లగుచున్నవి. ఇవి సంజ్ఞలు. కావున వీనిని సంజ్ఞాప్రయుక్తవిశేషణము లనుచున్నారు.

9. జాతిని జెప్పువిశేషణములనుజాతిప్రయుక్తవిశేషణములందురు. ఉ॥ పరశురాముఁడు బ్రాహ్మణుఁడు. శ్రీరామచంద్రుఁడు క్షత్రియుఁడు. ఇట-పరశురాముఁడు - శ్రీరామచంద్రుఁడు - అనునామవాచకములకు విశేషణములగు-బ్రాహ్మణుఁడు-క్షత్రియుఁడు- అనుశబ్దములువారిజాతిని జెప్పుచున్నవి, కావున నివి జాతిప్రయుక్తవిశేషణములు.

10. ద్రవ్యవాచకములకు మతుబాదులను జేర్చుటవలన ద్రవ్యప్రయుక్తవిశేషణము లేర్పడును: ఉ॥ కుబేరుఁడు ధనవంతుఁడు. దశరథుఁడైశ్వర్యవంతుఁడు. ఇట-ధనవంతుఁ-డు-ఐశ్వర్యవంతుఁడు-అనునవి వానికిఁ బూర్వపదం దున్న-కుబేరుఁడు- దశరథుఁడు- అనునామవాచకములకు విశేషణము లగుచున్నవి. ఇవి ద్రవ్యవాచకములయిన-ధన-ఐశ్వర్య-శబ్దములకు మతుబాదులను ( మతుప్-మొదలగునవానిని-అనఁగా-వంత-మంత-మున్నగువానిని) జేర్చుటవలన నేర్పడినవి. కావున నివి ద్రవ్యప్రయుక్తవిశేషణము లయినవి.

11. నామవాచకముచేఁ బ్రకటింపఁబడుపదార్థ మెంతగ్రహించి నదియుఁ జెప్పునట్టివిశేషణములను పరిమితివాచకములు (Adjectives of Quantity) అందురు. ఉ॥ వాఁడు చాలఅన్నము తినెను. తమ్మునికి కొంచెము పాలు మిగిలినవి - ఆమె చాలబాధ పడుచున్నది. వాఁడు అంతపాయసమును త్రాగివైచెను. వానికి కావలసినంతధనము నిచ్చెను. వాఁడు కొంచెము అన్నమునుగూడ తినలేదు. ఇట చాల-కొంచెము - అంత - కావలసినంత - అనుపదములు వానితరువాత

నున్న నామవాచకములచేఁ బ్రకటింపఁబడుపదార్థ మెంతెంత గ్రహింపఁ బడుచున్నదో తెలుపుచున్నవి. కావున వీనిని పరిమితి వాచకము లనుచున్నారు.

12. నామవాచకముచేఁ బ్రకటింపఁబడువస్తువుల నెన్నింటిని లేక వాని నేక్రమములో గ్రహించినది ప్రకటించునని సంఖ్యావిశేషణ ములు (Numeral Adjectives). వాఁడు మూఁడు సీతాఫలములను గొనెను. వెంకటేశ్వర్లు మాతరగతిలో మొదటివాఁడు. ఇట-మూఁడు- మొదటి- అనునవి సంఖ్యావాచకవిశేషణములు.

సంఖ్యావాచకవిశేషణములు i. కేవలసంఖ్యావాచకములు (Cardinals) పూరణార్థకములు (Ordinals) అని రెండువిధములు. సంఖ్యావాచకములకు- అవ-. చేర్చుటవలన పూరణార్థకము లేర్పడును. నన్నయభట్టుకాలమునందు పూరణార్థకరూపములు-అగు-చేర్చుటవలన గలుగుచుండెడివి:- "విన నేడగుపర్వము ". ఒకటి - అనుదానికిఁ బూర ణార్థకము లేదు. కావున- ఒకటవ- యనునది తప్పు. దీనికి బదులుగా మొదటి అనియే యుపయోగింపవలయును. రెండు- రెండవ- మూఁడు- మూడవ. ఆఱు- ఆఱవ. పది- పదియవ.

13. మన మేవస్తువు నుద్దేశించుచున్నామో దానినిజూపించుట కుపయోగించువిశేషణములు నిర్దేశకవిశేషణములు (Demonstrative adjectives) : ఆయావు మీది. ఈయావు మాది. ఇట- ఆ- ఈ- లను నవి మన ముద్దేశించినయావును చూపించుట కుపయోగపడుచున్నవి. కావున నివి నిర్దేశకసర్వనామము లగుచున్నవి.

14. ప్రశ్నలందు నామవాచకమునకు ముం దుపయోగించు-ఏ- అనునది ప్రశ్నవాచకవిశేషణము (Interrogative adjective) : ఏయూరికిఁ బోవుచున్నావు ? ఏయావు నిచ్చిరి. ఇట- ఏ- అనునది- ఊరు- ఆవు- అనునామవాచకములకు విశేషణమయి, ప్రశ్నలువేయుట కుపయోగించుచున్నది. కావున నిది ప్రశ్నార్థకవిశేషణముఅగుచున్నది.

## Exercise.

ఈదిగువవాక్యములలోని విశేషణములను జేర్చి—ని :వవి యేయేవిశేషణము లోవివరింపుము :

1. అతఁడు పారసీకరాజు. 2. నల్లని యాఁబోతును జూచితిమి. 3. నాకు ఆఱురూపాయలు దొరకినవి. 4. ఆగేద మాది. 5. ఏపుస్తకము తెమ్మనెను? 6. ఈ పాలుబాగుగానున్నవి. 7. వాఁడుకొంచెము అన్నమును దినెను. 8 అతఁడు విద్వాంసుఁడు. 9. ఇతఁడు కమసాలి. 10. వాఁడు ఉత్తరుఁడు. 11. ఆమె చక్కనిది. 12. వీఁడు తరగతిలో నాల్గవవాఁడు. 13. బర్మాబియ్యము రూపాయకు రెండుకుంచములు. 14. జావా పంచదార కొంటివా? 15. ఈజట్టుప్రత్తి మంచిది. 16. ఈయూరు బాగుగా నున్నది. 17. అయేనుఁగు చాలమంచిది. 18. వాఁడు విద్యావంతుఁడు. 19. వీఁడు బుద్ధిమంతుడు 20. ఆమె శూర్పణఖ. 21. అది యైరావతము. 22. ఇది ఉచ్చైశ్శ్రవము. 23. వాఁడు అందగాఁడు. 24. వీఁడు అందమైనవాఁడు. 25. అది సుందరమైనది. 26. వానికి ముప్పది పుస్తకము లున్నవి. 27. వాఁడు రెండవవాఁడు. 28 ఏపుస్తకము చదువు చున్నావు? 29. ఆపుస్తకమును నాకిమ్ము. 30. తియ్యనిమాట లాడుము.

### ii విధేయవిశేషణములు.

12. విశేష్యమును ముందు చెప్పి, విశేషణమును దరువాతఁ జెప్పినచో నావిశేషణమును విధేయవిశేషణ మందురు. ఉ॥ రాముఁడు శూరుఁడు— లక్ష్మణుఁడు వీరుఁడు— బృహస్పతి బుద్ధిమంతుఁడు. ఇట "శూరుఁడు-వీరుఁడు-బుద్ధిమంతుఁడు" అనువిశేషణములు వానివిశేష్యము లగు-రాముఁడు-లక్ష్మణుఁడు- బృహస్పతి - అనుశబ్దములకుఁ దరువాతఁ బ్రయుక్తమయినవి. కావున నివి విధేయవిశేషణము లగుచున్నవి.

### iii. క్రియావిశేషణములు.

13. క్రియలయొక్క గుణములను దెలుపునవి క్రియావిశేషణ ములు : గుణాదినామములకుఁ (abstract nouns) జివర-కాన్-కన్- అనువానిని జేర్చుటవలన నీక్రియావిశేషణము లేర్పడును. ఉ॥ గుఱ్ఱము వడిగాఁ బరుగెత్తినది. కుక్క బిగ్గఱగా నఱచినది. ఇట- వడిగా- బిగ్గఱగా- అనునవి పరుగెత్తినది- అఱచినది- అనుక్రియలకు విశేషణములు. కావున నివి క్రియావిశేషణములు. క్రియావిశేషణముల నాంగ్లవ్యాకర్తలు వేఱుభాషాభాగముగఁ బరిగణించుచున్నారు.

### iv. క్రియాజన్యవిశేషణములు.

14. ధాతువులనుండి పుట్టినవిశేషణములు క్రియాజన్యవిశేషణములు. ఉ॥ చదువుచున్న బాలుని జూచితిని. చదివినపుస్తకముల నన్నిటిని దాచుము- వానికిఁ జదువఁగలసామర్థ్య మున్నది. వాఁడు చదువని మొద్దు- వీఁడు చదువుబాలుఁడు- వీఁడు చదివెడుబాలుఁడు- వీఁడు చదివెడిబాలుఁడు. ఇట i. చదువుచున్న ii. చదివిన iii. చదువఁగల iv. చదువని v. చదువు vi. చదివెడు vii చదివెడి- అనునేడును చదువు-ధాతువునుండి పుట్టినవి. ఇవి వీనికిఁ దరువాత నున్నవిశేష్యములకు విశేషణములగుచున్నవి. కావున వీనిని క్రియాజన్యవిశేషణములను చున్నారు. ప్రతిధాతువునుండియు నేడేసివిశేషణములు పుట్టుచున్నవి.

### V. క్రియాప్రయుక్తవిశేషణములు.

15. క్రియాజన్యవిశేషణములకుఁ దచ్ఛబ్దమును జేర్చుటవలనఁ గ్రియాప్రయుక్తవిశేషణము లేర్పడును. ఉ॥ వచ్చినవాఁడు ఫల్గునుఁడు- ఆడుచున్న వాఁడె యభిమన్యుఁడు- ఆదుమికెడువాఁడె యుత్తరుఁడు- ఇట వచ్చినవాఁడు, ఆడుచున్నవాఁడు, దుమికెడువాఁడు అనునవి క్రియాప్రయుక్తవిశేషణములు.

## Exercise.

ఈదిగువవాక్యములలోని విశేషణములను వేర్కొని యవి యేయేజాతివిశేషణములో వివరింపుము : 1. నే నాడుచున్న బాలురను జూచితిని. 2. ఏగుచున్న వాఁడె యినకులుండు. 3. రాముఁడు వాలి నేయుచుండఁగాఁ జూచితిని. 4. రాముఁ డుత్తముఁడు. 5. ధ్రువుఁడు భక్తుఁడు. 6. విడిచినపువ్వులను గోయుము. 7. ఈతోఁటలో కాసెడిచెట్లుచాలతక్కువ. 8. కూసెడిగాడిద మేసెడిగాడిదను జెడఁగొట్టినట్లు. 9. భీముఁడు బలశాలి. 10. వాల్మీకి తపశ్శాలి. 11. శివపూజ చేసెడివాఁడు శైవుఁడు. 12. వేదాధ్యయనము చేయువాఁడు వైదికుఁడు 13. అర్చనచేసెడివాఁడు అర్చకుఁడు. 14. విమానములు వేగముగాఁ బోవుచున్నవి.

15. ఉ॥ నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లును దాల్చువాఁడుఁ గడువిప్పగువక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కినభుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైనరఘుసత్తము నెల్లపు డాశ్రయించెదన్॥

# 8. క్రియలు

1. వ్యాపారములను దెలుపుపదములు ధాతువులు. తెలుఁగు ధాతువు లన్నియు- ఉ-కారాంతములు. ఉ. చదువు, వ్రాయు- తిను.

## సకర్మకములు - అకర్మకములు
## (Transitives and Intransitives.)

2. సకర్మకములు అకర్మకములు అనిధాతువులు రెండువిధములు. కర్మలనపేక్షించునవి సకర్మకములు; కర్మల నపేక్షింపనివి అకర్మకములు.

వర్షము కురిసినది - సూర్యుఁడుదయించెను - రాముఁడు వచ్చెను. (దేనిని కురిసినది ? - దేనిని ఉదయించెను ? - దేనిని వచ్చెను ? - అను ప్రశ్నల కవకాశమే లేదు. కావున నివి కర్మల నపేక్షింపనిక్రియలు ) ఇందలిక్రియలు అకర్మకములు.

రాముఁడు పాఠమును జదువుచున్నాఁడు-తమ్ముఁడు అన్నమును దినెను - అమ్మ పాలను బితుకును . (దేనిని చదువుచున్నాఁడు? పాఠ మును. దేనిని తినెను? అన్నమును. దేనిని పితుకును? పాలను. ఈయు దాహరణములం దీప్రశ్నల కవకాశమున్నది . వీనికి సదుత్తరములును గలవు. కాన నివి కర్మల నపేక్షించుక్రియలు. ఇందలిక్రియలుసకర్మకములు.

## Exercise

ఈదిగువవాక్యములలోనిక్రియలు సకర్మకములో అకర్మకములో వ్రాయుఁడు వానికర్తకర్మలను చేర్కొనుఁడు :

1. వాఁడు నాకుఁ గలము నిచ్చెను. 2. నే నాసంగతి తెలుఁగుదును. 3. కాయ ఎదిగినది. 4. నీరు కారినది. 5. పండ్లు పండినవి. 6. బాలుఁడు కుక్కను గొట్టెను. 7. వాఁడు చింత కాయలుకోసెను. 8. ఉపాధ్యాయుఁడుపాఠములను బాగుగాఁ జెప్పెను. 9. ఇల్లు కూలినది. 10. పలక పగిలినది. 11. నీరు కాగినది. 12. పిల్లి నిద్రించు చున్నది. 13. వాఁడు నన్నుతలఁచుకొనుచున్నాఁడు. 14. వాఁడు తిరుగుచున్నాఁడు గాని లెక్కలు చేయుటలేదు. 15. డొంక పెరుగుచున్నది, వాఁడు దానిని నఱకుచు న్నాఁడు 16. మొక్క లెదుగుచున్నవి, కాని కోఁతులు వానిని పెఱికివేయుచున్నవి. 17. వాఁడు గాఢముగా నిద్రించుచున్నాఁడు. వానిని నేనిప్పుడు లేపను. 18. యుద్ధ ములో రాజు పెక్కండ్రను జంపెను; అతనిమనస్సుమారెను, 19. వాఁడు ఉత్తరము లను వ్రాసెను, 20. దేవుని పూజింపుము,

3. డు, రు-వు, రు-ను, ము- అను క్రియావిభక్తులు చివరఁగల ధాతువులను గ్రియ లందురు. చదువుచున్నాఁడు-చదువుచున్నారు-చదువుచున్నాము.

4. క్రియలు సమాపకములు- అసమాపకములు-అని రెండువిధములు. సంపూర్ణమగు అభిప్రాయమును బ్రకటించుక్రియలు సమాపకములు; సంపూర్ణాభిప్రాయమును బ్రకటింపఁజాలనిక్రియలు అసమాపకములు:

కృష్ణార్జును లగ్నికి సహాయముచేసి, వానిచే ఖాండవమును దహనము చేయించిరి. ఇట- చేసి- అనునది అసమాపకక్రియ; చేయించిరి- అనునది సమాపకక్రియ.

సమాపక క్రియలు (Finite Verbs)

5. ప్రతిధాతువునకును నాలుగేసికాలము లున్నవి. ప్రతికాలమునకును మూఁడేసిపురుషము లున్నవి. ప్రతిపురుషమునకును రెండేసి వచనము లున్నవి.

6. వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మకాలము అని కాలములు నాలుగు విధములు.

i. జరుగుచున్నకాలము వర్తమానకాలము. ii. జరిగిపోయిన కాలము భూతకాలము. iii. రాబోవు కాలము భవిష్యత్కాలము. iv. వస్తువులయొక్క సహజము లగుధర్మములను స్వభావములను దెలుపు కాలము తద్ధర్మకాలము. ఇది భూతభవిష్యద్వర్తమాన కాలములను మూఁడింటినిగూడ సూచించుచుండును.

7. ప్రథమపురుష, మధ్యమపురుష, ఉత్తమపురుష, అని పురుషములు మూఁడువిధములు.

i. నేను-మేము-నీవు-మీరు-అనునవిగాక తక్కినశబ్దములు(నామవాచకములును సర్వనామములును) కర్తలుగాఁ గలక్రియలు ప్రథమపురుషములు. (Thrid Person)

ii. నీవు-మీరు-అనునవి కర్తలుగాఁ గలక్రియలు మధ్యమపురుషంబులు (Second Person).

iii. నేను-మేము-అనునవి కర్తలుగాఁగలక్రియలు ప్రథమపురుషములు (First Person).

8. ధాతువులకుఁ జివర నాయాపురుషంబులందు వచ్చుక్రియాప్రత్యయముల నిట వివరించెద.

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | డు | రు |
| మ. | వు | రు |
| ఉ. | ను | ము |

ప్రథమపురుషైకవచనప్రత్యయమగు-డు-కుపూర్వమునందుబిందు వుండును.

1. వర్తమానకాలము (Present tense)

(a) ధాతువునకుఁ బై క్రియాప్రత్యయములను జేర్చునపుడు కొన్ని మార్పులు గలుగుచుండును. వాని నన్నిటిని నిట పేర్కొనక, ధాతువున కెయ్యవి చేర్చిన వానిరూపములు గలుగునో, వాని నిటఁ బొందుపఱిచెద.

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | చున్నాఁడు, చున్నది | చున్నారు, చున్నవి. |
| మ. | చున్నావు | చున్నారు |
| ఉ. | చున్నాను | చున్నాము |

వీనిసహాయమున నేధాతువుయొక్క వర్తమానకాలమునందలి రూపములనైనను వ్రాయఁగలము.

(b) చదువుధాతువు - సకర్మకము - కర్త్రర్థకము

వర్తమానకాలము.

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర. | చదువుచున్నాఁడు, | చదువుచున్నారు |
| | చదువుచున్నది | చదువుచున్నవి |
| మ. | చదువుచున్నావు | చదువుచున్నారు |
| ఉ. | చదువుచున్నాను | చదువుచున్నాము |

## Exercise

ఈదిగువధాతువులవర్తమానకాలములను విద్యార్థులచేఁ జెప్పించి వ్రాయించు

వఱ:- ఇచ్చు-వచ్చు-కోయు-తిను-విను-చూచు-చేయు-వ్రాయు-తలఁచు-తీయు-నోఁచు-

పలుకు-మ్రింగు-వంతు-ఊదయించు-ఎదుగు-కురియు-కూయు-చీల్చు-పీల్చు-కాల్చు-కూల్చు-చను-పడు-అడు-మునుగు-మొలచు-వచ్చు-వవ్వు,

(c) ఇప్పుడు జరుగుచున్న పనినిగూర్చి చెప్పుటకు వర్తమానకాల క్రియారూపముల నుపయోగింతుము :— రాముఁడు వచ్చుచున్నాఁడు. పాఠము చదువుచున్నాఁడు.

## ii. భూతకాలము (Past Tense).

(a) ఈదిగువవానిని ధాతువులకుఁ జేర్చిన భూతకాలరూపము లేర్పడును.

| | | |
|---|---|---|
| ప్ర. | ఎను | ఇరి |
| మ. | ఇతివి, ఇతి | ఇతిరి |
| ఉ. | ఇతిని | ఇతిమి |

(b)

| | | |
|---|---|---|
| ప్ర. | చదివెను | చదివిరి |
| మ. | చదివితివి, చదివితి | చదివితిమి |
| ఉ. | చదివితిని | చదివితిమి |

వర్తమానకాలముక్రింద నిచ్చిన ధాతువుల కన్నింటికిని భూతకాలరూపములను జెప్పించి వ్రాయింపుము.

(c) ఇదివఱకు జరిగినపనులనుగూర్చి చెప్పుటకు భూతకాలక్రియారూపముల నుపయోగింతురు. శ్రీకృష్ణుఁడు గోవర్ధనగిరి నెత్తెను - రాముఁడు రావణుని జంపెను - వాఁడు నిన్న వచ్చెను - నేను లెక్కలు చేసితిని - నీవు తీర్థమునకు వెళ్ళితివి.

## iii. భవిష్యత్కాలము (Future Tense).

(a) ఈదిగువవానిని ధాతువులకుఁజేర్చినచో వాని భవిష్యత్కాలరూపము లేర్పడును.

| | | |
|---|---|---|
| ప్ర. | అఁగలఁడు, అఁగలదు | అఁగలరు, అఁగలవు |
| మ. | అఁగలవు | అఁగలరు |
| ఉ. | అఁగలను | అఁగలము |

(b)

| | | |
|---|---|---|
| ప్ర. | చదువఁగలఁడు | చదువఁగలరు |
| | చదువఁగలదు | చదువఁగలవు |

| | | |
|---|---|---|
| మ. | చదువఁగలవు | చదువఁగలరు |
| ఉ. | చదువఁగలను | చదువఁగలము |

[పైనవలెనే భవిష్యత్కాలరూపములను జెప్పించి వ్రాయింపుఁడు.]

(c) 1. ఇఁకముందు జరుగఁబోవుపనులనుగూర్చి చెప్పుటకు భవిష్యత్కాలక్రియారూపముల నుపయోగింతురు. వాఁడు రేపు రాఁగలఁడు-వారు పైవారము వెళ్ళఁగలరు- (ఈయర్థమున గోదావరిజిల్లాలో తద్ధర్మకాలమునే యుపయోగింతురు.)

2. ఈభవిష్యదర్థకరూపములు కర్తసామర్థ్యమును సూచించును. నే నాపనిని చేయఁగలను-నీ వీపాఠమును జదువఁగలవు-వాఁ డాయన్నమును దినఁగలఁడు.

### iv. తద్ధర్మకాలము (Aorist).

(a) ఈదిగువవానిని ధాతువులకుఁ జేర్చినచో వానితద్ధర్మకాల రూపములేర్పడును.

| | | |
|---|---|---|
| ప్ర. | ను | దురు |
| మ. | దువు, దు | దురు |
| ఉ. | దును | దుము |

| | | | |
|---|---|---|---|
| (b) | ప్ర. | చదువును | చదువుదురు |
| | మ. | చదువుదువు, చదువుదు | చదువుదురు |
| | ఉ. | చదువుదును | చదువుదుము |

ఇవిగాక యీదిగువతద్ధర్మార్థకరూపాంతరములనుగూడ నెఱుంగునది.

| | | ఏ | బ |
|---|---|---|---|
| (a) | ప్ర. | ఎడును, ఎడిని | ఎదరు |
| | మ. | ఎదవు | ఎదరు |
| | ఉ. | ఎదను | ఎదము |

| | | ఏ | బ |
|---|---|---|---|
| (b) | ప్ర. | చదివెడును, చదివెడిని | చదివెదరు |
| | మ. | చదివెదవు | చదివెదరు |
| | ఉ. | చదివెదను | చదివెదము |

[పైనవలెనే ధాతువుల తద్ధర్మకాలరూపములను జెప్పించి వ్రాయింపుము.]

(c) 1. కర్తధర్మమును బ్రకటించుటకు తద్ధర్మకాలరూపము లుపయోగింతురు:- సూర్యుఁడు తూర్పున ఉదయించును. పక్షు లాకాశము నందెగురును.

2. కర్తయొక్క స్వభావమును జెప్పుటకు తద్ధర్మకాలరూపము లుపయోగింతురు:- మంటలు పైకి లేచును-నీరు పల్లమునకుఁ బ్రవహించును.

3. ఊహించి విషయములను జెప్పునపుడు తద్ధర్మకాలరూపముల నుపయోగింతురు:- వాఁడిప్పుడు భారతము చదువుచుండును - ఆమె యిప్పుడు వీణ వాయించుచుండును.

4. సంశయముతోఁ గూడిన ప్రశ్నలందు తద్ధర్మకాలరూపము లుపయోగింతురు:-వచ్చునా వెళ్ళునా? చదువుదురా చదువరా? ఆగునా ఆగదా ? వత్తువా రావా?

5. వర్తమానకాలరూపములకు బదులుగా తద్ధర్మరూపముల నుపయోగింతురు :- దానిని తలఁచికొనిన నిప్పుడే వికారము వచ్చును- ఈవార్తను వినినవెంటనే వాఁడు ప్రాణములు విడుచును.

6. భవిష్యత్కాలమును సూచించుచు తద్ధర్మార్థకరూపములు వచ్చును :— వాఁడు రేపు వచ్చును-వీరు రేపు వెళ్ళుదురు - మేము రేపు చదువుదుము.

8. ఈనాలుగుకాలములు గాక i. ప్రార్థనార్థకము, ii. ఉభయకర్తృకప్రార్థనార్థకము, iii. వ్యతిరేకార్థకము, iv. వ్యతిరేకార్థకప్రార్థనార్థకము, v. ఆశీరర్థకము అని సమాపకక్రియలకు ఇంక నైదురూపములు కలవు.

10. ప్రార్థనార్థకమునకు మధ్యమపురుషరూపములుమాత్రముండును. ఏకవచనంబున-ము-వర్ణకమును, బహువచనంబున-డు-వర్ణకమును ధాతువునకుఁ జేర్చుటవలన నీరూపము లేర్పడును.

5. ప్రార్థనార్థకము

| | | |
|---|---|---|
| మ. | చదువుము | చదువుఁడు |

11. ఉభయకర్తృకప్రార్థనార్థకమునకు ఉత్తమపురుషబహు వచనరూప మొక్కటిమాత్రము కలదు. దీనికి మనము (=నీవు+నేను) అనునది కర్తగా నుండును. ధాతువునకు- దము- ప్రత్యయమును జేర్చుటవలన నీరూప మేర్పడును.

6. ఉభయకర్తృకప్రార్థనార్థకము

| | | |
|---|---|---|
| ఉ॥ | ... | బ. చదువుదము. |

1. క్రియచేఁ బ్రకటింపఁబడువ్యాపారమును దనకొఱకుఁ జేయుమని యెదుటివానినిగాని, యెదుటివారినిగాని కోరునపుడు ప్రార్థనార్థకము నుపయోగింతురు.

2. క్రియచేఁ బ్రకటింపఁబడువ్యాపారమును ఎదుటివానిని గాని, ఎదుటివారినిగాని చేయుమని ఆజ్ఞాపించినపుడుకూడ నీరూపము లనే యుపయోగింతురు.

3. క్రియచేఁ బ్రకటింపఁబడువ్యాపారమును జేయుటలో ఎదుటివానితోడ్పాటు నపేక్షించినపుడు ఉభయకర్తృకప్రార్థనార్థక రూప ముపయోగింతురు.

12. క్రియచేఁ బ్రకటమగువ్యాపారమును చేయకుండుట వ్యతిరేకము. ద్రావిడభాష లన్నిట వ్యతిరేకార్థమును- అ- వర్ణము ప్రకటించును. ఈవ్యతిరేకార్థకరూపములు ధాతువున కీదిగువవానిని జేర్చుటవలన నేర్పడును.

| | | |
|---|---|---|
| ప్ర. | అఁడు, అదు | అరు, అవు |
| మ. | అవు | అరు |
| ఉ. | అను | అము |

7. వ్యతిరేకార్థకము

| | | |
|---|---|---|
| ప్ర. | చదువఁడు, చదువదు | చదువరు, చదువవు |
| మ. | చదువవు | చదువరు |
| ఉ. | చదువను | చదువము |

[పై వలెనే కొన్నిక్రియలవ్యతిరేకార్థకరూపములను చెప్పించి వ్రాయింపుము.]

13. వ్యతిరేకప్రార్థనార్థకరూపములు ధాతువునకు- అకుము- అకుఁడు- అనువానిని జేర్చుటవలన నేర్పడును.

8. వ్యతిరేకప్రార్థనార్థకము

ఉ. చదువకుము .... చదువకుఁడు

14. ఆశీరర్థకమునకు మధ్యమపురుషరూపములుమాత్రముకలవు. ఎడును- తను- అనువానిని ధాతువునకుఁ జేర్చుటవలన నీరూపము లేర్పడును.

9. ఆశీరర్థకము.

ఉ. చదివెడును ... చదువుతను.

## అసమాపకక్రియలు (Infinite Verbs)

15. ఇంతవఱకు సమాపకక్రియారూపములను గుఱించి నేర్చుకొంటిమి. ఇఁక అసమాపకక్రియారూపములనుగూర్చి వివరించెద.

తెనుఁగున బదునాఱు అసమాపకక్రియారూపము లున్నవి.

i. రెండు విశేష్యములు, ii. ఏడు అవ్యయములు, iii. ఏడు క్రియాజన్యవిశేషణములు- అని యీ పదునాఱురూపములను మూఁడు తెగలుగ విభజించియున్నారు.

### i. విశేష్యములు (Infinitives)

1. భావార్థకములు, 2. వ్యతిరేకభావార్థకములు నని యివి రెండు విధములు. ఇవి ధాతువుయొక్క- భావమును లేక అర్థమును దెలుపును. "చదువు" ధాతువుయొక్క భావము "చదువుట." ఇవి క్రమముగా ధాతువునకు-ట-అమి- చేర్చుటవలన నేర్పడును.

1. భావార్థకము — చదువుట.
2. వ్యతిరేకభావార్థకము — చదువమి.

### ii. లాక్షణికావ్యయములు.

క్త్వార్థకములును శతృతుమానంతర్యచేదర్థకంబులును లాక్షణికావ్యయము లనఁబడును.

i. ఒకనినిగాని, ఒకదానినిగాని గూర్చిన రెండువ్యాపారములను జెప్పుధాతువులలో ముందు జరిగినదానికి- ఇ- కారము వచ్చును. ధాతువునకు- ఇ- చేర్చుటవలనఁ గలుగురూపమును క్త్వార్థక మందురు.

క్త్వార్థకము (Past Partitciple):- చదివి.

ii. ధాతువునకు- అక- చేర్చుటవలన వ్యతిరేకక్త్వార్థకరూప మేర్పడును.

వ్యతిరేకక్త్వార్థకము:—చదువక.

వాఁడు వచ్చి యడిగెను. నీవు వ్రాసి వచ్చితివి. వారు తిని వెళ్ళిరి. ఈయుదాహరణములలో కర్తనుగూర్చి రెండేసివ్యాపారములను జెప్పియున్నాము. వీనిలో మొదట జరిగినదానికి క్త్వార్థకరూపము వచ్చును. వాఁడు నామాట వినక చెడెను-వీఁడు చదువక పాడయ్యెను- ఇందు వ్యతిరేకక్త్వార్థకములు పూర్వకాలికక్రియలకే వచ్చినవి.

iii. వర్తమానమునందుఁ గ్రియతో నన్వయించుధాతువునకుఁ జివర- చున్- వచ్చును. దీనిని శత్రర్థక మందురు.

శత్రర్థకము :— పండుచున్.

వాఁడు చదువుచు వెళ్లెను- వాఁడు తినుచు మాటలాడెను- వాఁడు వ్రాయుచు సంభాషించుచున్నాఁడు. ఇందలి-చదువుచు- మున్నగువర్తమానక్రియలు వానికిఁ దరువాతనున్న- వెళ్లెను- మున్నగుక్రియలతో నన్వయించుచున్నవి. ఇట్టిసందర్భములో-చున్- చివరగలధాతురూపములను వాడుదుము. వీనిని శత్రర్థకరూపము లందురు.

iv. కొఱకు- అనునర్థమును సూచించుచు ధాతువులకుఁ జివర- అన్- వచ్చును. వీనిని తుమర్థకములు (Infinitives of purpose) అందురు. తుమర్థకములకు మీఁద- కాన్- కన్- లనుగూడ జేర్తురు.

తుమర్థకము :— చదువన్-చదువఁగాన్-చదువఁగన్.

వాఁడు పిలువఁబోయెను (=పిలుచుటకొఱకు) - వాఁడు కొనఁబోయెను- వాఁడు చదువ సమకట్టెను- ఇందు పిలువన్ -వంటిరూపములు పిలుచుటకొఱకు- వంటి యర్థములను సూచించుచున్నవి. కావున నివి తుమర్థకములు.

v. వెంటనే- అనునర్థమును సూచించుచు ధాతువుల చివర -డున్ - అను ప్రత్యయము వచ్చును. ఒకకార్యము జరిగినయనంతరము (వెంటనే) మఱియొకకార్యము జరిగినదని సూచించుట కీరూపము నుప యోగింతురు, దీనిని అనంతర్యార్థ కరూప మందురు,

అనంతర్యార్థకము :— చదువుడుఁ.

"జాబిలి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లె" - "అహి గని వేఁగయుఁగ దండ మెత్తుడున్ డుండుభమహాహి పల్కె—" "అమ్మౌని యర్థి చూచుడును నాక్షణ మాత్రన గోత్రధారుణీధ్రమ్ములు భ్రయ్యె" "ఎందులడాన వీవు నావుడున్" "బాలిక పార్థున కిట్లనుడున్" "ఈరాజాలిందఱు, నీక్షణంబ । హరి యర్థిచూచుడు నంతకక్షయమునకరిగెడువారు." "ఎవ్వరేని వీని నెత్తికొనుడు । మిగిలియున్న బాహు యుగళంబుఁ గన్నను । నడఁచు వీని కతఁడ యంతకుఁడు॥" "అక్కడుకు నబ్జనాభుం... డెత్తికొనుడు ... గ్రక్కున నడఁగెను, మిక్కిలిచేతులును వాని మిక్కిలికన్నున్" "శిశుపాలుఁడు త్రెళ్లుడు వాని తేజము వచ్చి పరమేశ్వరుదేహము సొచ్చె". ఈయుదాహరణంబులందలి యానంతర్యార్థకరూపముల నెల్ల గ్రహింపుమనది.

vi. అయితే- అనుసర్థమును సూచించుధాతువులచివర- ఇనన్- అనునది వచ్చును. దీనిని చేదర్థకరూపము అందురు.

చేదర్థకము :— చదివినఁ.

శ్రద్ధగాఁ జదివినఁ కాకములు వచ్చును.-బుఖ్యశ్భుఁగుఁడు వచ్చిన ననావృష్టి దోషము వాయును.- వానలు గురిసినఁ బంటలు పండును- ఇట్టి-చదివినఁ -వంటిరూపములు- చదివినట్లయిన -అనుసర్థమును సూచించుచున్నవి. కావున నివి చేదర్థకములు.

iii. క్రియాజన్య విశేషణములు.

భూతభవిష్యద్వర్తమానతద్ధర్మ వ్యతిరేకంబులని క్రియాజన్యవిశేషణంబు లైదు తెలుంగులు,

1. ధాతువునకు -చున్న- అనుదానిని జేర్చుటవలన వర్తమానార్థకవిశేషణ మేర్పడును.

వర్తమానార్థకవిశేషణము :— చదువుచున్న.

చదువుచున్న బాలుఁడు- ఆడుచున్న బాలిక- పాడుచున్న స్త్రీ- చంపుచున్న పులి- మండుచున్న నిప్పు - అఱచుచున్న సింహము- వీనియున్నిట- చదువుచున్న- వంటి ధాతుజవిశేషణములు వాని తరువాత నున్న నామవాచకము లెట్టివంటివో తెలుపుచున్నవి. ఇవి వర్తమానకాలమం దున్నవి. "బాలుఁడు ఎటువంటివాఁడు?" "చదువుచున్న"- కావున నిది వర్తమానార్థకవిశేషణము.

2. ధాతువునకు- ఇన చేర్చుటవలన భూతార్థకవిశేషణ మేర్పడును.

భూతార్థకవిశేషణము :— చదివిన.

చదివినబాలుఁడు- పాడినగాయకుఁడు-వచ్చినమనుజుఁడు- చేసిన స్త్రీ- కూసిన పక్షి- గర్జించిన సింహము- చెప్పిన గురువు- ఇందు- చదివిన- వంటిధాతుజవిశేషణములు వానితరువాత నున్న నామవాచకము లెటువంటివో తెలుపుచున్నవి. ఇవి భూతకాలము. నందున్నవి. "బాలు డెటువంటివాఁడు? "చదివిన"- కావున నిది భూతార్థకవిశేషణము

3. ధాతువునకు- అఁగల- చేర్చుటవలన భవిష్యదర్థకవిశేషణ మేర్పడును.

భవిష్యదర్థకవిశేషణము :—చదువఁగల.

చదువఁగలబాలుఁడు- వ్రాయఁగలపురుషుఁడు- పాడఁగలబాలిక- ఆడఁగల పాము- పఱుగెత్తఁగలగుఱ్ఱము- చంపఁగలపులి- కోయఁగలనేర్పరి- వండఁగల స్త్రీ- వీని యందలి-చదువఁగల- వంటిధాతుజవిశేషణములు వానికిఁ దరువాత నున్న నామవాచకము లెటువంటివో తెలుపుచున్నవి. ఇవి భవిష్యత్కాలమునం దున్నవి. "బాలుఁ డెటు వంటివాఁడు?"- "చదువఁగల". కావున నిది భవిష్యదర్థకవిశేషణము.

4. ధాతువునకు-ఎడు-ఎడి-ప్రత్యయములను జేర్చుటవలన తద్ధర్మార్థకవిశేషణము లేర్పడును. ఈప్రత్యయములు బహుళముగాలోపించును.

తద్ధర్మార్థకవిశేషణములు :— చదువు - చదివెడు - చదివెడి.

చదువు రాముఁడు- చదివెడు బాలిక- చదివెడి బాలుఁడు- ఆడెడి కృష్ణుఁడు- పాడెడుగాయకుఁడు-ఇచ్చుదాత-పొడుచుకర్ణుఁడు-కొట్టెడియర్జునుఁడు-విరిచెడిభీముఁడు -ఎడతెగక పాఱు నేఱు. వీనియన్నిట-చదువు- చదివెడు- చదివెడి- వంటి ధాతుజనవిశేషణ ములు వానితరువాత నున్న నామవాచకము లెటువంటివో తెలుపుచున్నవి. ఇవి తద్ధర్మ కాలమునం దున్నవి. 'రాముఁడు ఎటువంటివాఁడు?' - 'చదువు' - కావున నిది తద్ధర్మార్థకవిశేషణము.

5. ధాతువులకు-అని-అనుదానిని జేర్చుటవలన వ్యతిరేకార్థకవిశేషణము లేర్పడును.

వ్యతిరేకార్థకవిశేషణము :— చదువని

చదువనిబాలుఁడు-వినవిమూర్ఖుఁడు-తినవిమేకము- ఎగురనిపక్షి- కాయనిచెట్టు పాఱనిగుఱ్ఱము- వరములీయనివేల్పు. వీనియందు-చదువని- వంటి ధాతుజవిశేషణములు వానికిఁ దరువాతనున్న నామవాచకము లెటువంటివో తెలుపుచున్నవి. ఇవి వ్యతిరేకార్థకములు. "బాలుఁ డెటువంటివాఁడు?"- చదువని-ఇది వ్యతిరేకార్థకవిశేషణము.

[విద్యార్థులు ధాతువులయన్ని రూపములను జెప్పఁగలుగునట్టి నేర్పులవఱచికొనవలయును]

## కర్త్రర్థకము, కర్మార్థకము (Active and Passive voice)

1. కర్త్రర్థకములు, కర్మార్థకములునని క్రియారూపములు రెండు విధములు. కర్త్రర్థకరూపమునకు- పడు- అనుదానిని జేర్చుటవలన కర్మార్థకరూపమేర్పడును.

> కర్త్రర్థకము : చెప్పుచున్నది—చదువుచున్నది.
> కర్మార్థకము : చెప్పఁబడుచున్నది—చదువఁబడుచున్నది.

కర్త్రర్థకములో కర్తకు ప్రాముఖ్యముండును, కావున నది ప్రథమావిభక్తిలో నుండును. కర్మార్థకములో కర్మకు ప్రాముఖ్యముండును, కావున కర్మ ప్రథమావిభక్తిలో నుండును.

> కర్త్రర్థకము : రాముఁడు వాలిని చంపెను.
> కర్మార్థకము : వాలి రామునిచేఁ జంపఁబడెను.

పై యుదాహరణములను బరీక్షించిన (i) కర్మార్థకమునందు కర్తృపదమునకు తృతీయ వచ్చుననియు (=రామునిచే) ii కర్మవాచకమునకుఁ బ్రథమ వచ్చుననియు (వాలి) (iii) క్రియాపదమునకు- పడు- వచ్చుననియు గ్రహించుచున్నాము.

ఈదిగువ యుదాహరణములను జదువుము :

> కర్త్ర : రాజు కవికి బహుమతి నిచ్చెను.
> కర్మా : రాజుచే కవికి బహుమతి యీయఁబడెను.
> కర్త్ర : మీనాన్న యేమి వ్రాసెను ?
> కర్మా :- మీనాన్నచే నేమి వ్రాయఁబడెను ?
> కర్త్ర : వానిని రక్షింపుము.
> కర్మా : నీచే వాఁడు రక్షింపఁబడునుగాక.

### Exercise.

ఈదిగువవానిలోని క్రియలను కర్మార్థకములుగా మార్చి వ్రాయుము:—

1. బుద్ధిమంతు లాలోచించి పనులను జేయుదురు. 2. నన్ను దోమ కుట్టినది. 3. బాలుని కుక్క కఱచినది. 4. మీకు లెక్క లెవరు చెప్పిరి ? 5. ని న్నెవరు కొట్టిరి? 6. అన్నము తిని, పాఠములను జదువుము. 7. వాఁడు పురాణమును జెప్పెను.

8. శ్రీకృష్ణుఁడు గోవర్ధనము నెత్తెను. 9. రాముఁడు గోవిందుని జుట్టుపట్టి యీడ్చెను. 10. ఆచెట్టును కొట్టివేయుము. 11. ద్రోణుఁడు ద్రుపదుని పరిహసించెను. 12. నీకు వ్యాకరణము నెవరు చెప్పిరి ? 13. కావవే వరద ! సంరక్షింపు భద్రాత్మకా ! 14. బాలిక లామెను జూచి నవ్విరి. 15. ఈయద్దము నెట్లు పగులఁగొట్టిరి ? 16. వాఁడు చక్కనికథను చెప్పెను. 17. నీవు నన్నెందు కనుమానించుచున్నావు? 18. వాఁ డేమి చెప్పినాఁడు? 19. ప్రతిమనుష్యుఁడును సుఖమును గాంక్షించును. 20. వాఁడు మోసపుచ్చినాడని నాయనుమానము.

ఈదిగువవానియందలి క్రియలను కర్త్రర్థకములుగ మార్చి వ్రాయుము:—

1. ధర్మ మాచరింపఁదగు మృత్యుచేఁ దలవట్టి యీడ్వఁబడినవాఁడువోలె. 2. రామునిచే రావణుఁడు చంపఁబడెను. 3 వానిచే నీవార్త తెలుపఁబడెను. 4. ఎవరిచే నీధర్మము చేయఁబడెను ? 5. అదృష్టముచే విడువఁబడినవాఁ డెవ్వరిచేతను సత్కరింపఁబడఁడు. 6. రాజుచే కవి స్తుతింపఁబడెను. 7. అతఁడు ప్రతినిధిగా నెన్నుకొనఁబడెను. 8. శాకుంతలము కాళిదాసుచే రచింపఁబడెను. 9. వర్షముచేఁ బంటలు నాశముచేయఁబడెను. 10. శత్రువులచే దేశము దోచుకొనఁబడెను.

ఆత్మనేపదము - పరస్మైపపము-

1. క్రియాఫలితము కర్తను బొందినట్లైన నది యాత్మనేపదమనఁబడును. ఆత్మనేపదమునందు ధాతువులకుఁ జివర - కొను - అను ధాతువును జేర్తురు.

2. క్రియాఫలితము ఇతరుని బొందినట్లైని నది పరస్మైపదమనఁబడును.

పరస్మైపదము : రాముఁడు చదువుచున్నాఁడు.
ఆత్మనేపదము : రాముఁడు చదువుకొనుచున్నాఁడు.

3. కొను- ధాతువును జేర్చినపుడు ధాతువులచివర నుండు- ఉ-కారమునకు- ఇ-కారము బహుళముగా వచ్చును. యు- చివరఁగల ధాతువుల- ఉ-కారమునకు- ఇ- కారము నిత్యముగా వచ్చును.

ఉ. చదువుకొను-చదివికొను. వ్రాసికొను.

4. యు- చివరఁగల ధాతువులకు- ఇ- ఎ- లు పరమయినపుడు- యు- కారమునకు సకారము వచ్చును.

చేయు + ఇ + కొను = చేసు + ఇ + కొను = చేసికొను. ఇట్లే చేసెను.

[బాలురచేఁ గొన్ని క్రియలయాత్మనేపదరూపములను జెప్పించి వ్రాయింపవలయును]

## Exercise.

ఈదిగువవాక్యములను వానిలోని క్రియల యాత్మనేపదరూపములతో నుపయోగించి వ్రాయుము.

1. మామయ్య యుత్తరమును వ్రాయుచున్నాఁడు. 2. అన్న పాఠములను జదివెను. 3. అమ్మ యన్నమును వండెను. 4. అక్క పాటలు పాడెను. 5. బావ పొలమునుండి కూరలు తెచ్చును. 6. వాఁడుతనవ్యాపారములనుజక్కబెట్టుచున్నాఁడు. 7. సారథి రథమును తోలఁగలఁడు. 8. తాతయ్య ఆపనిని చేయలేఁడు. 9. తమ్ముఁడక్షరములు దిద్దలేఁడు.

ప్రేరణము : అప్రేరణము.

1. చేయుట అప్రేరణము; చేయునట్లొనర్చుట ప్రేరణము.

అప్రేరణము : రాముఁడు చదువుచున్నాఁడు.

ప్రేరణము : రామునిఁ జదివించుచున్నాఁడు (= చదువునట్లు చేయుచున్నాఁడు-అని యర్థము).

2. ధాతువులకుఁ జివర -ఇంచు- చేర్చుటవలన వాని ప్రేరణ రూపము లేర్పడును: కొన్ని ధాతువులకుఁజివర- చు-పు-లను జేర్చుట వలనఁగూడ వాని ప్రేరణరూపము లేర్పడును:

అప్రేరణము : గోవిందుఁడు చదువుచున్నాఁడు.

ప్రేరణము : గోవిందుని చదివించుచున్నాఁడు.

అప్రేరణము : కొమ్మ విఱిగెను.

ప్రేరణము : కొమ్మను విఱిచెను.

అప్రేరణము : త్రాడు తెగినది.

ప్రేరణము : త్రాడును తెంపెను.

[బాలురచే కొన్నిధాతువుల ప్రేరణరూపములను జెప్పించి వ్రాయింపవలయును.]

## Exercise

ఈదిగువవాక్యములను వానిలోని క్రియల ప్రేరణరూపములతో వ్రాయుము :

1. కృష్ణుఁడు చదువుచున్నాఁడు. 2. తమ్ముఁడు వ్రాయుచున్నాఁడు. 3. అన్న కొట్టుచున్నాఁడు. 4. బాణమును వేసెను. 5. సేనలు మగిడెను. 6. వాఁడు విశ్వరూపమును జూచెను. 7. కఱ్ఱ నీటిలో తేలును. 8. అక్క యన్నము తినుచున్నది. 9. బట్టలు మాసినవి. 10. వాఁడు నేర్చుచున్నాఁడు. 11. బట్ట తడిసినది. 12. వాఁడు నక్షత్రములను జూచెను. 13. తేనెటీఁగలు రేఁగినవి. 14. నది సముద్రముతో కలియుచున్నది. 15. నవారు బాగుగా బిగియలేదు.

2. సంస్కృతధాతువులచివర- ఇంచు- ను జేర్చియే తెలుఁగున ప్రయోగింతురు.

1. ఆనందించు- ఆరంభించు- ఖండించు- ఛేదించు- దర్శించు- ధ్యానించు- భావించు- విధించు- వచించు- వర్షించు- శబ్దించు- సంతోషించు.

2, అలంకరించు - అనుభవించు - జయించు - ధరించు - భరించు-విస్తరించు- విక్రయించు-ప్రసవించు- స్మరించు.

3. ఆకర్ణించు- ఆగ్రహించు- ఆజ్ఞాపించు- ఈక్షించు- గణించు - గర్వించు- గుణించు-ఘటించు-చిత్రించు-జపించు- దీపించు- నటించు- పూజించు- ఫలించు- భజించు- వచించు-వీక్షించు-శమించు-సూత్రించు-సూచించు-సుఖించు.

# 9. అవ్యయములు (Indeclinables)

1. లింగము, విభక్తి, వచనము, లేనిశబ్దముల నవ్యయము లందురు. మనవా రవ్యయములను i. ప్రతిదోక్తావ్యయములు, ii. లాక్షణికావ్యయములు నని రెండువిధములుగ విభజించియున్నారు.

2. స్వతస్సిద్ధము లయినయవ్యయములను బ్రతిపదోక్తావ్యయము లందురు :

అంత- అందు- అండీ- అఁట- అకటా- అదిగో- అదుగో- అద్దిరా- అనయము- -అమ్మకచెల్ల- అమ్మచెల్ల- అయ్యో- అయ్యారే- అరే- ఆ!- ఆహా- ఆవల- ఇంచుక- ఇఁక- ఇదిగో-ఇదుగో-ఇసీ-ఇహిహీ- ఈ స్వొత్తు- ఊరక-ఎంతయు- ఎందు- ఎటు- ఎట్లు-ఎట్టకేలకు- ఎట్టకేని- ఎట్టెట్టూ- ఎత్తిలి- ఎప్పటి- ఎల్ల- ఏని- ఏల- ఒండె- ఒండేని- ఒకో- ఒత్తిలి- ఓచెల్ల- ఓటు- ఓయి- ఓహో- ఔర- కటకటా- కట్టా- కడు- కద- కదా- కనుక- కరము- కాఁబట్టి- కాఁబోలు- కాని- కావున- కూడా- కొలె-కోలె- కోసము-కోసరము- క్రచ్చఱ-క్రమ్మఱ- గ్రక్కున- గ్రద్దన- గ్రమ్మన- చాల- చుమీ- చుఁడీ- చెటీ- చెల్లఁబో-

తద్దయు- తరువాత- తరమిఁడి-తలా- దనుక- దాఁక- దెటి- పదపడి- పిదప- పిమ్మట- పురే- పోతె- పొంటె- పొరి పొరి- బళీ- బలా- బాపు- బాపురే- బోరన-మజ్జా- మఱి- మరల- మిక్కిలి- మిన్నక- వెండియు- సవి- హా- హుటాహుటి- హోరాహోరి- మున్నగునవి ప్రతిపదోక్తావ్యయములు.

3. ధాతువులనుండి పుట్టినయవ్యయములను లాక్షణికావ్యయము లందురు. i. క్త్వార్థకములు, ii. వ్యతిరేకక్త్వార్థకములు, iii. శత్రర్థకములు, iv. తుమర్థకములు, v. అనంతర్యార్థకములు, vi. చేదర్థకములు- నని లాక్షణికావ్యయము లాఱువిధములు :

చదువు - ధాతువునుండి పుట్టినలాక్షణికావ్యయములనీక్రమములో నిటుఁ బొందుపఱిచెద : i. చదివి. ii. చదువక. iii. చదువుచున్. iv. చదువను-చదువన్- ఈరూపములకుమీఁద- గాన్ - గన్ - లను జేర్తురు : చదువఁగాన్ - చదువఁగన్. v. చదువుడున్. vi. చదివినన్.

4. ఆంగ్లవ్యాకర్త లీయవ్యయములను i. క్రియాదివిశేషణములు (adverbs), ii. సంబంధవాచకములు (Prepositions) iii. సముచ్చయములు (conjunctions) iv. రాగవాచకములు (Interjections) అని నాలుగుభాగములుగాఁ జేసి యాంగ్లమునకు భాషాభాగము లెనిమిదని చెప్పుచున్నారు. తెనుఁగునఁగూడ నిన్ని విభాగములును గలవు.

### i. క్రియాదివిశేషణములు (Adverbs)

ఈదిగువ వాక్యములను బోల్చిచూడుము:

1. కుక్క యఱచుచున్నది ... కుక్క బిగ్గఱగా నఱచుచున్నది.
2. గుఱ్ఱము వడిగా పరుగెత్తుచున్నది ... గుఱ్ఱము మిక్కిలి వడిగా పరుగెత్తుచున్నది.
3. రుక్మిణి చక్కని బాలిక .... రుక్మిణి యెంతో చక్కని బాలిక.

1 లో-బిగ్గఱగా-అనునది ఎట్లు అఱచినదో చెప్పుచు- అఱచు- అను క్రియయొక్క యర్థమును విస్తరించుచున్నది.

2 లో-మిక్కిలి-అనునది వడిగా-అనునవ్యయముయొక్క యర్థమును పెంపొందించుచున్నది.

8 లో- ఎంతో-యనునది-చక్కని- అను విశేషణము యొక్క యర్థమును పెంపొందించుచున్నది.

క్రియయొక్కగాని, విశేషణముయొక్కగాని, క్రియావిశేషణము యొక్కగాని యర్థమును పెంపొందించుపదములు క్రియాదివిశేషణములు (Adverbs)

ఈక్రియాదివిశేషణములు i. కాలవాచకములు, ii. స్థానవాచకములు, iii. పరిమితివాచకములు, iv. రీతివాచకములు నని నాలుగు విధములు.

1 కాలవాచకములు: (Time) అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు-ఇందాక-ఇఁకముందు- పూర్వము - మునుపు - ముందు - తరువాత- ఆలస్యముగా- నేఁడు- నాఁడు- రేపు-వెంటనే-పెందలకడనే-రేపకడ- మొదలయినవి.

2 స్థానవాచకములు (Place): అక్కడ- ఇక్కడ- ఎక్కడ- ఎల్లెడ- అంతటను- చాపు- దగ్గఱ- దూరము- మొదలయినవి,

3 పరిమితివాచకములు (Degree or Quantity): చాల-ఎక్కువ-కొంచెము-స్వల్పము- కొద్దిగ- కేవలము- ఇంచుమించు - అరుదుగా- దాదాపు-సూక్ష్మముగా-స్థూలముగా-అంతా-కొంత-సగము- అరుదుగా-పూర్తిగా- మొదలయినవి

4 రీతివాచకములు (Manner) : బాగుగా- పాడుగా- త్వరగా- మెల్లగా- బుద్ధిగా- ధైర్యముగా- నిశ్చలముగా- నిదానముగా- చల్లగా- సులభముగా- మొదలయినవి. ఈరీతి వాచకముల చివర గాన్- కన్- లుండును. వీనిని మనవారు క్రియావిశేషణములు (verbal adjectives) అని వ్యవహరించి విశేషణములలోని యంతర్భాగముగాఁ జెప్పియున్నారు.

## Exercise.

ఈదిగువవాక్యములలోని క్రియాదివిశేషణములను పేర్కొని యవి యేయే జాతివాచకములో పేర్కొనుచు వ్రాయుము : అవి వేనియర్థములను పెంపొందించు చున్నవో పేర్కొనుము.

1. రాముఁడు మిక్కిలి తెలివిగలవాఁడు. 2. వాన యిప్పుడే వెలిసినది. 3. వాఁడక్కడ లేడు, 4. గోవిందునికి నిన్న పాఠము రాలేదు. 5. మాఅన్న బొత్తుగా చదువుటఁ లేదు. 6. ఆబాలిక కడుశ్రావ్యముగాఁ బాడినది. 7. వాఁడుచాల వడిగాఁ బరుగెత్తఁగలడు. 8. వానికొఱకెల్లెడ వెదకితిని. 9. గోవిందుఁ డాపనిని

పూర్తిగా చేసినాఁడు. 10. యుద్ధమునకు బోయినవారందఱిలో నించుమించుగా చాలభాగము చచ్చిపోయిరి. 11. వాఁడు చల్లగా జాఱిపోయినాఁడు. 12. అది అరుదుగా దొరకును. 13. వాఁడు లెక్కను సులువుగాఁ జేసినాఁడు. 14. మహీమండలమెల్ల జూచినాఁడ నాడు నరేంద్రా! 15. బలిమి నీయనిధరణిపతులనెల్ల నదిమి కప్పములు గొనుచు.

## ii. సంబంధవాచకములు (Prepositions)

1. నామవాచకములకుఁ గలసంబంధమును సూచించుపదములు సంబంధవాచకములు.

బల్లమీఁద పుస్తక మున్నది. పెట్టెలోపల పటము లున్నవి.
మంచముక్రింద పిల్లి యున్నది. గోడప్రక్కను కుర్చీ ఉన్నది.

ఈ యుదాహరణములలో- మీఁద- క్రింద- లోపల- ప్రక్కను- అనుపదములు వానికి పూర్వమునను బరమునను నున్ననామవాచకములకు గలసంబంధములను దెలుపుచున్నవి.

### Exercise.

ఈదిగువవానిలోని సంబంధవాచకములను జేర్కొనుము :

1. బల్లమీద బంతియున్నది. 2. చెట్టుక్రింద బాలు రాడుకొనుచున్నారు. 3. పొలములగుండా దారి పడినది. 4. చెఱువుప్రక్కను బండి యున్నది. 5. నర్సాపురమువఱకు రైలున్నది. 6. గట్టుపొడుగునా చెట్లున్నవి. 7. వానివెంట కుక్క వచ్చినది. 8. చేపలు వలలోనుండి తప్పించికొన్నవి. 9. కుక్కవైపునకు పిల్లి వెళ్ళదు. 10. సింహమువంక మృగములు పోవు 11. నాకడ పొడుము లేదు. 12. చెట్టుదగ్గఱ పుట్ట ఉన్నది. 13. గోడయవతల కుప్ప యున్నది. 14. ఇంటిబయటచెట్టున్నది. 15. పొలముచుట్టు కంచె వేసిరి. 16. పుస్తకమునకు పలకకు మధ్య కల మున్నది. 17. కుక్క నీకు ముందు కొంతసేపు, వెనుక కొంతసేపు పరుగెత్తుచున్నది. 18. సూర్యుని వైపు మనము చూడలేము. 19. గోడదాపున దొంగ నిలిచెను. 20. గుమ్మము నొద్ద భటుఁడు వేచియున్నాఁడు.

## iii. సముచ్చయములు (Conjunctions)

1. ఒక క్రియతో నన్వయించుపదముల నొకదానితో మఱియొకదానిని గలుపుట కుపయోగపడు- యు-ను- లను సముచ్చయము లందురు.

ఉ. రాముఁడును, సీతయు, లక్ష్మణుఁడును నరణ్యమున కేఁగిరి.

**2.** ఉ- కారాంతశబ్దములమీఁద -ను- అను సముచ్చయమును, దక్కినవానిమీఁద -యు- అనుసముచ్చయమును వచ్చును. పైయుదాహరణములో - రాముఁడు- లక్ష్మణుఁడు- అనువానిచివర -ఉ- కారమున్నది; కావున వీనితరువాత -ను- వచ్చినది. సీత- అనుదానిచివర -అ- కార మున్నది; కావున -యు-వచ్చినది.

**3.** ఇవిగాక యింకను గొన్ని సముచ్చయములు గానవచ్చుచున్నవి.

నీవో మీతమ్ముఁడో రేపు రండి.
ఇచ్చుటో యీయకుండుటో తెలవలయును.
వాఁడు వచ్చుటో నీవు వెళ్లుటో జరుగవలయును.
నీ వన్నమును తిందువా తినవా?
ఇంటికి వచ్చెదవా రావా?

ఇందలి పదముల చివరలం దున్న -ఆ- ఓ- లు వికల్పార్థసూచకములయి వానిని గలుపు చున్నవి.

నీవుగాని మీయన్నగాని వచ్చినఁ జాలును.
వాఁడు బుద్ధిమంతుఁడుగాని సోమరి.

ఇందలి- కాని- యనునది పదములను వాక్యములను గలుపుట కుపయోగించుచున్నది.

వాఁడు భోజనమునకు వచ్చును కాఁబట్టి వంట చేయుము.
వాఁడు చదివెను కాఁబట్టి విద్వాంసుఁ డాయెను.

ఇందలి-- కాఁబట్టి- యనునది "కారణ, కార్య" వాక్యములను గలుపు చున్నది.

వానిని చదివించినట్లయితే చదువును.
వానిని పొగడినట్లయితే యిచ్చును.

ఇందలి- అట్లయితే- అనునది 'కారణ- కార్య' వాచకములను గలుపుచున్నది. అట్లయితే అనునది లోపించినను లోపించిపోవును.

వాఁ డెంతధనికుఁడైనప్పటికిని కొంచెము కష్టార్జితము కలదు.
వాని కెంత గడవక యున్నప్పటికిని నీతిమార్గమును విడువఁడు.

ఇందలి- అప్పటికిని - అనునది రెండేసి వాక్యములను గలుపుట కుపయోగించుచున్నది.

వికల్పార్థకములగు- ఆ- ఓ- లేక- కాని- అప్పటికిని- అనువానిని; కారణకార్యసంబంధ సూచకములగు- కాఁబట్టి- అట్లయితే- అనువానిని; ఇతరములగునిట్టివానిని సముచ్చయములుగా గ్రహింపవచ్చును.

## Exercise

ఈదిగువ వాక్యములలోని ఖాళీలను తగుసముచ్చయములతోఁ బూరింపుము.

1. శివుఁడు — పార్వతి — కైలాసమున నుందురు. 2. అన్న — తమ్ముఁడు — చక్కఁగాఁ జదువుకొనుచున్నారు. 3. కుక్క — ఆవు — వచ్చుచున్నవి. 4. వంకాయ — బీరకాయ — తెమ్ము. 5. మీతాత — మీనాన్న — వ్రాసియుందురు. 6. నీవు — మీయన్న — యీపనిని జేసినది. 7. వాఁడెంత నీచుఁడు — అబద్ధ మాడఁడు. 8. వాఁడెంతపొగరుబోతు — విధేయుఁడుగానే యుండును. 9. వాఁడు యోగ్యుఁడు — తల్లిదండ్రులను సేవించుచున్నాఁడు. 10. వాఁడు గొప్పవాఁడు — మోటారుబండిని కొనెను. 11. దానిని పొడిచిన — అది చచ్చును, 12. వానికిఁ జెప్పిన—చదువువచ్చును. 13. వానిని విడిచి పెట్టిన — చెడిపోవును. 14. వర్షము వెలిసినది — మీరు పోవచ్చును. 15. పదిగంట లయినది — మీరు భోజనమునకు లేవవచ్చును. 16. నీవు పుస్తకముల నిమ్ము — నేను కనుగొనెదను. 17. నీవు చదువుకొనుము — నీకు డబ్బు నీయను. 18. నీవు టిక్కట్టు కొనుగొనుము —లోపలికి రానీయను.

### iv. రాగవాచకములు (Interjections)

1. మాటలాడువానిమనస్సునం దుండు - సంతోషము, ఆశ్చర్యము, విచారము మొదలగువానిని ప్రకటించుపదములు రాగవాచకములు.

సంతాపార్థకములు : అక్కటా- కటకట- కట్టా- అయ్యో.
ప్రశంసార్థకములు : ఔర- బళీ- మజ్జ- అయ్యారే.
అద్భుతార్థకములు : ఓహో- ఆహా.
వైముఖ్యార్థకములు : ఊఁ- ఊహుఁ- ఛీ.

అకటా! యేమనిదూరుదాన. కట్టా! యోగ్యగురుకొడుకులఁ బట్టి చంపితివి. బళిర! ఈయిందువదనసుమసాయకుభూరిసామ్రాజ్యలక్ష్మి

బళిరా ! చెలిరదనపంక్తి యభినవముక్తావళిరా. అయ్యారే! యీచెలు వెక్కడ ! నయ్యారే ! గెలువంగఁజాలు నంగజురాణిన్. సుధీవర్గము లోహో ! యనిరి. జగమెల్ల ఛీ ! యనిరి.

## Exercise.

ఈదిగువవాక్యములలోని రాగవాచ్యములను బేర్కొని యవియేయేరాగములను బ్రకటించుచున్నవో వ్రాయుము.

1. బళిరా ! ఘనము పందెము నెగ్గినాము. 2. అయ్యో ! ఎవరో పక్షి గూడును దొంగిలించినారు. 3. ఔరా ! యెంతయదృష్టవంతుఁడోగదా. 4. హా దైవమా ! ఎంతకష్టము పాల్పడఁజేసితివి. 5. ఓహో ! తామే దయచేసితిరా. 6. టుప్ ! అల్లరిచేయకుఁడు. 7. ఊఁ ! నే నిప్పుడు లేవలేను. 8. ఏమిటీ ! వానికి బంగారుపతకము నిచ్చిరా ! 9. ఔనౌను ! మంచిసంగతులు వేసి పాడుచున్నాఁడు. 10. అమ్మో ! ఎంతపెద్దరాక్షసి. 11. అబ్బా ! ఇది సామాన్య స్త్రీ కాదురా ! 12. అయ్యయ్యో ! ఏమి యీతలపోటు. 13. అహా ! ఆకపటహాని యెన్నిచేతలు చేసెను! 14. ఛీ! దుర్మార్గుఁడా! ఏమి నీదౌర్మార్గ్యము. 15. ఔరౌరా! యేమి యీయాగడము.

# 10. విభక్తులు, వానియుపయోగములు

విభక్తుల యుపయోగములనుగూర్చి చెప్పు వ్యాకరణ భాగమును కారకప్రకరణ మందురు.

### 1. డు - ము - వు - లు - ప్రథమ (Nominative case)

1. మహద్వాచకములచివర - డు - ప్రత్యయము వచ్చును. ఈ డు ప్రత్యయమునకుఁ బూర్వము బిందువుండును. రాముఁడు-రాముండు-మనుమఁడు మనుమండు.

2. అమహద్వాచకములచివర - ము - ప్రత్యయము వచ్చును. వృక్షము - ధనము - అన్నము - సున్నము.

3. ఉ- కారాంతశబ్దములచివరలందును - గో - శబ్దముచివరను- వు- ప్రత్యయము వచ్చును. ధేనువు- మనువు- గోవు.

4. మహతీవాచకంబులయు,-- ఇ- కారాంతశబ్దములయు, కొన్ని తెనుఁగుపదములయుఁ జివరలందుఁ బ్రథమైకవచన ప్రత్యయములువచ్చి లోపించును. సీత- లక్ష్మి- హరి- గిరి. అన్న- అమ్మ- అక్క.

5. బహువచనంబున - లు - ప్రత్యయము వచ్చును : రాములు- మనుమలు- వృక్షములు- గోవులు- సీతలు- గిరులు- అన్నలు.

6. కర్తృపదమునకుఁ బ్రథమ యగును. క్రియచేఁ జెప్పఁబడు వ్యాపారమును జేయువాఁడు కర్త.

రాముఁడు చదువుచున్నాఁడు. గోవు పరుగెత్తుచున్నది. మేఘము వర్షించు చున్నది. నారదుఁడు పాడుచున్నాఁడు.

2. ని - ను - ల - ద్వితీయ (Objective case-Accusative case.)

1. ఇకారాంతములచివరలందు - ని - ప్రత్యయము వచ్చును. తక్కినవానిచివరలందు - ను - ప్రత్యయము వచ్చును. హరిని - బంతిని. ఆవును - అన్నమును - అమ్మను - తాతను.

2. ప్రథమైకవచనమునందు- డు- ప్రత్యయము వచ్చువానికెల్ల- ని - ప్రత్యయము వచ్చును. రాముని - శివుని - మనుమని.

3. కర్మవాచకంబునకు ద్వితీయ యగును. క్రియచేఁ జెప్పఁబడు వ్యాపారముయొక్క ఫలితమును బొందునది కర్మ. రాముఁడు రావణుని జంపెను. ఆమె పువ్వులను గోసెను- బాలురు పాఠములను జదువుచున్నారు.

3. చేత - చే - తోడ - తో — తృతీయ (Instrumental case)

1. పని చేయుటయం దుపయోగించుసాధనము నామమునకు - తోడ-తో-ప్రత్యయములు వచ్చును. బాణముతోఁ గొట్టెను - బల్లెముతోఁబొడిచెను. అంకుశముతో ఏనుఁగును బొడిచెను - కలముతో వ్రాయుచున్నాఁడు.

2. కలిసి అనునర్థమును సూచించుచు నామములచివర-తోడ- తో- ప్రత్యయములు వచ్చును. తల్లి పిల్లలతో వచ్చెను- కృష్ణుఁడుగొల్లపిల్లలతోఁ బోయెను- రాజు సేనలతో విడిసెను.

3. ఒకఁడుగాని ఒకవస్తువుగాని రెండవదానికి సమానము- అని చెప్పునపుడు రెండవదాని నామముచివర-తోడ - కు - ప్రత్యయములు వచ్చును. నరునితోడ నారాయణుఁడు సమానుఁడు - సర్వతీర్థాభిగమ నంబు సర్వవేదసమధిగమము సత్యంబుతో సరియుఁగావు- విద్యకు సాటి ధనంబు లే దిలన్.

4. హేతువాచకములకు-చేత-చే-ప్రత్యయములు వచ్చును. మణి చేత కంకణము ప్రకాశించుచున్నది. విద్యచే భూషితుఁడై వెలయుచు న్నాఁడు. లోభముచే కీర్తి నశించును. పూజలచేత విష్ణువును మెప్పించెను. ఈయర్థమునందు-వలన-వర్ణకముకూడ వచ్చును.

4. కొఱకు - కై—చతుర్థి (Dative case)

1. ఉద్దేశింపఁబడినదానికి-కొఱకు-ప్రత్యయము వచ్చును. పూజ కొఱకుఁ బువ్వులు తెచ్చెను. కొడుకులకొఱకుఁ బుస్తకములను గొనెను. త్రాగుటకొఱకు నీళ్లు తెచ్చెను- బాలురకొఱకు బంతి నిచ్చిరి- ఈయర్థ మున తఱచుగ-కు-ప్రత్యయమే వచ్చును.

5. వలన - కంటె—పంచమి (Ablative case)

1. దేనినుండి యెడఁబాటు - భయము - పుట్టువు - రక్షణము - గలుగునో దానిని జెప్పునామమునకు- వలన- ప్రత్యయము వచ్చును. ఈ-వలన- ప్రత్యయమునకుఁ దరువాత- ఉండి- అనుపదమును బ్రయో గింతురు. ఉండిపదమును బ్రయోగించినపుడు- వలన-కు బదులుగా ను- వర్ణకము వచ్చును.

ఇంద్రత్వంబువలనఁ బాసె- పదవివలనఁ జ్యుతుం డయ్యె - కులమువలన భ్రష్టుండయ్యె- పంచత్వంబువలనఁ బాపె- ఋణమువలన విముక్తుండయ్యె- దనుజులవలన భయపడెను - కశ్యపువలనఁ జరాచరభూతరాశియెల్ల నుద్భవిల్లె-ఆస్తీకుఁడు సర్పములను బ్రళయంబువలన రక్షించె- గగనంబువలననుండి కమలమిత్రుఁడు వచ్చెను.

2. కారణమును జెప్పుపదములకు -వలన- ప్రత్యయము వచ్చును.

వినయమువలన శోభగలుగును - విద్యవలన వినయము గలుగును - చింతవలన శరీరము కృశించినది.

3. ఎఱుఁగుట- వినుట- గ్రహించుట- అనునవి యెవరియొద్దనుండి గలుగునో వానినామమునకు- వలన- ప్రత్యయము వచ్చును.

సంజయునివలన నితెంగి-వేదవ్యాసునివలన దీనిని వింటిని-జరా సంధుఁడు నీలునివలనఁ గప్పంబు గొనెను.

4. రెండింట నేది మంచిదని నిర్ధారణచేయుదుమో దానికిగాక తక్కినదాని పేరునకు- కంటె- వర్ణకము వచ్చును.

సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు- అర్జునునికంటె కర్ణుండు గొప్పవాఁడు- కౌరవులకంటెఁ బాండవు లుత్తములు.

6. కి - కు - యొక్క - లో - లోపల— షష్ఠి
(Genitive case)

1. సంబంధమును సూచించుచు- కి-కు- ప్రత్యయములు వచ్చును.

నాకు గురువు- నీకు మిత్రుఁడు- వానికిఁ దమ్ముఁడు.

2. సంబంధమును సూచించుచు -యొక్క- ప్రత్యయము వచ్చును. ఈ- యొక్క- ప్రత్యయము సాధారణముగా లోపించును. నాయొక్క- గురువు- నాగురువు.

3. కొన్నిటినుండి యొకదానిని వేఱుచేసి దాని ప్రాశస్త్యమును గూర్చి చెప్పునపుడు తక్కినవానినామమునకుఁ జివర-లో-లోపల- వర్ణకములు వచ్చును.

అవతారములలో రామావతార ముత్తమము — పర్వతములలోపల హిమవత్పర్వత మున్నతము - పాండవులలోపల భీముఁడు బలాఢ్యుఁడు.

7. అందు - న—సప్తమి (Locative case)

1. ఒకదానియునికి కాధారమైనదాని పేరునకు- అందు- ప్రత్యయము వచ్చును.

ఉయ్యాలయందు బాలుఁ డున్నాఁడు - ఆకాసమునందు నక్షత్రము లున్నవి - నదియందు నీరు పుష్కలముగా నున్నది-ఎండయందు వేడిమి కలదు.

2. ఉకారాంతపదములసప్తమికి -న- ప్రత్యయమువచ్చును.

ఈవనమున వృక్షములు దట్టముగా నున్నవి-మనంబున రిత్తకోర్కుల నుంచుకొనకుము.

8. ఓ - ఓయి - ఓరి - ఓసి—సంబోధనప్రథమ.
(Vocative case).

ఎదుట లేనివానిని ఎదుటికి వచ్చునట్లు చేసికొనుట సంబోధనము. ఇట్లుచేయుటకు మనము వానిని పేరుపెట్టి పిలుతుము. ఇట్లు పిలుచునపుడు వానినామమునకు ముందు- ఓ- ఓయి- ఓరి- ఓసి- అనువాని నుపయోగింతుము. ప్రథమాంతశబ్దములతోనే సంబోధనలను జేయుదురు. కావున దీనిని సంబోధనప్రథమ యందురు.

1. డు - చివరగలశబ్దముల - డు - ప్రత్యయము వైకల్పికముగా లోపించును. అది లోపింపనియప్పుడు దీని - ఉ - కారమునకు - అ- కారము వచ్చును. ఓరామ - ఓరాముఁడ.

2. సంబోధనంబున నామములతుది హ్రస్వ -అ-ఇ- లకు వైకల్పికముగా దీర్ఘములువచ్చును. ఓరాముఁడ - ఓరాముఁడా - ఓహరి - ఓహరీ.

3. సంబోధనంబున బహువచనమునందు పదములచివర - ఆర - ఆ ని వైకల్పికముగా వచ్చును. ఓరాములార- ఓరాములారా- ఓరాములు.

---

# 11. సమాసములు

1. "మొదలిపదంబువిభక్తులఁ బుచ్చి మీఁదిపదంబుతోడసమ్యక్సంసక్తంబు"గఁ జేయుట సమాసము. మొదటి పదముచివర నున్న ప్రత్యయములను లోపింపఁజేసి దానిని మీఁదపదముతోఁ జక్కగా నదుకుట సమాసము. రామునియొక్క... బాణము = రామునిబాణము.

సమాసముయొక్క యర్థమును వివరించువాక్యమును విగ్రహవాక్య మందురు: ఉ. రామునిబాణము (సమాసము); రామునియొక్క బా[illegible]ము (విగ్రహవాక్యము)

2. i సాంస్కృతిక సమాసములు - ii ఆచ్ఛికసమాసములు మిశ్రసమాసములు- అని సమాసములు మూఁడువిధములు.

i (a) సిద్ధసమాసములు- (b) సాధ్యసమాసములు- అనిసాంస్కృతికసమాసములు రెండువిధములు.

i (a) కేవలసంస్కృతశబ్దములసమాసముసిద్ధసమాసము:నీలకంఠుఁడు.

(b) తత్సమపదములసమాసము సాధ్యసమాసము: సరసపువచనము.

ii తెలుఁగుశబ్దములసమాసము ఆచ్ఛికసమాసము: తమ్మిచూలి.

iii తత్సమాచ్ఛికములయు, ఆచ్ఛికతత్సమములయు సమాసము మిశ్రసమాసము : సింగపుఁగొదమ- లచ్చికొమరుఁడు.

iv కేవలసంస్కృతపదములతోఁ దెనుఁగుశబ్దములు సమసింపవు: సంసారార్ణవనావ-దినకరకొడుకు- అనిమిషమొదవు- ఇత్యాదు లసాధువులు.

ఈనియమ మిట్లుండఁ గొందఱు కవిగ్రామణులు- దినవెచ్చము- మున్నగువానిని వాడియున్నారు. ఇట్టివి వ్యవహారంబునఁ గలవు. అర్థాఁకలి- ప్రతివాఁడు- గర్భగుడి : వీనిని విద్యార్థులు బాగుగా గుర్తుంచుకొనవలయును.

3 అవ్యయీభావము- తత్పురుషము- బహువ్రీహి- ద్వంద్వము అని సమాసములు నాలుగువిధములు.

i. పూర్వపదార్థప్రధానం బవ్యయీభావము:-సమాసమునందలి రెండుపదములలోఁ బూర్వపదముయొక్క యర్థము ప్రధానముగాఁగల సమాస మవ్యయీభావసమాసము : యథాశక్తి- పెడతల- గోరంత.

ii. ఉత్తరపదార్థప్రధానంబు తత్పురుషము:- సమాసమునందలి రెండుపదములలో రెండవపదానియొక్క యర్థము ప్రధానముగాఁ గల సమాసము తత్పురుషసమాసము :

విద్యానిపుణుఁడు- అన్నబుభుక్షువు- గోటిజీర- గుడతాల్పు.

iii. ఉభయపదార్థప్రధానంబు ద్వంద్వము : సమాసమునందలి రెండుపదములయొక్క యర్థము ప్రధానముగాఁ గలసమాసము ద్వంద్వసమాసము : కంసరావణులు- రామకృష్ణులు- అన్నదమ్ములు- పిన్నపెద్దలు.

iv. అన్యపదార్థప్రధానంబు బహువ్రీహి : సమాసమునందున్న రెండుశబ్దములయర్థములుగాక యితరశబ్దముయొక్కయర్థము ప్రధానముగాఁ గలసమాసము బహువ్రీహిసమాసము .

దత్తపదశువు-త్రిలోచనుఁడు-ముక్కంటి-వేఁడివెలుఁగు-పులుఁగుపడగ.

4. వ్యధికరణము, సమానాధికరణము-అని తత్పురుషసమాసము రెండువిధములు.

i. ద్వితీయ మొదలగువిభక్తిప్రత్యయములు చివరఁగలపదములు మీఁదిపదములతో సమసించుట వ్యధికరణము. ఇట్లు సమసించినప్పుడు వీనిని ఆయాతత్పురుషసమాసము లందురు.

౧. ద్వితీయాతత్పురుషము : దుఃఖాతీతుఁడు- పడగదాల్పు- తేనెదిండి.

౨. తృతీయా ,, : విద్యానిపుణుఁడు-మాసావరుఁడు-దేవసముఁడు కత్తినఱకు- నెలతక్కువవాఁడు- రాచపోరు.

౩. చతుర్థీతత్పురుష : భూతబలి-గడియద్రూను-దేవరమేలు.

౪. పంచమీ ,, చోరభయము- వృక్షపతితుఁడు- దొంగభయము- పాముభీతి.

౫. షష్ఠి ,, వృక్షచ్ఛాయ- తేటిపిల్ల- అలకాపరి.

౬. సప్తమీ ,, దానశౌండుఁడు- మాటనేర్పరి.

౭. ఇవిగాక నఞ్ - తత్పురుషసమాస మొకటి కలదు. ఇందు మొదటిపదము- నఞ్ - అయియుండును. ఈ -నఞ్ - హల్లుపరమయినపుడు -అ- గాను, అచ్చుపరమయినపుడు -అన్ - గాను మారును.

అజ్ఞానము- అభవుఁడు- అనర్థము- అనృతము-అనంగుఁడు.

ii. విశేషణవిశేష్యములసమాసము కర్మధారయము : ఇదియే సమానాధికరణము.

చిగురుటాకు-కఱకుటమ్ము-పండువెన్నెల-నల్లగలువ-తెలిదమ్మి-నీలోత్పలము.

iii. సంఖ్యావాచకము పూర్వపదముగాఁ గలిగి యుత్తరపదము యొక్క యర్థము ప్రధానముగాఁగలది ద్విగుసమాసము.

షడ్రసములు-ముచ్చిచ్చు-మువ్వన్నె-ముత్తోవ-ముజ్జగములు-నల్లడలు.

iv. ఉపమానసమాసములు : ౧. సమాసములోనిపూర్వపదము ఉపమానవాచక మయినకర్మధారయసమాసమును ఉపమానపూర్వపదకర్మధారయ మందురు.

మేఘశ్యాముఁడు- లతాతన్వి- చిగురుఁగేలు- పండుమోవి- కాకినలుపు- బొగ్గుచాయ- మెఱుఁగుఁబోఁడి.

౨. సమాసములోని రెండవపదము ఉపమానవాచక మయిన కర్మధారయసమాసమును ఉపమానోత్తరపదకర్మధారయ మందురు.

కేలుదమ్మి- మోముదామర- మైదీఁగ- చెక్కుటద్దము- కపికుంజరుఁడు.

3. ఉపమానవాచకము పూర్వపదముగాఁ గలబహువ్రీహిని ఉపమానపూర్వపదబహువ్రీహి యందురు.

మచ్చెకంటి- చంద్రముఖి.

i. సమాసమునందలి యుపమానోపమేయములకుఁగల సమానధర్మము ఉక్తమయినయెడల దానిని రూపకసమాసమందురు. రూపకసమాసమును అవధారణపూర్వపదకర్మధారయసమాసమనికూడ నందురు. అవధారణము (= నిశ్చయము) పూర్వపదమునందుండుటచే దీనికీపేరు కలిగినది. ఈసమాసమునందు మొదటిశబ్దముయొక్క- యర్థము -ఏవ = అనెడు- పదముతోఁగూడియుండును:— దృగబ్జము, (దృగేవఅబ్జమ్ = కన్నుఅనెడు తామరపువ్వు)- మోవిపండు- పూముల్కులు.

ii. సమాసమునందలి యుపమానోపమేయములకుఁగల సమానధర్మము సమాసగతముకాని వేఱొకపదముచే ఉక్తముకానిచో దానిని ఉపమితసమాసమందురు. ఈసమాసమునందలి రెండవపదము నర్థము -ఇవ = వంటి, వలె- పదముతోఁ గూడియుండును:— పురుషవ్యాఘ్రము - మానిసిపులి. పురుషః వ్యాఘ్ర ఇవశూరః (= పురుషుఁడు వ్యాఘ్రమువలె శూరుఁడు) అనునపుడు -శూరుఁడు- అనుశబ్దముచే సమానధర్మము వాచ్యమగుచున్నది కావున నిటనుపమితసమాసము గలుగదు. పురుషః (వ్యాఘ్ర)ఇవ - అనునపుడు సమానధర్మమును దెలుపు పదము లేదు కావున నిట ఉపమిత సమాసము గలుగుచున్నది

6. సమాసమధ్యమున పదములు, లోపించినచో వానిని ఉత్తరపదలోపసమాసము లందురు :

జవ్వాదిసెట్టి- పచ్చళ్లబాపిత- గాజులసెట్టి- వంటలరంగమ్మ.

7. కలది-అనునర్థముతోఁగూడిన సమాసములు మతుప్సమాసములు:

తావిమొగ్గ- వలపుగందవొడి-చక్రి-శరి.

# 12. తద్ధితములు

## (Abstract nouns derived from nouns and adjectives).

1. వానివానికి నియతములయినయర్థములను బోధించుటకును, విశేషార్థములను బోధించుటకును విశేషణవిశేష్యములకుఁ జివరలందుఁ జేర్పఁబడుప్రత్యయములను తద్ధితము లందురు. <u>తద్ధితాంతము లన్నియు విశేష్యములే.</u>

2. తద్ధితప్రత్యయములు పరమయినప్పుడుపదములచివరలందుండు -డు-ము-వు- మొదలగుప్రత్యయములు లోపించును.

3. భావార్థమునందు-తన- వర్ణకము వచ్చును. శబ్దముయొక్కయర్థమువలన గ్రహింపఁబడువిశేషధర్మమును భావ మందురు : (The abstract idea carried by a word is called Bhava).

రాముఁడు- రామునితనము. అల్లుఁడు-అల్లునితనము. దమయంతి- దమయంతి తనము. గొప్ప- గొప్పతనము. తియ్య-తియ్యఁదనము.

5. చిన్న - మొదలగు వానికి భావంబున-టిక- వర్ణకము వచ్చును.

చిన్న -చిన్నటికము. పేద-పేదటికము. చుట్టము-చుట్టటికము. పక్షంబున-తన-వర్ణకంబుకూడ వచ్చును-చిన్నతనము- పేదతనము.

5. పేరు-మొదలగువానికి భావంబున -ఇమి-వర్ణకము వచ్చును.

పేరు-పేరిమి. ముచ్చు-ముచ్చిమి. మేలు-మేలిమి. వాడి-వాడిమి. వేఁడి-వేఁడిమి. పక్షంబున-తన-వర్ణకముకూడ వచ్చును. ముచ్చుఁదనము-వేఁడితనము.

6. నల్ల-మొదలగుగుణవాచకములకు భావంబున- న- వర్ణకము వచ్చును.

నల్ల-నల్లన. తెల్ల-తెల్లన. తిన్న-తిన్నన. పక్షంబున- తన-వర్ణకముకూడ నగును-నల్లఁదనము.

7. అరమర- మొదలగువానికి స్వార్థమునందు- ఇక- వర్ణకము వచ్చును. ప్రకృతి కేయర్థ ముండునో దానిని స్వార్థము (The meaning expressed by the root) అందురు.

అరమర-అరమరిక. నడవడి-నడవడిక. మాన-మానిక. మెలి-మెలిక. వాలు-వాలిక

8. చిఱుత- మొదలగువానికి స్వార్థమునందు- ఉక- వర్ణకము వచ్చును. చిఱుత-చిఱుతుక. నాతి-నాతుక. నెలఁత-నెలఁతుక. పడఁతి-పడఁతుక.

9. ఆట- మొదలగుశబ్దములకుఁ బుంలింగంబునందు-కలవాఁడు- అనునర్థమునందు- కాఁడు-అనుప్రత్యయమును, స్త్రీలింగంబునందు-కలది- యనునర్థంబున- కత్తియ- అనుప్రత్యయమును వచ్చును. కొన్నియెడల -కా-కత్తియ- వర్ణంబుల-క-కారంబునకు-గ-కారంబును గానంబడియెడి.

ఆట- ఆటకాఁడు- ఆటకత్తియ. చెలిమి- చెలిమికాఁడు- చెలికాఁడు- చెలిమికత్తియ- చెలికత్తియ. అందము- అందగాఁడు- అందగత్తియ. బేరము-బేర గాఁడు- బేరగత్తియ.

10. స్త్రీలను బోధించుకులవాచకశబ్దములకు -కలది- యనునర్థ మునందు -త- వర్ణకము వచ్చును.

చాకి- చాకిత. బోయ- బోయత. సాలె-సాలెత.

11. బహువచనాంతములయిన -వగ- మొదలగువానికి -కల వాఁడు- కలది- యనునర్థములందుఁ గ్రమముగా -ఆఁడు- ఆఁడి- వర్ణక ములు వచ్చును.

వగ- వగలాఁడు- వగలాఁడి. వన్నె- వన్నెలాఁడు- వన్నెలాఁడి.

12. ముక్కు- మొదలగువానికి -అవి లేనివాఁడు- అవి లేనిది- అనునర్థములందు -ఇడి- వర్ణకము వచ్చును.

ముక్కు- ముక్కిడి (=ముక్కులేనివాఁడు). వాలు- వాలిడి. చెరవు- చెర విడి. సిగ్గు- సిగ్గిడి.

13. మానార్థమునందు శబ్దములకుఁ బ్రథమైకవచనమునందు -ఎఁడు- వర్ణకము వచ్చును.

తూము- తూమెఁడు. ముంత- ముంతెఁడు. వీసె- వీసెఁడు. మూర-మూరెఁడు. గంప- గంపెఁడు.

పరిమాణార్థకమయిన -ఎఁడు- వర్ణకము పరమయినపుడు-లి-వర్ణ మునకు లోపంబు నిత్యంబు.

పిడికిలి ... ఎఁడు = పిడికెఁడు. దోసిలి ... ఎఁడు = దోసెఁడు. పుడిసిలి... ఎఁడు = పుడిసెఁడు.

14. లోతుయొక్క పరిమాణమును జెప్పునపుడు -బంటి- కొలఁది- అను ప్రత్యయములు వచ్చును.

మోఁకాలుబంటి- మోఁకాలుకొలఁది. పుక్కిటిబంటి- పుక్కిటికొలఁది.

ఈయర్థములో సంస్కృతమున -దఘ్నము- మాత్రము -ద్వయసము- అను ప్రత్యయములు వచ్చును.

ఊరుదఘ్నము- ఊరుద్వయసము- ఊరుమాత్రము.

---

## 13. కృదంతములు (Verbal nouns)

1. సమాపకక్రియలచివరలందును, అసమాపకక్రియలచివరలందును నుండుక్రియాప్రత్యయములుగాక, క్రియలకుఁ జేర్పఁబడు నితర ప్రత్యయములను, కృత్తు లందురు. ఈకృత్తులు చివరగలవానిని కృదంతము లందురు. కృదంతము లన్నియు విశేష్యములు. (Abstract nouns derived from verbs)

2. అలుగు- మొదలగువానికి- క- వర్ణకము వచ్చును.

అలుగు-అలుక. ఆఁగు-ఆఁక. ఎఱుఁగు-ఎఱుక. కలఁగు-కలఁక. కాఁగు-కాఁక. నడచు-నడక. మూఁగు-మూఁక. మొలఁచు-మొలక.

3. కలుగు- మొదలగువానికి- ఇమి- వర్ణకము వచ్చును.

కలుగు-కలిమి. ఓరుచు-ఓరిమి. కూరుచు-కూరిమి- తాలు-తాలిమి.

4. చేయు- మొదలగువానికి బిందుపూర్వక-త-వర్ణ మువచ్చును.

చేయు-చేఁత. కూయు-కూఁత. కోయు-కోఁత. గీయు-గీఁత. నేయు-నేఁత.

5. అడఁగు- మొదలగువానికి- కువ- వర్ణకము వచ్చును.

అడఁగు-అడకువ. మెలఁగు-మెలఁకువ. లోఁగు-లోఁకువ. వేఁగు-వేఁకువ.

6. ఆడు- మొదలగువానికి- ట- వర్ణకము వచ్చును. ఈ- ట- వర్ణకము పరమయినపుడు వీని యంత్యవర్ణము లోపించును.

ఆడు-ఆట. ఊరు-ఊట. తేరు-తేట. పండు-పంట. మండు-మంట. పాడు-పాట.

7. పడు- మొదలగువానికి- టు- వర్ణకము వచ్చును. ఈ-టు-వర్ణకము పరమయినపుడు వీని యాద్యక్షరములు శేషించి దీర్ఘములను బొందును. పడు-పాటు. కఱచు-కాటు. పొడుచు-పోటు. ఏయు-ఏటు.

8. అవులించు- మొదలగువానికి- -త- వర్ణకము వచ్చును.

అవులించు- అవులింత. ఇంగిలించు- ఇగిలింత. కుళ్ళగించు- కుళ్ళగింత.

9. మూయు- మొదలగువానికి -పు- వర్ణకము వచ్చును.

మూయు- మూపు. మేయు- మేపు. కాము- కాపు. చూచు - చూపు. తలంచు- తలంపు. వలచు- వలపు. వాచు- వాపు.

10. ఏలు- మొదలగువానికి -బడి- వర్ణకము వచ్చును.

ఏలు- ఏలుబడి. కొను- కొనుబడి. చెల్లు- చెల్లుబడి. తీయు- తీయుబడి. పెట్టు- పెట్టుబడి. మొక్కు- మొక్కుబడి. సాగు- సాగుబడి.

11. కోరు- మొదలగువానికి -ఇకి- వర్ణకము వచ్చును.

కోరు- కోరికి. పూను- పూనికి. పోలు- పోలికి. విను- వినికి.

12. మూలు- మొదలగువానికి -అక- వర్ణకము వచ్చును.

మూలు- మూలకము. అమ్ము- అమ్మకము. అంపు- అంపకము. పంపు-పంపకము. అద్దు- అద్దకము

13. ఓడు- మొదలగువానికి -ఇక- వర్ణకము వచ్చును.

ఓడు- ఓడిక. ఓపు- ఓపిక. కూడు- కూడిక. కోరు- కోరిక. పొందు- పొందిక. పోలు- పోలిక.

14. ఈదిగువ కొన్నిక్రియలను వాని కృదంతరూపములను పొందుపఱిచెద.

మఱియు- మఱిపము. గడ- గడన. దీవ- దీవన. మన్న- మన్నన. చేరు- చేరుగడ. మను- మనుగడ. కొలుచు-కొలుపు. చచ్చు- చావు. గీలు- గీలు. కాయు- కాయ. తునియు- తునియ. పిడుచు- పిడుచ. అల్లు- అల్లుడు. దంచు- దంపుడు. పెంచు- పెంపుడు. దిగు- దిగుడు. దోచు- దోపుడు.

---

## 14. ప్రకీర్ణము (Miscellaneous)

1. పదముల మొదట నందు ఋ - ఌ - వర్ణములు క్రమముగా ర - ల - వర్ణములవంటి వగును.

ఇవి యచ్చులయ్యును బూర్వాచ్చులతో సంధి నొందవు. అతఁడు ఋషి. దీర్ఘాచ్చులమీఁద యడాగమంబు రాదు. ఆఋషిపుత్రుఁడు. ద్విత్వమునకు లోపసంశ్లేషస్వత్వంబు లగును.

మెచ్చె ఋషి - మెచ్చెన్ ఋషి - మెచ్చెను ఋషి.

2. ఉయ్యాల - పయ్యెద - తాయెతు - లంచెలి మధ్య యకార మెత్వము గలది. ఉయ్యాల - పయ్యద - లత్వమధ్యంబులునుంగాడ నగును.

3. హకారము మొదటఁగలపదములయు, నీలుగు - మొదలగు వానియొక్కయు తొలిహల్లులు బహుళముగా లోపించును.

హత్తు- అత్తు. హదను- అదను. హారతి- ఆరతి. హితవు- ఇతవు. హెచ్చరిక- ఎచ్చరిక. నీలుగు- ఈలుగు. నెగయు- ఎగయు. హొందు- ఒందు. హొనరు-ఒనరు. వూను- ఊను. హొదవు- ఒదవు.

4. అడఁగు- మొదలగువాని -డ- కారమునకు -ణ- కారము వైకల్పికముగా నగును :

అడఁగు- అణఁగు. పోడిమి- పోణిమి. మీడుఁగురు- మిణుఁగురు.

5. దక్కు- మొదలగువాని -ద- కారమునకు -డ- కారము వైకల్పికముగా నగును :

దక్కు- డక్కు. ద్రాఁగు- డాఁగు. దిగు- డిగు. దెందము- డెందము.

6. తెనుఁగుశబ్దముల మధ్యనున్న -న-ల-డ-ర- యనువాని -ఉ- త్వములు బహుళముగా లోపించును :

కానుపు- కాన్పు. కానుక- కాన్క. చిలుక- చిల్క. కొలుపు- కొల్పు. పిడుగు- పిడ్గు. ఊడుపు- ఊడ్పు. అరుగు- అర్గు. విఱుగు- విర్గు.

7. దురు- అనునది చివరఁగల క్రియాపదముల కాగమ -చు- వర్ణము పరమయినపుడు -దు- యొక్క -ఉ- కారము వైకల్పికముగా లోపించును.

అదురుచు- అద్రుచు. ఎదురుచు- ఎద్రుచు. విదురుచు- విద్రుచు. ఇందలి -ద్రు- వర్ణంబునకుఁ బూర్వాక్షరము గురువు కాదు.

8. జాదము- మొదలగువాని -ద- గారమునకు -జ- కారము వైకల్పికముగా నగును :

జాదము- జాజము. జవాది- జవాజి. జాది- జాజి. విరవాది- విరవాజి.

9. నిందార్థమునం దామ్రేడితముయొక్క మొదటివర్ణమునకు హ్రస్వమయినచో -గి-యును, దీర్ఘమయినచో -గీ-యును నాదేశము లగును.

చక్రిన్ - గ్రిక్రిన్ , భీష్మన్ - కిష్మన్.

10. తెలుఁగుశబ్దములందలి -అయి- అవు- లకుఁ గ్రమముగా -ఐ- ఔ- లు వచ్చును.

అయిదు- ఐదు. కయిదువు- కైదువు. గవుసెన- గౌసెన. అవుగాములు- ఔగాములు.

11. అపదాద్యంబయి, యసంయుక్తంబయిన -గ- కారంబునకు వకారంబు విభాషనగు. తెలుఁగుశబ్దములందు పదాదిది కానిదియు, సంయుక్తముకానిదియు, నగు -గ- కారమునకు -వ- కారము వైకల్పికముగావచ్చును.

పగలు-పవలు. ఇరుగురు-ఇరువురు. వేగురు-వేవురు.

# 15. ఛందః ప్రకరణము

1. పద్యముల లక్షణములనుగూర్చి చెప్పుశాస్త్రము ఛందశ్శాస్త్రము.

2. లఘువు నొక్కమాత్రకాలములో నుచ్చరింపవలయును. గురువును రెండుమాత్రలకాలములో నుచ్చరింపవలయును.

। - ఇది లఘువునకు గుర్తు.

∪ - ఇది గురువునకు గుర్తు.

3. గురువులు, లఘువులు :- ద్విత్వాక్షరములకును, సంయుక్తాక్షరములకును, బూర్ణానుస్వారమునకును నెడమనూఁదిపలుకువర్ణములును; దీర్ఘాక్షరములును ( = ఆ ఈ ఊ ౠ ఏ ఐ ఓ ఔ - అను నచ్చులు వీనితోఁగూడిన హల్లులు); పొల్లుహల్లులతోఁ గూడిన వర్ణములును గురువులు. తక్కినవి లఘువులు. తన్వంగీ - ఇందలి మూఁడక్షరంబులును గురువులే. త-కారము ద్విత్వాక్షరమునకుఁ బూర్వమున నున్నది. కావున గురువయినది; -న్వం-ఇదిబిందువుతో గూడియున్నది కావున గురు వయినది; గీ- ఇది దీర్ఘాక్షరము గావున గురువు. వత్సన్-

ఇందలి రెండక్షరములు గురువులే. సంయుక్తాక్షరమునకుఁ బూర్వమున నున్నది కావున నిందలి -వ- కారము గురువు. పొల్లుహల్లగు-న్- తోఁ గూడియుండుటచే- త్తున్- అనునది గురువయినది. గిరిజ- ఇందలి వర్ణములన్నియు లఘువులే. వట్రసుడు లచ్చులు గావున వానితోఁ గూడి యుండు వర్ణములకుఁ బూర్వమున నుండెడియక్షరములు లఘువులే యగును. అమృతము—ఇందలి-అ-కారము లఘువు. తెనుఁగుశబ్దముల మొదటి యక్షరములక్రింద నూఁదఁబడని జడ్డలు ( = ఒత్తిపలుకని హల్లులు) ఉన్నచో వాని యెడమచేతివైపున నుండెడి యక్షరములు లఘువులే యగును. కందము త్రిశరగణంబుల- యను నీపాదమునందలి -త్రి- యూఁదఁబడుట లేదు. కావున దీనికిఁ బూర్వముననున్న -ము- వర్ణము లఘువే యగును.

4. గణములు : గురువులయు లఘువులయుఁ బ్రస్తారమువలన గణము లుత్పన్నము లగుచున్నవి.

1. ప్రథమచ్ఛందము : 1. ఒక్కగురువు - ∪ -గ-గణము
2. ఒక్కలఘువు - I - ల_గణము

2. ద్వితీయచ్ఛందము :

క. గగ మాయె రెండు గురువులు
లగమును వగణంబు నయ్యె ♦ లఘువును గురువున్
జగతిని లఘుయుగ్మము లల
మగు, గురువును లఘువు గలము ♦ హగణంబు నగున్.

1. రెండుగురువులు -∪ ∪ – గగ - మనఁబడును. ఉ॥ రామా

2. లఘువును గురువునుగూడి - I ∪ - లగ - మనఁబడును. దీనిని -వ- గణమనికూడ వ్యవహరింతురు. ఉ॥ హరీ.

3. రెండు లఘువులు - I I - లల-మనఁబడును. ఉ॥ హరి.

4. గురువును లఘువునుగూడి - ∪ I - గల - మనఁబడును. దీనిని -హ- గణమనికూడ వ్యవహరింతురు. ఉ॥ ల

3. తృతీయచ్ఛందము :

క. గురువులు మూఁ డిడ మగణము
పరగంగా నాదిగురువు ♦ భగణం బయ్యెన్
ధర మధ్యగురువు జగణము
సరసగుణా! యంత్యగురువు ♦ సగణం బయ్యెన్.

క. నగణంబు మూఁడు లఘువులు
యగణంబున కాదిలఘువు ♦ యమతనయనిభా!
రగణంబు మధ్యలఘు వగు
తగణంబున కంత్యలఘువు ♦ దాక్షిణ్యనిధీ!

1. మూఁడుగురువులుగల గణము -∪ ∪ ∪ -మ- గణము.
ఉ॥ శ్రీనాథా.

2. మొదట గురువు, తరువాత రెండులఘువులు గల గణము - ∪ I I - భ-గణము. ఉ॥ కేశవ.

3. మధ్యగురువు మొదట చివర లఘువులుగల గణము -I ∪I- - జ - గణము. ఉ॥ ముకుంద.

4. చివరగురువు మొదట రెండులఘువులుగల గణము - I I ∪ - స - గణము. ఉ॥ వరదా.

5. మూఁడు లఘువులుగల గణము - I I I - న - గణము.
ఉ॥ వరద.

6. మొదట లఘువు, తరువాత రెండుగురువులుగల గణము - I ∪ ∪ - య - గణము. ఉ॥ మురారీ.

7. మధ్య లఘువు మొదట చివర గురువులుగల గణము - ∪ I ∪ - ర - గణము. ఉ॥ మాధవా.

8. చివర లఘువు మొదట రెండు గురువులుగల గణము - ∪ ∪ I - త - గణము. ఉ॥ దైత్యారి.

"మ - భ - జ - స : న - య - ర - త" యని జ్ఞప్తియం దుంచికొనిన నీగణముల లక్షణములు సులభముగా స్ఫురించును.

పై యెనిమిదిగణములలో నొక్కొక్కదానికి గురువు నేని లఘువు నేని జేర్చుటవలన నూతనగణము లేర్పడుచుండును. పై యెనిమిది గణములలో నొక్కొక్కదానినుండి రెండేసి ( = గురువును జేర్చుటవలన నొకటియు, లఘువును జేర్చుటవలన నొకటియు) చొప్పున నూతన గణము లుత్పన్నము లగుచు మొత్తముమీఁదఁ బదునాఱు క్రొత్త గణము లేర్పడుచున్నవి. జ - గణమునకు గురువును జేర్చినచో - జగ - మగును. జ - గణమునకు లఘువును జేర్చినచో - జల - మగును. ఇట్లే - మగ, భల, జగ, జల, సగ, సల, నగ, నల, యగ, యల, రగ, రల, తగ, తల, యను గణములు గలుగుచున్నవి. అశ్లీలదోషమును దొలఁగించుటకుఁగాను - భ - గణముమీఁద గురువును గూర్పఁగాఁగల్గు గణమును-భ గురువు అనియు, మ - గణముమీఁద లఘువును గూర్పఁగాఁ గలుగు గణమును - మలఘువు - అనియు వ్యవహరించుచున్నారు.

5. సూర్యగణములు, ఇంద్రగణములు, చంద్రగణములు.

క. గల -న- గణము లినుఁ, డింద్రుఁడు
నల- నగ- సల- భ- ర- త-, లింక ♦ నగగ-నహ-సలా
భల- భగురు- మలఘు- నవ- సహ
తల- రల- నవ- నలల- రగురు ♦ -తగ-లిందుఁ డజా!

సూర్యగణములు, ఇంద్రగణములు, చంద్రగణములు- నని గణములు మూఁడు తెఱంగులు. "గల, న" గణములు రెండును సూర్యగణములు. "నల, నగ, సల, భ, ర, త" యను నాఱుగణంబులును నింద్రగణములు. "నగగ, నహ, సలల, భల, భగురువు, మలఘువు, నవ, సహ, తల, రల, నవ, నలల, రగ, తగ" యను పదునాలుగు గణములును జంద్రగణములు.

6. యతిప్రాసలు:—పద్యపాదముయొక్క మొదటియక్షరమును- యతి- యనియు, రెండవ యక్షరమును - ప్రాస - మనియు వ్యవహరించుచున్నారు.

యతి:- వళి, విరతి, విశ్రాంతి, విశ్రామము, విశ్రమము, శ్రాంతి విరమణము, విరమము, విరామము - నను తొమ్మిదియును - యతి - యను పదమునకుఁ బర్యాయపదములు. యతులకుహల్లులును వానిమీఁది యచ్చులునుగూడ సవర్ణములు కావలయును. పాదముయొక్క తొలి యక్షరమునకు సవర్ణమైన యక్షరమును నా పాదమునకుఁ జెప్పఁబడిన స్థానమునందు నెలకొల్పవలయును. ఈదిగువ వర్ణములు పరస్పరము యతులకు సవర్ణములు.

అచ్చులు:— 1. అ ఆ ఐ ఔ య హ.

2. ఇ ఈ ఋ ౠ ఎ ఏ.

3. ఉ ఊ ఒ ఓ.

4. ఋ ౠ ఇ ఈ ఎ ఏ రి రే కృ ( = వలె వ్రటసుడు లతోఁ గూడిన యన్ని హల్లులు)

హల్లులు:- 1. క ఖ గ ఘ-

2. చ ఛ జ ఝ.

3. ట ఠ డ ఢ

4. త థ ద ధ.

5. ప ఫ బ భ

6. ఈవైదు వర్గాక్షరములును బిందుపూర్వకములయినచోఁ గ్రమముగాఁ దమతమ వర్గానునాసికాక్షరములకు సవర్ణము లగును.

7. న ణ జ్ఞ.

8. శ ష స చ ఛ జ ఝ.

9. జ్ఞ క ఖ గ ఘ.

10. బిందుపూర్వకములగు ట ఠ డ ఢ త థ ద ధ.

11. మ- కారమును బిందుపూర్వకములయిన- య ర ల వ శ ష స హ- లును సవర్ణములు.

12. వ బ.

13. ల డ ళ.

14. యతిస్థానమునందు సంయుక్తాక్షరము లున్నట్లైన వానిలో నేదో యొక హల్లునకు యతిని నిల్పవచ్చును.

15. ర, ఱ- యను నీ యక్షరములకు యతి చెల్లదని కొందఱ మతము-

ప్రాసః- ప్రాస నియమముగల పద్యపాదములందలి ద్వితీయ వర్ణములన్నియు హల్సామ్యమును మాత్రము పొందియుండవలయును. ప్రాసములకు నిలుచు హల్లులమీఁది యచ్చులు సవర్ణములై యుండ వలయునను నియమము లేదు. ప్రథమపాదమునందలి ప్రాసాక్షరమునకుఁ బూర్వమందు గురులఘువులలో నేదియుండునో యదియే తక్కినపాదము లందలి ప్రాసాక్షరములకుఁ గూడఁ బూర్వమునం దుండవలయును. ప్రాసాక్షరము ద్విత్వాక్షరంబేని, సంయుక్తాక్షరంబేని, బిందుపూర్వకం బేని యైనచో నన్నిపాదంబుల యందునుగూడ నది యట్లే యుండ వలయును.

7. పద్యములు వానిలక్షణములు :—

1. తేటగీతి:— "ఆ॥ సూర్యుఁ డొక్కరుండు ♦ సురరాజు లిద్దఱు। దినకరద్వయంబు ♦ తేటగీతి॥" తేటగీతము ప్రతిపాదమునకును నై దేసి గణము లుండును. మొదట సూర్యగణమును దరువాత రెండింద్రగణ ములను నటుపిమ్మట రెండుసూర్యగణములనువుంచి చెప్పిన నది తేట గీతిపాద మగును. పాదముయొక్క మొదటి యక్షరమునకును దాని యందలి నాల్గవగణము మొదటి యక్షరమునకును యతి చెల్లును. లేనిచో పాదముయొక్క రెండవయక్షరమును నాల్గవగణము రెండవ యక్షరము నొకే హల్లుగానుండి ప్రాసయతినేని గల్గియుండవలెను. ఇట్టిపాదములు నాలుగుగూడిన తేటగీతమను పద్యమగును. తేటగీతము నకుఁ బ్రాసనియమము లేదు.

గల భ త న న
తే॥ భర్త । చేతని । యోగింపఁ । ♦ బడక । సతికి
గల సల భ గల గల
నెద్ది । యునుజేయు । గాఁడగ । ♦ దెద్ది । యైన
గల భ త న గల
భర్త । చేతని । యోగింపఁ । ♦ బడిన । దానిఁ
గల నగ భ గల న
జేయ । కునికిదో । షంబని । ♦ చెప్పె । మనువు॥

ఇందు ప్రతిపాదమునందలి మొదటియక్షరమునకును నాల్గవ గణము మొదటియక్షరమునకును యతి చెల్లుచున్నది.

1. అటవెలఁది:- "ఆ॥ ఇనగణత్రయంబు ♦ నింద్రద్వయంబును। హంసపంచకంబు ♦ నాటవెలఁది"॥ ఆటవెలఁది ప్రతిపాదమునకును నైదేసి గణము లుండును. దీని పాదములను రెండింటి నొక్కటిగాఁగొని లక్షణమును జెప్పుదురు. దీని మొదటిపాదములో మొదట మూఁడు సూర్య గణములును, తరువాత రెండింద్రగణములును నుండును. దీని రెండవ పాదమున నైదుసూర్యగణము లుండును. ప్రతిపాదముయొక్క మొదటి యక్షరమునకు దానియందలి నాల్గవగణము మొదటి యక్షరమునకును యతి చెల్లుచుండును. లేనిచో పాదముయొక్క రెండవయక్షరమును నాపాదమునందలి నాల్గవగణములోని రెండవయక్షరము నొకేహల్లుగానుండి ప్రాసయతినేని గలిగి యుండవలెను. ఇట్టి లక్షణములుగల పాదములు నాల్గుగూడిన ఆటవెలఁదిపద్య మగును. ఆటవెలఁదికిఁ బ్రాసనియమము లేదు.

గల గల స ర నల
ఆ॥ సర్వ । భూత । దయకు। ♦ సత్యవా । క్యమునకు
గల గల గల గల గల
నుత్త । మంబు । ధర్మ । ♦ వాండె । యుంగ
న గల గల సల నల
నొరుల । నొప్పి । కోర్వ । ♦ కుపతాప । మొసరించు
న న గల న న
సదియ । కడుస । ధర్మ । ♦ మనిరి । బుధులు ॥

ఇందుఁ బ్రతిపాదమునందలి మొదటియక్షరమునకును నందలి నాల్గవగణము మొదటియక్షరమునకును యతి చెల్లుచున్నది.

3. సీసము:— "సీ॥ ఇంద్రగణము లాఱు ♦ నినగణంబులు రెండు| పాదపాదమునను ♦ బరగుచుండు | నాటవెలఁదినైన ♦ దేటగీతియు నైనఁ | జెప్పవలయు, మీఁద ♦ సీసమునకు॥"

ఆఱు ఇంద్రగణములు రెండు సూర్యగణములు గలపాదములను నాల్గింటిని జెప్పి యటమీఁద తేటగీతినో లేక ఆటవెలఁదినో చెప్పినది సీసపద్య మగును. ప్రతి సీసపాదమును నాలుగేసి గణములుగల రెండేసి దళములుగా విభజింపవచ్చును. ప్రతిదళముయొక్క మొదటి యక్షరమునకును దానిమూఁడవగణముయొక్క మొదటియక్షరమునకును యతి చెల్లుచుండవలెను. లేదా దాని మొదటిగణము ద్వితీయాక్షరమును మూఁడవగణము ద్వితీయాక్షరమును నొకే వ్యంజనమయి ప్రాసయతియేని చెల్లుచుండవలెను. అనగా ప్రతి సీసపాదముయొక్క మొదటిగణము మొదటియక్షరమునకును మూఁడవగణము మొదటియక్షరమునకును, ఐదవగణము మొదటియక్షరమునకును నేడవగణము మొదటియక్షరమునకును యతియేని చెల్లుచుండవలెను. లేదా మొదటిగణము ద్వితీయాక్షరమును మూఁడవగణము ద్వితీయాక్షరమును నొకేవ్యంజనమును, ఐదవగణము ద్వితీయాక్షరమును నేడవగణము ద్వితీయాక్షరమును నొకేవ్యంజనమునునై ప్రాసయతిని గల్గియుండవలెను. దీనికిఁ బ్రాసనియమము లేదు.

త నల త నల నల ర న న
సీ॥ మందార | మకరంద | ♦ మాధుర్య | మునఁదేలు | మధుపంబు | వోవునే ♦ మదన | ములకు
భ త త నల త నల గల న
నిర్మల | మందాకి ♦ నీవీచి | కలఁదూగు | రాయంచ | సనునెత ♦ రంగి | ణులకు |
నల ర నల త భ ర న న
లలితర | సాలప ♦ ల్లవఖాది | యైచొక్కు | కోయిల | సేరునే ♦ కుటజ | ములకు |
త ర నల భ నగ ర గల న
బూర్ణేందు | చంద్రికా ♦ స్ఫురితచ ♦ కోరక | మరుగునే | సాంద్రనీ ♦ హారి | ములకు|

గల భ ర గల గల
తే॥ నంబు । జోదర । దివ్యపా ♦ దార । విండ ।
గల భ భ గల గల
చింత । సామృత । పానవి ♦ శేష । మత్త ।
గల త నల గల గల
చిత్త । మేరీతి । నితరంబుఁ ♦ జేర । నేర్చు ।
న నల భ గల గల
వినుత । గుణశీల । మాటలు ♦ వేయు । నేల ॥

ఇందలి సీసపాదములు నాల్గింటిలోను మొదటిదళము మొదటి యక్షరములకును మూఁడదళము మొదటియక్షరమునకును యతి చెల్లుచున్నది. ప్రతిద్వితీయదళముయొక్క మొదటియక్షరమునకును దానిలోని మూఁడవగణము మొదటియక్షరమునకును యతి చెల్లుచున్నది. సీసపాదముల నాల్గింటిమీఁదను తేటగీతిని జెప్పియున్నాఁడు.

4. ద్విపద :—

క॥ ఎలమిన్ మూఁ డింద్రగణం ।
బులపై నొకసూర్యగణము ♦ పొందించిన స ।
ల్లలితముగ ద్విపదలక్షణ ।
మిలఁ బదములు రెండు ప్రాస ♦ మేకము కృష్ణా॥

ద్విపదయొక్కపాదములో మొదట మూఁడింద్రగణములును, తరువాత నొక సూర్యగణమును, నుండును. మొదటిగణము మొదటి యక్షరమునకును మూఁడవగణము మొదటియక్షరమునకును యతి చెల్లుచుండును. ద్విపదలందుఁ బ్రాసయతిని బాటింపఁగూడదు. ద్విపదకు రెండుపాదములుమాత్ర ముండును. ద్విపదకుఁ బ్రాసనియమ మున్నది.

త నల ర గల
ద్వి॥ సత్యంబు । గలిగిన । ♦ జాలువే । మేల
ర నల ర న
సత్యమే । జయమని । ♦ చాటువే । దములు.

ఇందలి మొదటిపాదము లోని మొదటిగణము మొదటి యక్షరమగు-స-కును, మూఁడవగణము మొదటియక్షరమగు-జ-కును యతి చెల్లు

చున్నది. ఇక్లే రెండవపాదము మొదటి-స-కును నంధ్రలిమూఁడవగణము మొదటి-చ-కును యతి చెల్లుచున్నది. రెండుపాదములలోను రెండవ యక్షరము -త్య- యగుచున్నది గావున -త్య-ప్రాస నుపయోగించిరి. ఇందు రెండుపాదములుమాత్ర మున్నవి.

5. కందము :- క॥ కందము * త్రిశరగణంబుల । నందము-గా-భ-జ-స-నల - ము ♦ లఁట, వడిమూఁటన్।బొందును, న-ల-జ-ల-నాఱిట నొందుం దుద ♦ గురువు, -జ-గణ ముండదు బేసిన్॥

కందపద్యముయొక్క మొదటి రెండుపాదములను నొక్కటిగాఁ గాని లక్షణము చెప్పుదురు. ఈ రెండుపాదములలోను గలిసి యెనిమిది గణము లుండు, మొదటిపాదములో మూఁడుగణములును, రెండవ పాదములో నైదుగణములున్ను నుండును. కందపద్యమునందు-గగ-భ-జ-స-నల-యను గణములనుమాత్రమే యుపయోగింపవలెను. రెండవ పాదము మొదటియక్షరమునకును నాపాదములోని నాల్గవగణము మొదటియక్షరమునకును యతి చెల్లుచుండును.ఆఱవగణము-అనఁగా రెండవ పాదములోని మూఁడవగణము నల - జ - యను గణములలో నేదియో యొకటియై యుండవలెను. బేసిసంఖ్యగణముగా -జ-గణమును నిలుపఁగూడదు. మొదటిగణముగాఁ గాని, మూఁడవగణముగాఁగాని-ఐదవగణముగాఁగాని, యేడవగణముగాఁగాని-జ-గణ ముండఁగూడదు. రెండవపాదము చివర గురు వుండవలెను. దీనికిఁ బ్రాసనియమ మున్నది.

భ గగ భ
క॥ శోకము । సర్వా । ర్థంబులఁ ।
గగ స జ భ స
బోకా । ర్చునుశో । కమూత్మఁ । ♦ బొందక, । ముదముం ।

---

* త్రి = మూఁడు ; శరము = (మన్మథునిబాణములైదు కావున) = ఐదు; మొదటిపాదమున మూఁడుగణములు రెండవపాదమున నైదుగణములు నుండును.

భ న నల
జేకొని, । కృతకృ । త్యుఁడవయి, ।
భ గగ నల న గగ
కైకొను । తేజం । బుజయము । ♦ కడుధ । ర్మంబున్

ఈ పద్యములో మొదటిపాదములోను మూఁడవపాదములోను మూఁడేసిగణము లున్నవి. రెండవపాదములోను నాల్గవపాదములోను నైదేసిగణము లున్నవి. ఇందు -గగ-భ-జ-స-నల- ము లను గణములను మాత్రమే యుపయోగించినాఁడు. రెండవపాదము మొదటియక్షరమగు -బో- యనుదానికిని, ఆపాదమునందలి నాల్గవగణము మొదటియక్షరమగు -బా- యను దానికిని యతి చెల్లినది. ఇట్లే నాల్గవపాదములో పాదాది -కై- యను దానికిని దానిలోని నాల్గవగణము మొదటియక్షరమగు -క- యను దానికిని యతి చెల్లినది. ఇందలి రెండవపాదములోని మూఁడవగణము -జ- గణమైనది. నాల్గవపాదములోని మూఁడవగణము -నల-మయినది. 1, 3, 5, 7 గణము లెవ్వియు గూడ -జ- గణములు కావు. రెండవ, నాల్గవపాదముల చివరలందు-ముం- బున్- అను గురువు లున్నవి. దీని యన్నిపాదముల ద్వితీయాక్షరములు -క- కారములే యగుటచే నిందు -క- ప్రాసము చెల్లుచున్నది.

6, చంపకమాల: చ॥ "న-జ-భ-జ-జ-ల్జ-రేఫ"- లఁ బె ♦ నంగి దశాయతితోడఁ గూడినన్ । ద్రిజగదభీష్టదా బుధని ♦ ధీ విను చంపకమాలయై చనున్॥

దీనికిఁ బ్రాసనియమ మున్నది. ప్రతిపాదమునందును-న-జ-భ-జ-జ-జ-ర-యను గణములు వరుసగా నుండును. ప్రతిపాదముయొక్క తొలియక్షరమునకును బదునొకటవ యక్షరమునకును యతి చెల్లును.

న జ భ జ జ జ ర
చ॥ అడిచి । నదిట్టె । నన్ మతి । మ ♦ హాప । రుషంబు । లుఁదల్కి । యల్లతో
న జ భ జ జ జ ర
బొడిచి । నసుత్త । మద్విజా । లు ♦ పూజ్యు । లువార । లకగ్గ । సేసినం ।
న జ భ జ జ జ ర
జెడుని । హముంబ । రంబుని । ది ♦ సిద్ధ । ముగాపు । టెటింగి । భక్తి
న జ భ జ జ జ ర
ప్పుడుధ । రణీసు । రోత్తము । లఁ ♦ బూజ । లఁదన్పు । దునల్గ । నోడుదున్॥

ఈపద్యమునందలి యన్ని పాదముల ద్వితీయాక్షరములును -డ- కారములే యగుటచే నిందు -డ- కారము ప్రాసముగా వాడినారు. ప్రతిపాదమునందును మొదటియక్షరమునకును బదునొకొండవయక్షరమునకును యతి చెల్లుచున్నది. మొదటిపాదమున -అ-హా-లకు; రెండవ పాదమున -బొ-పూ-లకు; మూఁడవపాదమున -జె-సి-లకు; నాల్గవపాదమున -పు-బు-లకు యతి చెల్లుచున్నది. లక్షణమునఁ జెప్పినగణములను గ్రమము తప్పకుండ నన్ని పాదములయందును నట్లే నిలిపియున్నారు.

7. ఉత్పలమాల. :ఉ॥ భానుసమాన వి-స్ఫు-ర-న ♦ భా-ర-లగం-బులఁగూడి విశ్రమ । స్థానమునందుఁ * బద్మజయు ♦ తేంబుగ నుత్పలమాలయై చనున్.

దీనికిఁ బ్రాసనియమ మున్నది. ప్రతిపాదమునందును భ-ర-న-భ-భ-ర-లగ-యను గణములు వరుసగా నుండును. ప్రతిపాదముయొక్క మొదటియక్షరమునకును బదియవయక్షరమునకును యతి చెల్లును.

భ ర న భ భ ర లగ
ఉ॥ నిండుమ । నంబున । బ్యనవ ♦ నీతస । మానము । పల్కు-దా । రుణా
భ ర న భ భ ర లగ
ఖండల । శస్త్రతు । ల్యముజ ♦ గన్నత । విప్రుల । యందుని । క్కమీ ।
భ ర న భ భ ర లగ
రెండును । రాజులం । దువిప ♦ రీతము । గావున । విప్రుఁడో । పునో ।
భ ర న భ భ ర
పండతి । శాంతుఁడ । య్యునర ♦ పాలుఁడు । శాపము ♦ గ్రమ్మతిం । పఁగన్॥

ఈపద్యమునందలి యన్ని పాదముల ద్వితీయాక్షరములును -ండ- లే యగుటచే నిందు బిందుపూర్వక -డ- కారమును బ్రాసగా వాడినారు. ప్రతిపాదమునందును మొదటియక్షరమునకును బదియవయక్షరమునకును యతి చెల్లుచున్నది. మొదటిపాదమున -ని-నీ-లకును, రెండవపాదమున -ఖ-గ- లకును, మూఁడవపాదమున -రె-రీ-లకును, నాల్గవపాదమున -ప-పా-లకును యతి చెల్లుచున్నది. లక్షణమునఁ

---

* పద్మజ=బ్రహ్మ=నవబ్రహ్మలుగావున=తొమ్మిది. తొమ్మిదియక్షరముల మీఁద యతి యని యెఱుంగునది.

జెప్పినగణములను క్రమముతప్పకుండ నన్ని పాదములందును నట్లే నిలిపి యున్నాఁడు. నాల్గవపాదములోని -గ్రమ్మతింప- యను పదముయొక్క మొదటియక్షరమగు -గ్ర- ఊదఁబడనిజడ్డ కావున దాని పూర్వాక్షర మగు -ము- గురువు కాదు, లఘువే యగును.

చంపకమాల పాదముయొక్క మొదటి రెండులఘువులకును బదులుగా నొక్కగురువు నుంచినచో నది యుత్పలమాల పాదమగును.

ఉత్పలమాలపాదముయొక్క మొదటిగురువునకు బదులుగా రెండు లఘువులను గూర్చినచో నది చంపకమాలపాద మగును.

చ॥ అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టులకాక యంచు నా —

ఉ॥ అంటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టులకాక యంచునా —

8. మత్తేభము. మ॥ స్మయదూరా విలసత్త్రయోదశయతి ♦ న్మత్తేభవిక్రీడితా। హ్వాయమయ్యెన్ - స-భ-ర-ప్ముల-స్న-మ-య-వ- ♦ వ్రాతంబుల న్గూడఁగాన్॥

దీనికిఁ బ్రాసనియమ మున్నది. ప్రతిపాదమునందును- 'స-భ-ర-న-మ-య-లగ'- యను గణములు వరుసగా నుండును. ప్రతిపాదము యొక్క మొదటియక్షరమునకును బదునాల్గవయక్షరమునకును యతి చెల్లును.

స భ ర న మ య లగ
మ॥ సిరికిం। జెప్పఁడు। శంఖచ। క్రయుగ। ముం ♦ జేదో। యిసంధిం। పఁడే।
స భ ర న మ య లగ
పరివా। రంబును। జీరఁడ। భ్రగప। తిం ♦ బన్నిం। పఁడాక। ర్ణికాం।
స భ ర న మ య లగ
తరథ। మ్మిల్లముఁ। జక్కనో। త్తఁడువి। వా ♦ దప్రో। ద్ధతశ్రీ। కుచో।
స భ ర న మ య లగ
పరిచే। లాంచల। మైనవీ। డఁడుగ। జ ♦ ప్రాణా। వనోత్సా। హియై॥

ఈపద్యమునందలి యన్ని పాదముల ద్వితీయాక్షరములును రేఫ ములే యగుటచే, నిందు రేఫమును బ్రాసముగా వాడినారు. ప్రతిపాద మునందును మొదటియక్షరమునకును బదునాల్గవయక్షరమునకును యతి చెల్లుచున్నది. మొదటిపాదమున, పాదాది -సి-కిని పదునాల్గవయక్షర

మగు -జే- కును యతి చెల్లుచున్నది. రెండవపాదములో పాదాది -ప- కును బదునాల్గవయక్షరమగు -బ- కును యతి చెల్లుచున్నది. మూఁడవ పాదములో పాదాది -త- కారమునకును బదునాల్గవయక్షరమగు -ద- కును యతి చెల్లుచున్నది. నాల్గనపాదములో పాదాది -ప- కును బదునాల్గవయక్షరమగు -ప్రా- లోని -పా- కును యతి చెల్లుచున్నది. లక్షణమునఁ జెప్పినగణములను గ్రమముతప్పకుండ నన్నిపాదములందును నక్లే నిల్పియున్నాఁడు.

9. శార్దూలము : శా॥ సారాచారవిశారదా * యినయతి♦న్శార్దూలవిక్రీడితా । కారంబై -మ-స-జ-మ్ము-లిమ్ము-గ-స-తా-♦ గ - ప్రాప్తమై చెల్వగున్॥

దీనికిఁ బ్రాసనియమ మున్నది. ప్రతిపాదమునందును-మ-స-జ-స-త-త-గ'-యను గణములు వరుసఁగా నిలిచి యుండును. ప్రతిపాదము యొక్క మొదటియక్షరమునకును బదుమూఁడవ యక్షరమునకును యతి చెల్లుచుండును.

మ స జ స త త గ
శా. సింగంబా । కఁటితో । గుహాంత । రమునం । ♦ జేడ్పాటు । మైనుండి । మా
మ స జ స త త గ
తంగస్ఫూ । ర్జితయో । ధదర్ప । ననము । ద్యత్రోట-ధ । మైవచ్చు । నో
మ స జ స త త గ
జంగాంతా । రనివా । సఖన్న । మతిన । ♦ స్మత్సేన । పై వీఁడె । వ
మ స జ స త త గ
చ్చెంగుంతీ । సుతమ । ధ్యముండు । సమర । ♦ స్థేమాభి । రామాకృతిన్.

ఈ పద్యమునందలి యన్ని పాదముల ద్వితీయాక్షరములును బిందుపూర్వక -గ- కారంబు లగుటచే నింక బిందుపూర్వక గకారమును బ్రాసగా వాడినారు. ప్రతిపాదమునందును మొదటియక్షరమున

* ఇనుఁడు = సూర్యుఁడు = పండ్రెండుగురు సూర్యులు కావున బండ్రెండక్షరములమీఁద యతియని యెఱుంగునది.

కును బదుమూఁడవ యక్షరమునకును యతి చెల్లుచున్నది. మొదటి పాదమున -సి-జే-లకును, రెండవపాదమున -త-ద-లకును, మూఁడవ పాదమున -జ-స- లకును, నాల్గవపాదమున-చె-సే- లకును యతి చెల్లు చున్నది. లక్షణమునఁ జెప్పిన గణములను గ్రమము తప్పకుండ నన్ని పాదములందును నట్లే నిలిపియున్నాఁడు.

మత్తేభపాదముయొక్క మొదటి రెండులఘువులకును బదులుగా నొక్క గురువును గూర్చినచో నది శార్దూలపాద మగును.

శార్దూలపాదముయొక్క మొదటిగురువునకు బదులుగా రెండు లఘువులను గూర్చినచో నది మత్తేభపాద మగును.

మ॥ అనినం గేకయరాజనందన ప్రభూ ♦ తాశ్చర్యయై యిట్లనున్.
శా॥ అన్నం గేకయరాజనందన ప్రభూ ♦ తాశ్చర్యయై యిట్లనున్.

10. మత్తకోకిల:—

"మత్త॥ శ్రావకాభరణాంకవిశ్రుత -ర-స- జా-భ-రేఫల దిగ్వి‡రా।
మావహంబుగ మత్తకోకిల మయ్యెఁ దీనిఁ గవీశ్వరుల్॥

దీనికిఁ బ్రాసనియమ మున్నది. ప్రతిపాదమునందును -ర-స-జ-జ-భ-ర- యను గణములు వరుసగా నిలిచియుండును. ప్రతిపాదము యొక్క మొదటి యక్షరమునకును బదునొకండవయక్షరమునకును యతి చెల్లుచుండును.

ర స జ జ భ ర
మత్త: వేఁడుకొం । తయుఁగ । ష్టమైన । ను ♦ వేఁడు । లేనిసు । హృజ్జనున్ ।
ర స జ జ భ ర
వేఁడుకో । లుచితం । బకావు । న ♦ వేడ్క । తోఁజని । సోమకున్ ।
ర స జ జ భ ర
వేఁడినన్ । ధనహో । పడేని । యు ♦ వీని । మాత్రకు । నాలుగేన్ ।
ర స జ జ భ ర
పాఁడికు । ఱులనీఁ । డెవీని । కిఁ ♦ బాలు । ద్రావుచు । నుండఁగాన్ ।

ఈపద్యమునందలి యన్ని పాదముల ద్వితీయాక్షరములును నర్ధ బిందుపూర్వక -డ- కారములగుటచే దీనియం దర్ధబిందుయుతడ ప్రాసము

‡ దిక్కులుపది కావున పదియక్షరములమీఁద యతి యని యెఱుంగునది.

వాడఁబడినది. ప్రతిపాదమునందును మొదటియక్షరమునకును బదునొకటవయక్షరమునకును యతి చెల్లుచున్నది. మొదటిరెండు పాదములలోను -వే-వే-లకును, మూఁడవపాదములో -వే-వీ- లకును, నాల్గవపాదములో -పా-బా- లకును యతి చెల్లుచున్నది. లక్షణమునఁ జెప్పినగణములను గ్రమముతప్పకుండ నన్నిపాదములందును నన్నెచోడుఁడు నిలిపియున్నాఁడు.

**11.** తరళము లేక ధ్రువకోకిల:—

తరళ॥ శుభవిలాస, ముకుంద, కేశవ, ♦ శూలి‡ భవ్యనిరామముల్
నభరసంబులు జాగముల్ దగు ♦ నవ్యమై ధ్రువకోకిలన్॥

దీనికి బ్రాస నియమమున్నది. ప్రతిపాదమునందును -న-భ-ర-స-జ-జ-గ- యను గణములు వరుసగా నిలిచియుండును. ప్రతిపాదము యొక్క మొదటియక్షరమునకును బండ్రెండవయక్షరమునకును యతి చెల్లుచుండును.

న భ ర స జ జ గ
"తరల॥ హారిహ । రాజగ । జానసా । ర్కృష ♦ డ్వా । స్యమాతృ । సరస్వ । తీ ।
న భ ర స జ జ గ
గిరిసు । తాదిక । దేవతా । తతి ♦ కిఁ । నమస్కృ । తిసేసి । దు ।
న భ ర స జ జ గ
ర్భరత । పోవిభ । వాధికున్ । గురు ♦ ప । ద్యవిద్య । కునాద్యు । నం ।
న భ ర స జ జ గ
బురుహ । గర్భుని । భుంబ్రచే ।తసు ♦ పు । త్రుంభక్తిఁ । దలంచు । చున్॥

ఈపద్యమునందలి యన్నిపాదముల ద్వితీయాక్షరములును రేఫములగుటచేదీనియందు రేఫముప్రాసముగా వాడఁబడినది. ప్రతిపాదమునందును మొదటియక్షరమునకును బండ్రెండవయక్షరమునకును యతి చెల్లుచున్నది. మొదటిపాదమునందు -హా-ఆ-లకును, రెండవపాదమునందు -గి-కి- లకును, మూఁడవపాదమునందు -భ-ప- లకును - నాల్గవ పాదమునందు -బు-పు-లకును యతిచెల్లుచున్నది. లక్షణమునఁ జెప్పిన గణములను గ్రమముతప్పకుండ నన్నిపాదములందును నన్నెచోడుఁడు నిలిపియున్నాఁడు.

---

‡శూలి=శివుఁడు=ఏకాదశరుద్రులు=కావున బదునొకండక్షరములమీఁద యతి యని తోఁచుచుండును.

తరలముయొక్క మొదటిరెండులఘువులకును బదులుగా నొక్క గురువును గూర్చినచో నది మత్తకోకిలయగును.

మత్తకోకిలయొక్క మొదటిగురువునకు బదులుగా రెండులఘువులనుగూర్చినచో నది తరలపాదమగును.

తరల॥ కనియె ముందట నమ్మహీపతి • గాంగసైకతభూములన్ ।
మత్త॥ కాంచె ముందట నమ్మహీపతి • గాంగ సైకతభూములన్ ॥

—ః—

# 16. అలంకారప్రకరణము

1. రసవంతములయిన యర్థములను బోధించు సలక్షణములయిన శబ్దములను బ్రయోగించి, గద్యములను బద్యములను రచించి, కవులు కావ్యములను గల్పింతురు. కావ్యలక్ష్మికి సౌందర్యము నాపాదించునవి యలంకారములు. ఈ సౌందర్యము శబ్దములవలనను, నర్థములవలనను గలుగును. కావున శబ్దాలంకారములు, అర్థాలంకారములునని యలంకారములు రెండువిధములయినవి. వాక్యమునందలి శబ్దములను వినినంతమాత్రముననే వినువారలమనంబుల కాహ్లాదమును గల్పించుచు, రచనమునకు శోభనుగూర్చు (-అనుప్రాస- విశేషాదులను) శబ్దాలంకారము లందురు. వాక్యములయొక్క యర్థము ప్రధానముగాఁ గల్గి, చదువరుల మనంబులను రంజింపఁజేయుచుఁ, గావ్యమునకు శోభ గలిగించు -ఉపమాదులను- అర్థాలంకారము లందురు.

## A. శబ్దాలంకారములు

### 1. ఛేకానుప్రాసము.

తే. అదర నెడలేక రెండురెం డక్షరంబు ।
లెనయునియమంబు ఛేక మగు...॥.

వ్యవధానము లేనిహల్లులజంటయొక్క ఆవృత్తిని ఛేక మందురు. ఇట,హల్లులయావృత్తియే ప్రధానము. ఆవృత్తము లగుహల్లులమీఁది యచ్చు లొకటిగనే యుండవలయు నననియమము లేదు. ఉ॥ రాజన్య

జన్యవిజయుఁ డగురాజు క్షేమంకరకరమున మహీమండలము నేలు చున్నాఁడు- ఇట-జన్య-జన్య, కర-కర-యను హల్లులజంటలకు అవ్యవధానావృత్తి గలిగినది. కావున నివి ఛేకానుప్రాసమున కుదాహరణము లయినవి.

2. వృత్త్యనుప్రాసము.

తే. ఒక్క వర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ।
బరగు జృంభణ వృత్త్యనుప్రాసమయ్యె॥

ఒకటి, రెండు, మూఁడు లేక నాలుగువర్ణములయొక్క వ్యవధానము గలపునఃపునరావృత్తిని వృత్త్యనుప్రాస మందురు. ఇవి పెక్కుమాఱులు ఆవృత్తములు కావచ్చును. వీని యావృత్తులు వ్యవధానము గలవి యైనను గావచ్చును. వ్యంజనయుగ్మముయొక్క యావృత్తి వ్యవధానసహితమయినచో వృత్త్యనుప్రాస మగును; అయ్యది వ్యవధానరహిత మగుచో ఛేకానుప్రాస మగును.

ఉ॥ విపక్షశిక్షణదక్షుం డగుక్షితీశుండే క్షోణీతలంబున క్షుపితదుర్నయుం డగును. ఇట-క్ష-కారమున కావృత్తి గలిగినది. కావున నది వృత్త్యనుప్రాసమున కుదాహరణము.

3. లాటానుప్రాసము

తే. తలఁపఁ బునరుక్తియయ్యుఁ దాత్పర్యభేద
మెనయునియమంబు లాటమా...

తాత్పర్యభేదము గలిగి స్వరూపభేదము లేనిశబ్దార్థముల పౌనరుక్త్యము లాటానుప్రాసము.

సీ. కమలాక్షు నర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథు వర్ణించు ♦ జిహ్వ జిహ్వ.

ఇట -కరములు కరములు- అనుచో- మొదటికరము లనుదానికి చేతులనియు రెండవకరములు అనుదానికి సార్థకము లయినచేతులనియు తాత్పర్యభేదము కాన్పించుచున్నది. కావున నిది లాటానుప్రాసమున కుదాహరణ మగుచున్నది. -జిహ్వ-జిహ్వ- యనుచోఁగూడ నిట్లే యొఱుంగునది.

### 4. యమకము

క॥ సమవర్ణయుగాధికమై । యమరిననియమంబు యమక మగు.

స్వరవ్యంజనయుగ్మములపౌనరుక్త్యము యమకము. ఛేకాను ప్రాసమునందును, వృత్త్యనుప్రాసమునందును హల్లులకే పునరుక్తి చెప్పఁబడినది. ఇందు అచ్చులకును హల్లులకును గూడఁ బునరుక్తి చెప్పఁబడినది. i. పాదయమకము, ii. ముక్తపదగ్రస్తమునని యమకము ద్వివిధము.

#### i. పాదయమకము

పద్యముయొక్క రెండవపాదమును నాల్గవపాదమును నొక్కటియే యైనచో నది పాదయమకము.

క॥ ఔరా యౌబన్యపాలకు । మారా మనుమదనసమరమాధుర్యుఁడవై।
ధీరాన్యసింహా యూడిక్కి । మారామను మదనసమరమాధుర్యుఁడవై.

#### ii. ముక్తపదగ్రస్తము

విడిచిపెట్టినపదమును మరల గ్రహించుటే ముక్తపదగ్రస్తము.

(a) పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము, (b) సింహావలోకనముక్తపదగ్రస్తము అని ముక్తపదగ్రస్తము రెండు విధములు.

(a) పాదాంతమునందు విడిచినపదమును దరువాతిపాదముయొక్క మొదటఁ దిరిగి గ్రహించుట పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము.

క॥ సుదతీనూతనమదనా । మదనాగతురంగపూర్ణమణిమయసదనా ।
సదనామయగజరదనా । రదనాగేంద్రనిభకీర్తిరస నరసింహా.

(b) పాదాంతపాదాదిముక్తపదగ్రస్తనియమము గలపద్యములో ప్రథమపాదాది నున్నపదము చతుర్థపాదాంతమున నావృత్తమైనచో దానిని సింహావలోకనముక్తపదగ్రస్త మందురు.

క॥ మన వేటికి నూతనమా । తనమాయెడఁ బ్రేమఁ దనకుఁ దక్కితినను మా ।
నను మానక దయదనరం । దనరంతులు మాని నరసథవు రమ్మనవే.

ప్రథమపాదాదినున్న -మనవే- యనునది చతుర్థపాదాంతమున నుండుటచే నిది సింహావలోకనముక్తపదగ్రస్తమున కుదాహరణ మగుచున్నది.

## B. అర్థాలంకారములు.

### 1. ఉపమ (Simile.)

గీ. వర్ణ్య, ముపమాన, ముపమానవాచకము, స
మానధర్మము, సంఘటింపనగు నుపమ॥

మన మేదేని యొకవస్తువును వర్ణించునపుడు దానిని వేఱొక వస్తువుతోఁ బోల్చి చెప్పుదురు. రెండువస్తువులకుఁ గలపోలికను జెప్పుట ఉపమాలంకారము. * మనము వర్ణించు వస్తువును వర్ణ్యము లేక ఉపమేయ మందురు. మనము వర్ణించు వస్తువును దేనితోఁ బోల్చుచున్నామో దానిని -ఉపమాన మందురు. ఉపమానోపమేయములకుఁగల పోలికను స్పష్టపఱచు -పోలె-వలె-వంటి-సరి-జత-ఈడు-ఉద్ది-ఎన-సమానము-తుల్యము-సన్నిభము- సదృశము- సంకాశము- నీకాశము- మిత్రము-బంధువు-సోదరుఁడు-చుట్టము- మొదలగుపదములను-ఉపమానవాచకము లందురు. ఉపమానోపమేయములందు సమానముగా నుండు గుణమును (=Common Property) సమానధర్మ మందురు.

ఉపమేయము, ఉపమానము, ఉపమావాచకము,సమానధర్మము నను నీనాలుగుపమానసామగ్రులతో నలరారుదానిని ఉపమ యందురు. ఉ॥ "ముఖము. కమలమువలె సుందరముగా నున్నది." ఇట వర్ణింపఁబడునది ముఖము. కావున ముఖము-ఉపమేయము. ముఖమును -కమలముతోఁబోల్చినాఁడు కనుక -కమలము- ఉపమానము. ఇందు- వలె-యను నుపమావాచకమును ప్రయోగించినాఁడు. సౌందర్యగుణముముఖమునకును గమలమునకునుగూడఁ గలదు. కావున సౌందర్యము వీనికిఁగల సమానధర్మము. ఈయుదాహరణమునం దుపమేయము- ఉపమానము- ఉపమావాచకము- సమానధర్మము- అను నీనాల్గుపమానసామగ్రులుఁ నుండుటచే నిది యుపమాలంకారమున కుదాహరణ మగుచున్నది.

---

★ "SIMILE:- is the resemblance between two things expressed in a single sentence unaccompanied with the statement of difference."

### 2. రూపకము (Metaphor.)

ఆ. విషయరజంనంబు ♦ విషయంబునకుఁ జెప్ప।
రూపకం బనంగ ♦ రూఢి నెసఁగు॥

ఉపమేయమునందు ఉపమానము నారోపించుట * రూపకము. సమానధర్మమునుబట్టి ఉపమేయమును ఉపమానమని చెప్పుటే రూపకము. ఉ॥ కీర్తిచంద్రికలు - సూరిచకోరములు,

### 3. ఉత్ప్రేక్ష (Poetical Fancy.)

తే॥ ఊహ రూపింప నుత్ప్రేక్ష ♦ యూర్జితముగ.

ఉపమానముయొక్క ధర్మ ముపమేయమునందుఁ గన్పట్టుచుండుటవలన నాయుపమేయమును నుపమానముగా నూహించుట యుత్ప్రేక్ష. †

ఉ॥ "చీఁకట్లను జక్రవాకాంగనల విరహాగ్ని ధూమముగాఁ దలఁచుచున్నాను." చీఁకటికి- నలుపు- కన్నులు కనపడకుండఁ జేయుట- మున్నగుధర్మము లున్నవి. ధూమమునకుఁగూడ నీగుణములే యున్నవి. ఇందుమూలమునఁ జీఁకటిని కోకాంగనావిరహధూమముగా భావించుచున్నాఁడు. చీఁకటి యనువస్తువును ధూమ మనువస్తువుగా నూహించుటచే నిది ఉత్ప్రేక్ష యైనది.

### 4. అతిశయోక్తి (Hyperbole.)

క॥ ఉపమేయ మింతతడవక
యుపమానమె నుడువ నతిశయోక్తి కవిమహా
నిపుణోక్తి మూలమైతగు । . . . .

* "METAPHOR:–consists in the representation of the subject of description, which (subject) is not concealed as identified with another (a well known standard.)"

† POETICAL FANCY:-is the imagining of an object under the character of another."

కవి తనప్రౌఢములయిన ఉక్తులచేత ఉపమేయమును గప్పిపుచ్చి యుపమానమును జెప్పిన నది యతిశయోక్తి † యగును.

ఉ॥ రఘుకులాంభోనిధిని గల్పతరు వుద్భవించినది.

ఇట నుపమేయము రఘుకులమునఁ బుట్టినరామచంద్రుఁడు. దీనిని నుడువకయే యుపమానమయిన కల్పవృక్షముమాత్రము చెప్పఁబడినది. ఇది మహాకవియొక్క నైపుణ్యమును వెల్లడించుచున్నది. కావున నిది యతిశయోక్త్యలంకారమున కుదాహరణ మగుచున్నది.

5. అర్థాంతరన్యాసము (Corroboration)

తే. చెప్పఁదొడఁగినయర్థసంసిద్ధికొఱకు ।
వేఱయర్థము యోజించి వెలయఁదెలుప ।
నదియ యర్థాంతరన్యాస మనఁగఁబరఁగు ॥ ......

సామాన్యమును విశేషముచేఁ గాని, విశేషమును సామాన్యముచేఁగాని సమర్థించుట * అర్థాంతరన్యాసము. ఉ॥ అసారవస్తుసముదయము కార్యసాధక మగును; గడ్డిపఱకలు వెంటిగా నేర్పడి మత్తగజమును బంధించుచున్నవి.

ఇట మొదటివాక్యార్థము సామాన్యము; దానిని బలపఱుచుచు విశేషమైన దగు రెండవవాక్యార్థము ప్రయుక్తమయినది; కావున నిది యర్థాంతరన్యాసాలంకారమున కుదాహరణ మగుచున్నది.

ఉ॥ "ఆంజనేయుఁడు సముద్రమును దాటెను. ఆహా ! మహాత్ములకు దుష్కరమైన దేద్దియును లేదుకదా !" ఇట-ఆంజనేయుఁడు సముద్రమును దాటుట-విశేషము-మహాత్ములకు దుష్కరమయిన దేద్దియును లేదుకదా! --ఇది సామాన్యము. ఇట రెండవదియగు సామాన్యముచే మొదటఁ జెప్పఁబడిన విశేషము సమర్థింపఁబడినది. కావున నిది అర్థాంతరన్యాసమున కుదాహరణ మగుచున్నది.

---

† "When the introsusception (=taking in of ideas = అధ్యవసాయము) is complete, it is styled Hyperbole."

* "When a general proposition is strengthened by a particular one or a particular by a general one, the figure is CORROBORATION."

6. స్వభావోక్తి.

గీ. అగు స్వభావోక్తి జాత్యాదులందుఁ గలస్వ।
భావ మెంతేని వర్ణింపఁబడియెనేని॥

మనుష్యులు, పశువులు, పక్షులు మున్నగుప్రాణులయు, ఇతర వస్తువులయు గుణములను ఉన్నవానిని ఉన్నట్లు వర్ణించుట స్వభావోక్తి.

ఉ॥ లేళ్లు చంచలాక్షములు, స్తబ్ధకర్ణములునై కన్పట్టెను.

లేళ్లకు-నేత్రములు చలించుట, చెవులు రిక్కించుట-సహజము. కావున నిది స్వభావోక్త్యలంకారమున కుదాహరణ మగుచున్నది.

---

## 17. వ్యాస ప్రకరణము

1. ఏదేని యొకవిషయమునుగూర్చి ప్రకటించెడి మితపరిమాణముగల రచనమును వ్యాసమందురు. కథనములు, వర్ణనములు, వివరణములు, తర్కములు, నని వ్యాసములు నాలుగువిధములు.

i కథనము (Narration): ఏదియో యొకవిషయమునుగూర్చి చెప్పుట కథనము. 'ఒకకథనో, చారిత్రకవిషయమునో, తటస్థాంశమునో, యుపాఖ్యానమునో, యొకమనుజుని జీవితమునో, మఱియిట్టి యేవిషయమునో' గూర్చి వ్రాసిన నది కథన మనఁబడును. ఆషాఢభూతికథ, బొబ్బిలికోటముట్టడి, కర్ణుని మరణము, సావిత్ర్యుపాఖ్యానము, కృష్ణరాయని జీవితము మొదలైనవానినిగూర్చి వ్రాసిన వ్యాసములను కథనము (Narrative Essays) లందురు.

ii వర్ణన (Description): ఒకప్రదేశమునుగాని, యొకవస్తువునుగాని, వర్ణించుట వర్ణనమనఁబడును. జంతువులను, వృక్షములను, ప్రాసాదములను, బట్టణములను, ప్రకృతివైచిత్ర్యములను, సృష్టివైచిత్ర్యములను, మానవులవృత్తులను, మానవులుచేయు నిర్మాణములను(Inventions) వర్ణించుచు వ్రాసినవ్యాసములనువర్ణనములందురు. సింహము, మఱ్ఱిచెట్టు,

భవనములు, కాశీపట్టణము, అగ్నిపర్వతములు, తోఁకచుక్కలు, పిల్లలకుఁ బాలిచ్చుపక్షులు, గ్రుడ్లను బెట్టు జంతువులు, పుష్పములు వాని యుపయోగములు, కాగితములు చేయుట, విమానములు మున్నగు వానిని గూర్చిన వ్యాసములను వర్ణనములు (Descriptive Essays) అందురు.

iii వివరణము (Exposition): ఒకవిషయమునుగూర్చి వివరించుటో లేక విచారణసల్పుటో యన్నది వివరణము. సంఘములను, శిశులను, సమితులను, రాజకీయ విధానాది నిర్వాహకసమితులను, శాస్త్రములకు సంబంధించిన విషయములను, సారస్వతమునకు సంబంధించిన విషయములను గూర్చి వ్రాసినవ్యాసములను వివరణము లందురు. తూర్పుఇండియా వర్తకసంఘము, సంస్కృతభాషా సేవకసమితి, శాసన నిర్మాణసంఘములు, శిల్పము, మానవోత్పత్తిక్రమము, యంత్రములు వాని వ్యాపారక్రమములు, విద్యుచ్ఛక్తి దానిప్రయోజనములు, కవిత్వము, నవలలు, భాషాభివృద్ధి, శబ్దతత్వము మొదలగువానిని గూర్చి వ్రాసినవ్యాసములను వివరణము లందురు.

iv తర్కము (Reflective Essay): ఏదియో యొక విభావనాంశమునుగూర్చి మనకుఁగల యభిప్రాయములను జర్చాపూర్వకంబుగ వ్రాసిన వ్యాసములను దర్కము లందురు. మనకుఁగల యలవాటులు, నైసర్గికగుణములు, మనసాంఘిక, రాజకీయ, సాంసారిక విషయాదర్శములు మొదలగువానిని గూర్చి వ్రాసిన వ్యాసములను దర్కము లందురు. సత్యము, ధైర్యము, మైత్రి, దాతృత్వము, పొదుపు, పిఱికితనము, ఉల్లాసము, ఉద్యోగము, ధనవత్త్వము, మతము, గృహాజీవనము, స్వాతంత్ర్యము, విద్య, మైత్రి, సౌజన్యము, కృతజ్ఞత, ఆచారములు మొదలగువానినిగూర్చి వ్రాసిన వ్యాసములను దర్కములు (Reflective Essays) అందురు.

2. మనము వ్యాసరచనమునకుఁ గడఁగుటకుఁ బూర్వము మనము వ్రాయఁదలఁచిన విషయమునుగూర్చి బాగుగా నాలోచింప

వలయును. ఈవిషయ విచారణము 1 సమాహరణము (=Collection of materials) 2. ఉద్ధరణము (= Selection of materials) 3. సంవిధానము (=Arrangement of materials ) 4. ప్రకటనము (=Expression) నను నాలుగు దశలు గలిగియుండును. మనము వ్రాయఁబూనిన విషయమునుగూర్చి మనకుఁదెలిసిన విషయముల నన్నిటిని నొక్కటిగాఁ బోగుచేసికొనుట సమాహరణము. ఇట్లు సేకరించిన విషయజాలములోని యంశములను వానివాని ప్రాముఖ్యములను బట్టియుఁ బ్రకృతోపయోగమును బట్టియు, వివేచనాపూర్వకంబుగ నేర్చి కూర్చుట యుద్ధరణము. ఇట్లుద్ధృతంబులైన యంశముల నేక్రమంబునఁ బ్రకటించినచో మన రచనమునకుఁ బ్రాశస్త్య మొదఁగూడునో యాక్రమములో నీయంశములను సంతరించికొనుట సంవిధానము. ఈయంశములను క్రమముగాఁ దేటతెల్లమగు మాటలతో వ్రాసి వెలయించుట ప్రకటనము. మనము వ్రాయఁబోవు విషయమునుగూర్చి బాగుగా నాలోచించుకొని, యేతీరున రచించిన నది బాగుగనుండునో యాక్రమమునే యనుసరించి దానిని బ్రకటింపవలయును. ఆలోచనాపూర్వకంబుగ విషయవిమర్శంబు గావించి వ్రాసినవారితలకే గణ్యత గలుగును; కావున బాలురు చక్కగా విషయవిమర్శనమును జేసికొని, తరువాతనే వ్యాసరచనమునకుఁ గడఁగుట కలవాటు పడవలయును.

3. వ్యాసములయందు సాధారణముగా i. ఉపక్రమము, ii. ప్రస్తావము, iii. ఉపసంహారము నను మూఁడు విభాగములు ప్రస్ఫుటముగాఁ గాన్పించుచుండును.

i ఉపక్రమము (Introduction). ఇది చాలచిన్న పరిమాణము గల ఘట్టముగా నుండును. ఇది వ్యాసమునందు దాఱవవంతుకంటెఁ దక్కువపరిమాణము గలదియైయుండును. శీర్షికయొక్క నిర్వచనమో, లేక వివరణమో; శీర్షికకు సంబంధించిన మహాకవుల యుద్ధృతవాక్యమో, లేక మనము వ్రాయఁబూనిన విషయమున కుద్బోధకముగా

నుండెడి యొకసూక్తియో, శీర్షికయొక్క కొలఁదులో లేక దానివలన బోధింపఁబడు నితరార్థములో, శీర్షికయొక్క భావమును బోధించు నొక చిన్నకథయో యీ యుపక్రమఘట్టంబున నుండును. వ్యాసకర్త తా వ్రాయఁబూనిన విషయముల నేదృష్టితో వ్రాయుచున్నాఁడో యను విషయము నీఘట్టము ప్రకటించుచుండవలయును. ఇంతియకాక, చదువరుల మనంబులం దెట్టిసంశయములును బొడముసుపక, వ్యాసకర్త యూహలను వారు సులభముగను, సునిశ్చితముగను, గ్రహించునట్టి స్థితిగతులునుగల్పించుటే యీయుపక్రమఘట్టముయొక్కముఖ్యోద్యమము.

ii. ప్రస్తావము (Body of the Essay.) వ్యాసముల ప్రస్తావము సాధారణముగా 1. ఏకత (Unity) 2. సంగతత్వము (Coherence) 3. అవధారణము (Emphasis) అను లక్షణములు గలిగియుండును.

ఒక్కొక్కవ్యాస మొక్కొకవిషయమునకు సంబంధించినదిగనే యుండవలయును. అప్రస్తుత విషయములకు వ్యాసమునఁ దావీయక పురస్కృతవిషయము నొక్కదానిని గూర్చిమాత్రమే మనము మన వ్యాసమున ముచ్చటింపవలయును. దీనినే వ్యాసముల యేకత యందురు.

మనము వ్రాయువిషయమునకు సంబంధించిన యంశముల నన్నిటిని నియతక్రమమునఁ బ్రకటింపవలయును. ఒక యంశమును దానియథాస్థానమున వెలయింపక వేఱొండుతావునఁ బ్రకటించితిమేని యది యాప్రకటితవిషయజాలముయొక్క సంగతత్వమునకు భంగమును గలిగించును. అయ్యా యంశములను సరియైన క్రమమునఁ బ్రకటించుటవలన రచనమునకు సంగతత్వమును, ధారాళతయుఁ, బ్రౌఢత్వమును గలుగును. కావున మనము వ్యాసమునందు వెలయింపఁబూనిన యంశముల నన్నిటినిఁ బ్రకృష్టమగు క్రమమునఁ బ్రకటింపవలయును. మనభావము లేతీరునఁ బెంపొందినవో తెలియుటకుఁ గాను మనము వ్రాయుచున్న యాయంశములకుఁ గల సంబంధములను, సంబంధ

బోధకపదంబులచే సూచింపవలయును. తదనంతరము, ఇట్లగుటంజేసి, కాఁబట్టి - మొదయిలనవి సంబంధబోధకపదములు.

ప్రకటితాంశముల క్రమవిన్యాసము, వ్యాసములోని ముఖ్యాంశముల కవధారణము నొసఁగుట, కుపకరించుచుండును. వ్యాసముల యవధారణీయస్థానములగు నాద్యంతములను బొంది ముఖ్యాంశములు గణ్యతకెక్కును. ప్రకటితాంశములను వానివాని ప్రాముఖ్యములను బట్టి వివిధపరిమాణములు గల వ్రాఁతలచేఁ బ్రకటింపవలయును. యథోచితపరిమాణములు గల రచనములవలన నవధారణము సరియైన వ్యాప్తిని జెందును. కనుక మనము ముఖ్యాంశములనుగూర్చి విస్తారముగను, సాధారణాంశములనుగూర్చి సామాన్యముగను, స్వల్పవిషయములనుగూర్చి స్వల్పముగను, వ్రాయుట యుత్తమము. అల్పవిషయములనుగూర్చి వ్రాసినను వ్రాయకున్నను దోషములేదు.

iii ఉపసంహారము:- (Conclusion) నైపుణ్యముతో వ్రాసిన యుపసంహారఘట్టము వ్యాసముయొక్క యుద్దేశాదులను హృదయంగమముగా నొనర్చుటకుఁ దోడ్పడుచుండును. వ్యాసమునందలి ముఖ్యాంశముల సంగ్రహమో, ప్రకటితాంశములవలన గ్రహింపఁబడు నీతియో, యుచితమగు నుద్ధృతవాక్యమో, వ్యాసకర్తయొక్క ముఖ్యోద్దేశబోధకమగు వింతవాక్యమో, యను వానిలో నేదియో యొకటి యుపసంహారఘట్టముగా నేర్పడుచుండును. వాచకుల మనంబులందు వ్యాసకర్తయొక్క యుద్దేశములను నాటుకొనునట్లొనర్చుట కీయుపసంహారవాక్యము లుపకరించుచుండును.

4. వాక్యనిర్మాణము (Structure of a sentence):— వ్యాసమునందుఁ గొన్నిఘట్టము లుండును. ప్రతిఘట్టమునందును గొన్నివాక్యము లుండును. ప్రతివాక్యమునందును గొన్ని పదము లుండును. పదముల సాధుత్వాసాధుత్వములనుగూర్చియు, వాక్యమునందలి పదములకుఁగల పరస్పరసంబంధములనుగూర్చియు నిదివఱకుఁ జదివి

యున్నారు. ఇక వాక్యములయు ఘట్టములయు నిర్మాణములను గూర్చి యొకకొంత యిటఁ బ్రకటించెద.

వ్యాసమునందలి వాక్యము లన్నియు నిర్దుష్టములుగా నుండ వలయును. వాక్యములందు వ్యాకరణదోషములు లేకున్నను నవి యొక్కొక్కప్పుడు దురవగ్రాహములుగను నిస్సారమైనవిగను నుండును. వాక్యములకు గ్రహణసౌలభ్యము సౌకుమార్యము మున్నగు గుణము లుండవలయును. వాక్యగతములయిన పదములకుఁ గలయన్వయము తేటతెల్లముగా నగపడుచుండవలయును.

విశేషణములను విశేషణములతోఁ దుల్యములగు పదసముదాయములను వానివాని విశేష్యములకుఁ బూర్వమునను, నవ్యయాదులను నవియన్వయించు క్రియలకుఁ బూర్వమునను బ్రయోగింపవలయును. ఆయాపదములకును వాని నాశ్రయించియుండు నితరపదములకును వ్యవధాన మంతగా నుండఁగూడదు. ఇవి పరస్పరము సన్నికృష్టములు గనే(=చేరువవిగనే) యుండవలయును. దీనినే సన్నికర్షణసూత్ర (Rule of Proximity) మందురు. ఉ॥ "గర్జించె నడవిలో సింహము భీకరమైన బిగ్గరగా" ననుటకంటె "భీకరమైన సింహ మడవిలో బిగ్గరగా గర్జించె" ననుటయే యుక్తము.

ఆర్జవము (Simplicity): వాక్యములు చిన్నవిగా నున్నపుడే వానియందలి యభిప్రాయములు తేటతెల్లముగ గోచరించుచుండును. కావున బాలురు చిన్నవాక్యములను వ్రాయుటకే యలవాటుపడవలయును. చిన్నవాక్యములు ప్రకటితవిషయములకు శీఘ్రగమనమును గల్పించి వ్రాఁతను సజీవమయినదానినిగాఁగూడ నొనర్చుచుండును. వాక్యములను దీర్ఘములుగాఁ బెంచి వ్రాసి, వానియందలి యభిప్రాయములను దురవగాహములుగా నొనర్పరాదు. ఒక్కభావమును, దానికి సంబంధించిన వివిధవిషయములను, నొక్కసారి చెప్పుటకు దీర్ఘవాక్యము లుపయోగపడును. ఒకభావమును, దానికి సంబంధించినవిషయములను,

వివిధవాక్యములలో వ్రాసి ప్రకటించుటకూడ నంత సమంజసము కాదు. కాని దీర్ఘములగు వాక్యములను మిక్కుటముగా వ్రాయరాదు. అనవసరమయిన క్లిష్టభాగములు వాక్యములందున్నచో, నవి చదువరులమనంబుల కనవసరమైన శ్రమను గల్పించును. దీర్ఘవాక్యముల యంత్యభాగములను జదువునపుడు వాని మొదళ్ళయందున్న విషయములను జదువరులు మఱచుటకూడఁ దటస్థించుచుండును. కావున బాలు రిరువది లేక ముప్పదికంటెఁ నెక్కువమాటలు గలవాక్యములను వ్రాయరాదు. విషయములను చిన్నవాక్యములందుఁ బొందుపఱచి, దాని వివరణాదులను గొలఁది పెద్దవాక్యములతో వెలయింతురు. చిన్నవాక్యములయుఁ బెద్దవాక్యములయు మేళగింపే వ్యాసములకు సౌకుమార్యము నొడఁగూర్చును.

చలితాచలితవాక్యములు - (Periodic and loose sentences): వాక్యములు చదువరులమనంబుల కుల్లాసమును గల్పించునవిగా నుండవలయును. చలితవాక్యములు చదువరులమనంబులకు శ్రమను గల్గించును. అచలితవాక్యములు చదువరులమనంబుల కుల్లాసమును గలిగించును. చలితాచలితవాక్యముల నిర్మాణముయొక్క పరిజ్ఞానము పటుత్వము గలవాక్యములను రచించుటకుఁ దోడ్పడును.

వాక్యమును జివరవఱకుఁ జదివినఁగాని దానియందలి భావము వ్యక్తముగానిచో నది యచలితవాక్య మనఁబడును. వాక్యాన్వయము దాని కడపటిపదముతోనే ముగించుచున్నచో నది యచలితవాక్యమగునని దీనివలన వ్యక్తమగుచున్నది. వాక్యమునం దొకటిరెండు తావులం దర్థము పూర్తియై విఱుగుచున్నచో దానిని జలితవాక్యమందురు. అన్వయము పూర్తియగుతావు లొకటిరెండు గలది చలితవాక్యమని దీనివలనఁ దెలియుచున్నది. ఉ॥ 'యథేచ్ఛగాఁ దిరుగుట కలవాటుపడినాఁడు, ప్రయోజకత్వము సంపాదించుయత్నము నెన్నఁడు చేయలేదు.' — ఇయ్యది చలితవాక్యము. ప్రయోజకత్వమును

సంపాదించుట కెన్నడును యత్నమొనరింపనొల్లని యాతఁడు యథేచ్ఛముగాఁ దిరుగుట కలవాటుపడినాఁడు." ఇది యచలితవాక్యము. అచలిత వాక్యములు తాము ప్రకటించు విషయములపట్ల చదువరుల కాసక్తిని, అనురాగమును బెంపొందించుచుండును. అచలితవాక్యములు చిన్నవయినను బెద్దవయినను సరే వాని కీగుణములుగూడనుండును. ప్రసాదగుణ రహితంబులును, గూఢంబులును, నాడంబరయుతంబులును నగుదీర్ఘములయిన చలితాచలితవాక్యంబు లంత సమంజసంబులుకావు. నిరాడంబరములగు చలితవాక్యములు కథనములయందించుక సమంజసముగా నుండును. వీనియందు భావములు సరళగతి కలవియై యొప్పుచుండును. ప్రధానవిషయములను ముందు చెప్పి వాని వివరణాదులను దరువాత వెలయించుటకుఁ జలితవాక్యము లనువైనవిగా నుండును. రచనమునకుఁదీక్ష్ణత నాపాదింపవలయునన్న, దానియందుఁ జాలయు చలితవాక్యము లుండవలయును. చలితాచలితవాక్యముల మేళగింపే మిక్కిలి సమంజసముగా నుండును.

సారూప్యము - ( Parallel structure or Balance ) : ఒకేరీతిగా వ్రాసిన వాక్యములను సారూప్య వాక్యము లందురు. ఒకేరీతి భావముల నొకేరీతివాక్యములచేఁ బ్రకటించుటవలనఁ జదువరు లాభావములను సులభముగ గ్రహింపఁగలుగుదురు. సారూప్యవాక్యరచనము గ్రహణసౌలభ్యము నొడగూర్చుచుండును. ఉ॥"ఆడెడి బాలురు, పాడెడి బాలికలు. బాలు రాడుచున్నారు, బాలికలు పాడుచున్నారు." ఈ భావముల నిట్లుప్రకటించుటే సుకరముకాని, "ఆడెడిబాలురు, బాలికలు పాడుచున్నారు" అని వ్రాయుట యంత సమంజసముగా నుండదు. అవయవసారూప్యముగల వాక్యము లందలి యొక్కొకభాగము రెండవభాగముతోఁ దులతూఁగుచుండును. రచనమునకు గ్రహణసౌలభ్యమును, బొంకపుగమనమును,సవధారణమును గల్పించుటకు సారూప్యవాక్యము లుపకరించుచుండును.

ఏకత: (Unity): ఒక్కొక్కభావము నొక్కొకవాక్యమునఁ బ్రక టింపవలయును. ఇదియే యేకత్వసూత్రము. మనము వెలయింపఁబూనిన విషయమునకు సంబంధింపనియంశ మెద్దియునుగూడ, దానిని బ్రకటిం చువాక్యమునం దుండఁగూడదు. ఒకవాక్యమునందు రెండుభావము లున్నచో దానియేకత్వము చెడును. ఉ॥ రెండునెలలక్రిందటఁ బునా దులు వేయించితిని, దీనిని గట్టుట కిప్పటికి మూఁడువే లయినది. ఈ వాక్యమునందు రెండుభావము లున్నవి. కావున వీనినొక్క వాక్యమున వ్రాయరాదు. దీనిని, "పునాదులు వేసి రెండునెల లయినది. ఇప్పటికి దీనిక్రింద మూఁడు వేలు ఖర్చయినవి" యను రెండుభిన్నవాక్యములు గనో, లేక, "పునాదులు వేయించి రెండునెలలే యైనప్పటికిని దీని క్రింద మూఁడువే లయినవి" యనియో వ్రాయఁ గొప్పును. వాక్యము నందలి భావ మొక్కటే యున్నను నావాక్యమున కేకత్వము లేనిచో నందలి భావములు భిన్నభావములట్లు పొడగట్టుచుండును. అన్వయ క్లిష్టతవలనను, నన్వయమునందు మార్పులు గల్పించుచుండుటవలనను వాక్యముల యేకత్వమునకు భంగము గలుగుచుండును. ఉ॥ "ఎట్లయిన ను, గర్ణునికీవంచన గౌరవభంగమును జేయునదిగాక, యాతఁ డాసమ యమునకుఁ దగిన ఘనకార్యమునే చేసియున్నాఁడు. కావున వాని కృత్యమును వానిమిత్రులు గ్రహించినను వానిదానమును బ్రపంచమునం దందఱును గీర్తించిరి." ఈవాక్యము నీదిగువరీతిని వ్రాయుట యుక్త మగును. "కర్ణుని కీవంచన యెంతమాత్రము గౌరవహానిని జేయునది కాదు. ఆతఁ డాసమయమున కుచితమయిన ఘనకార్యమునే చేసినాఁడు. వానికృత్యమును వాని మిత్రాదులు గ్రహించినను దక్కినవారందఱును గీర్తించిరి."

అవధారణము (Emphasis): ముఖ్యవిషయములను వాక్య ములయొక్క ప్రాముఖ్యస్థానము లయినయాద్యంతములందు నెలకొల్ప వలయును.

సంగతత్వము (Coherence) : వాక్యములయందలి పదములకుఁ గలపరస్పరసంబంధము ప్రస్ఫుటముగను దేటతెల్లముగను నుండవలయును. వాక్యభాగము లన్నియుఁ గ్రమవిన్యాసము గలిగి యుండవలయును. ఆయా వాక్యభాగములను బదములను యథాస్థానములందుఁ బొందుపఱుపక వ్యత్యస్తముగాఁ బ్రయోగించుటవలన వ్రాఁత లసంగతములుగా నుండును.

వాక్యములకు (1) ఆసత్తి (2) యోగ్యత (3) ఆకాంక్ష (4) తాత్పర్యము నను నాల్గుగుణము లుండవలయునని మనవారి యాశయము. (1) ఆసత్తి: పరస్పరసంబంధము గలపదములమధ్య నితర పదంబు లుండఁగూడదని దీనిభావము. దీనినే పైన సన్నికర్షణసూత్రమని (Rule of Proximity) చెప్పియుంటిని.

2. వాక్యమునందలి పరస్పరసంబంధముగలపదములు విరుద్ధార్థములను గలిగియుండఁగూడదు. ఇట్లుండినచో వాక్యమునందలిపదములకు సంగతత్వ ముండదు. ఉ॥ వాఁడు రతీదేవివలె సుందరముగా నున్నాఁడు - వాఁడు నీళ్లతో నిండ్లు కాల్చెను - వాఁడగ్నితో నీళ్లను జల్లార్చెను - అనినరీతిని వాక్యములను వ్రాయఁగూడదని దీనిభావము.

3. అన్వయమునొక్కొక పదము వేఱొకపదమును గాంక్షించుట యాకాంక్ష యనఁబడును.

4. ఆయా వాక్యములందలి భావాదులకుఁగల సందర్భములను సూచించుటకు యథోచితములయిన సందర్భవాచక పదములను బ్రయోగించుట యాకాంక్ష యనంబడును.

ఎన్ని చెప్పినను వాక్యములు, తమయందలిభావములను జక్కఁగాఁ బ్రకటించుచుఁ జదువరులమనంబులను రంజించునవిగా నుండవలయును. బాలురు వాక్యములను జేతికి వచ్చినట్లు వ్రాయక, యాలోచించి బాగుగ వ్రాయుట కలవాటుపడవలయును.

5. ఘట్టనిర్మాణము ( Paragraph Structure ) :- ఒక్క ప్రధానవిషయమును సక్రమముగఁ బోదిచేయుచుఁ బ్రకటించువాక్య

సముదాయమును ఘట్టమందురు. వాక్యములకువలెనే ఘట్టములకుఁ గూడ - 1. ఏకత 2. అవధారణము 3. సంగతత్వము ననుమూఁడు గుణము లుండును. ఘట్టమునందలి ప్రధానవిషయమును వివరించుచు దానిని జక్కఁగా వెలయించునట్టి పదములుగల వాక్యములనే యాఘట్టమునందుఁ బ్రయోగింపవలయునని యేకత్వసూత్రము చెప్పుచున్నది. ముఖ్యాంశముల నుత్కృష్టములైన స్థానములందుఁ బొందుపఱుపవలయునని యవధారణమాత్రము బోధించుచున్నది. ఆయావాక్యములందలి భావములకుఁ గలపరస్పరసంబంధము సువ్యక్తమౌచుండునట్లు శబ్దములను బ్రయోగించి వాక్యములను రచించుచు ఘట్టనిర్మాణము నకుఁ గడంగవలయునని సంగతత్వసూత్రము వ్రాయుచ్చుచున్నది. ఒక్కొక ఘట్టమున నొక్కొకవిషయమునుగూర్చి మాత్రమే వ్రాయవలయుననియు నావిషయము ప్రస్ఫుటముగాఁ జదువరులకు గోచరించుచుండవలయుననియు, నావిషయమునకు సంబంధించిన యంశముల నన్నిటిని జక్కఁగా సంతరించుకొని వానికిఁ గల సంబంధములను సూచించుచు వాక్యరచనము గావింపవలయునని దీనిభావము.

ఏకత్వము (Unity) : ఒక్కొకఘట్ట మొక్కొకవిషయమును మాత్రమే ప్రకటించుచుండవలయునని యేకత్వ సూత్రముయొక్క యభిప్రాయము. ఘట్టమునందలి విషయము నొక్కవాక్యముచేఁ బ్రకటింప నర్హమయినదిగా నుండవలయును. ఇట్లున్నప్పుడే యాఘట్టమున కేకత్వగుణ మున్నదని వ్యక్తమగును.

అవధారణము (Emphasis) : ఘట్టమునందలి ముఖ్యభావమును బ్రకటించువాక్యము దానియందుఁ బ్రాముఖ్యముగాఁ గాన్పించుచుండవలయును. ప్రధానవిషయము ప్రాముఖ్యముగాఁ గనపడుచుండునట్లు గనే ఘట్టమునందలి వాక్యములను సంతరించుకొని వ్రాయుచుండవలయును.

ఘట్టమున వెలయింపఁదలఁచిన ప్రధానాంశమును మున్ముందు గనే ప్రకటించి దానికిఁ బ్రాముఖ్యము నాపాదింపవలయును. దీనిని

బ్రస్తావవాక్య మందురు. ప్రస్తావవాక్యము ఘట్టముయొక్క మొదట నుండుటవలనఁ గొంతగుణ మున్నది. ఇట్లున్నచో ఘట్టములో నుండు విషయమును జదువరులు తొలుదొల్తనే గ్రహించి దానిని దృష్టియం దుంచుకొనియే, యాఘట్టమును జదివి యందలి విషయములను గ్రహింతురు. ఇట్లు వ్రాయుటవలన వ్యాసమునందలి విషయముల నన్నిటిని నందలిఘట్టముల తొలివాక్యములను జదివి గ్రహించుటకుఁ దోడ్పడు చుండును.

కొన్ని యెడల ఘట్టమునందలి ముఖ్యాంశమును దాని చివర వాక్యమునఁ బొందుపఱతురు. ఇట్టి వాక్యమును సారాంశవాక్య మందురు. సారాంశవాక్యము, ప్రస్తావవాక్యమంత ప్రశస్తమైనదే. ఇయ్యది చదువరు లాఘట్టమునఁ జదివినదాని సారాంశమును హృదయంబు లందు నాటుచుఁ, దరువాతి ఘట్టమునందలి విషయమునకును నీఘట్టమునందలి విషయమునకును గలసంబంధము సువ్యక్తముగా నొనర్చు చుండును.

ఘట్టమునందలి ప్రధానవిషయమునకు సంబంధించిన వివిధాంశములకుఁ గలప్రాశస్త్యములను గుర్తించి, వానిని దగురీతిని బ్రకటింపవలయును. ఇట్లొనరించుటవలనఁ బ్రధానాంశము యథోచితముగఁ బ్రకట మగుచుండును. ఆయాయంశములను జక్కఁగఁబొందించేయుచు, నొకదానితరువాత నొక దానిని సక్రమంబుగ వెలయించుచుఁబోయిన యెడల మనము చక్కనిఘట్టమును వ్రాసినవార మగుదుము.

సంగతత్వము (Coherence) : ఘట్టమునందలి భావములకుఁ గ్రమమయినసంబంధ ముండవలయునని యీసంగతత్వసూత్రముయొక్క యాశయము. ఇట్లున్నచో దానియందలిభావములను జదువరులు సుఖముగా గ్రహించుచుందురు. ఇంతియెకాక వ్యాసకర్త తన యభిప్రాయములను నేతీరునఁ బెంపొందించుచున్నాఁడో వ్యక్తమగుచుండును. ఘట్టమునందలి ప్రధానాంశమును గ్రమముగాఁ బెంపొందించుచు

రచనమును గావించుచుండవలయును. మొదటివాక్యమునందుఁ బ్రకటించిన భావము నభివృద్ధిచేయుచు మనసంపూర్ణాభిప్రాయము నేది వెల్లడించునో దానినే రెండవవాక్యమునఁ బ్రకటింపవలయును. ఒక యభిప్రాయమునుండి దానితరువాతి యభిప్రాయము చిగుర్చుచున్నదా యనునట్లు తోఁచురీతిని మనయభిప్రాయములను సంతరించికొని యాక్రమముననే వానిని బ్రకటింపవలయును. ఘట్టమునందలి వివిధ వాక్యములకును, వాక్యభాగములకును గలసంబంధములను సూచించు పదములను బ్రయోగించుచు రచనమును గావించుట సుకరము. దీని వలన నాయావాక్యములకుఁ గల సంబంధము ప్రస్ఫుటముగా నగపడు చుండును. ఇంతియకాక వ్రాఁతకు సారళ్యమునుగూడ నొడగూర్చు చుండును.

శైలి (style) : సరళమయిన శైలిలో వ్యాసములను వ్రాయ వలయును. వ్యాస మాద్యంతమొక్కతీరున నుండవలయును. వ్యాసము నందలిపదములు సువరిగాహములు లైనవిగ నుండరాదు. ఆడంబరమున కైనవ్రాఁతలు వ్రాయుటయుఁ దగదు. విద్యార్థులు చిన్నయసూరి గారి మిత్రలాభము శైలి నాదర్శకముగాఁ జేసికొని దాని ననుకరించుట యుత్తమము.

## Exercise.

ఈదిగువవానినిగూర్చి సలక్షణముగా రెండుపుటలకుఁ దక్కువ కాని వ్యాసము వ్రాయుఁడు:—

1944 (a) ఐకమత్యము, అఖిలార్థసాధకము. (b) శరీరబలముకంటె బుద్ధి బలము గొప్పది. (c) విద్యలేనివాఁడు వింతపశువు. (d) అవిమృశ్యకారిత అనర్థావహము. 1945. (a) స్త్రీలకు దాయభాగ మొసంగుట సంఘమునకు మేలు. (b) సంఘైక్యము సర్వార్థసాధకము. 1946. (a) ఆటలు రోగములను వారించును. (b) ఉత్తమ పురుషుల జీవితము జగత్కల్యాణ సంధాయకము. (c) పిఱికితనము సర్వాపత్కారణ మైనట్లు ధైర్యము సర్వసంపదలకును నిదానము.

## 18. శ్రాంతచిహ్నప్రకరణము (Punctuation)

1. గద్యములయందలి యేయేపదసమూహముల నొక్కటిగాఁ జదువవలెనో, యేయేపదసముదాయములను జదివినపిమ్మట నెంతెంత కాల మాగిన బాగుగా నుండునో యనువిషయములను శ్రాంతచిహ్నములు ప్రకటించుచుండును. శ్రాంతచిహ్నములు లేనిగద్యములను జదివి గ్రంథకర్తయొక్క యుద్దేశమును గ్రహించుట సులభసాధ్యమయిన పనిమాత్రము కాదు. పదములను మనయిచ్చవచ్చినట్లు కలిపి చదువుట వలనఁ గ్రొత్తక్రొత్త యర్థములు స్ఫురించుచుండును. "ఓయీ, రామా, రామను గావుము. ఓయీ, రా, మారామను గావుము. ఓ యీరామా! రామను గావుము." ఈమూఁడు వాక్యములలోని యక్షరములును నొక్కటే, కాని వానియందలి భిన్నస్థలములందు భిన్నములయిన శ్రాంతచిహ్నములను నెలకొల్పుటచే మూఁడు ప్రత్యేకార్థములు స్ఫురించుచున్నవి. కావున రచయితయొక్క యుద్దేశ మిది యని నిర్దేశించుటకు శ్రాంతచిహ్నముల తోడ్పాటవసరము. కావున శ్రాంతచిహ్నముల యుపయోగములనుగూర్చి మన మీప్రకరణమునందు నేర్చికొందము.

2. గ్రంథములందు సాధారణముగా నీదిగువశ్రాంతచిహ్నముల నుపయోగించుచున్నారు.

', '- ఇది ఖండము లేక కామా (Comma). '; '- ఇది బిందుయుతఖండము (Semicolon). ': '- ఇది ద్విబిందువు (Colon). '. '- ఇది బిందువు (Full Stop). '? '- ఇది ప్రశ్నార్థకచిహ్నము. '! '- ఇది భావచిహ్నము. " "- ఇది యుద్ధరణచిహ్నము. —— ఇది యడ్డగీఁత. ( ) - [ ] - ఇవి కుండలీకరణములు. ' * ' ఇది పుష్పా. ' † '- ఇది శూలము. ' § '- ఇద శృంఖలము.

3. **ఖండము లేక కామా :-** శ్రాంతచిహ్నము లన్నిటఁ దఱచుగ వాడఁబడునది ఖండమే. ఇది మిక్కిలి తక్కువకాలపు టాఁపుదలను ప్రకటించుచుండును.

i. ఏదేని గద్యమును జదువునప్పుడు, మనము విశ్రాంతికొఱ కేయేతావులందుఁ గొంచెమాగుచుందుమో, యయ్యాతావులందు ఖండము నుపయోగింతుము. ఉ॥ కృష్ణరాయఁడు, తనసైన్యములను గూర్చుకొని, యేకధాటిగఁ, గటకపురికిఁ గ్రక్కదలెను.

ii. క్త్వార్థకాన్వయములు చివరలయందుఁ గలవాక్యభాగముల పరంపర యుండెనేని యాక్త్వార్థకాన్వయముల యన్నిటితరువాతను నీ ఖండము నుపయోగింతురు. ఉ॥ ఆంజనేయుఁడు లంకకుఁ బోయి, సీతను జూచి, యామెకు ముద్రిక నిచ్చెను.

iii. కాని - యను పదముచే వేఱుచేయఁబడు వాక్యముల చివరలం దీఖండము నుపయోగింతుము. ఉ॥ అందఱును జనకాలము బ్రతుక నిచ్ఛయింతురు, కాని ముదిమిని రోయుదురు.

కాని - యను పదము భావార్థకములతోఁ గూడి యున్నప్పుడు ఖండము- కాని- యనుపదము తరువాతనే నెలకొల్పుదురు. ఉ॥ స్నానముచేయుటకాని, సంధ్యవార్చుకొనుటకాని, పెందలకడనే భోజనముచేసి చదువుకొనుటకాని, వాఁడెఱుఁగఁడు.

iv. సముచ్చయములు చివరలందుఁ గల శబ్దములను, వాక్యములను, ఖండములచే వేఱుచేయుదురు. ఉ॥ రాముఁడును, లక్ష్మణుఁడును, సీతయును, నరణ్యములకుఁ బోయిరి. ఆయాకృత్యములను సకాలంబునఁ దీర్చుటయుఁ, బాఠముల నెప్పటి కప్పుడు బాగుగాఁ జదువుట నియతకాలమునకు బడికిఁ బోవుటయు, విద్యార్థిధర్మములు.

. సమానధర్మములతోఁ గూడియుండు నుపమానవాచకముల పరంపరయుండెనేని యాయాపరంపరలోని ప్రతిదానిని ఖండముచే వేఱుచేయవలయును. ఉ॥ ప్రతాపంబున సూర్యుని, బరాక్రమంబునఁ బరశురాముని, దానమునఁ గర్ణుని, ధైర్యమున మేరువును, గాంభీర్యమున సముద్రమును, శాంతమున భూమిని, శౌచంబున నగ్నిని, వైభవంబున నింద్రుని, బుద్ధియందు బృహస్పతిని, నైశ్వర్యం

బున నీశ్వరుని, దయయందు మహావిష్ణువును బోలు మారాజు, "నావిష్ణుఃపృథివీపతి" యను వాక్యమును, దలపించుచున్నాఁడు.

vi. రెండేసి యొకేజాతిపదముల సముదాయములు పరంపరగా వచ్చినచో నాయా సముదాయములనన్నిటిని ఖండికములచే వేఱుచేయ నలయును. ఉ॥ ఇంట నున్నప్పుడైనను, బయట నున్నప్పుడైనను, రాత్రులందయినను, బవళ్ళయందయినను, నిద్రలోనైనను మేల్కొని యున్నప్పుడైనను, వానికి నాపేరు చెప్పిన భయము.

vii. సంబుద్ధివాచకంబులను ఖండికములచే వేఱుచేయుదురు. కొందఱు భావచిహ్నము నుపయోగింతురు.

ఉ॥ లక్ష్మణా, తాటకముక్కును, చెవులను గోయుము.

లక్ష్మణా! తాటకముక్కును, చెవులను గోయుము.

viii. వాక్యముతో నెట్టిసంబంధమును లేనిపదములను, పద సముదాయములను ఖండికములచే వేఱుచేయుదురు. ఉ॥ మొత్తము మీఁద, వాని కవిత్వము రసవంతముగా నుండును. వీనియన్నిటికి నేమికాని, మనలోనిమాట, నిజముగా నేమి జరిగినది?

ix. అన్యుల యవివేకమును బరిగణనము చేయునపుడు ప్రయుక్తము లగు ద్వంద్వవాక్యములను ఖండికములచే వేఱుచేయుదురు. ఉ॥ వాఁడు తెలిసినవాఁడును గాఁడు, తెలియని వాఁడును గాఁడు. వాఁ డశుభమును నెఱుఁగఁడు, శుభమును నెఱుఁగఁడు.

x. ఒకవాక్యమును, దాని వివరణవాక్యములను, ఖండికములచే వేఱుచేయుదురు. ఉ॥ వానికి నూఱెకరముల భూమి కలదు, అఱువది యెకరములు పల్లము, నలుబది యెకరములు మెట్ట.

xi. ఒక వస్తువుమీఁద మనకుఁగల ప్రేమానుబంధములను సూచించుట, కద్దానినామమును రెండు మూఁడుమాఱులు వ్రాసి పరికరింతుము. ఇట్టివాని నెల్ల ఖండికములచే వేఱుచేయుదుము.

ఉ॥ వాణి, సకలవిద్యల కధిదేవత యగునాయజురాణి, సుకవీం ద్రుల తలవాకిటం గాంపురం ముంపుస్తకపాణి, నాహృత్కమలపీఠమున సదా నెలకొనియుండుంగాత.

4. బిందుయుతఖండము (Semi colon): ఖండముచేం బ్రికటితమగు నాపుదలకంటె నెక్కువ యాపుదల యవసరమయినపుడు బిందుయుతఖండము నుపయోగింతురు.

i. ఒకేవిషయమునకు సంబంధించిన భిన్నవాక్యముల పరంపర యున్నచో, నాయావాక్యముల చివరలందు బిందుయుత ఖండము నుపయోగింతురు. ఉ॥ ఏకలవ్యుండు విలువిద్య నేర్చుకొనుదీక్షను బూనెను; ద్రోణుం డాతనిని శిష్యునిగా గ్రహింపలేదు; ద్రోణుని చిత్తరువు నెదుట నిడుకొని, దానియెడ గురుభావంబు నూని పూజించుచు, ధనుర్విద్యాపారంగతుం డయ్యెను. ఇందలి వాక్యము లన్నియు నేకలవ్యుని విద్యాభ్యాసవిషయమునుగూర్చియే చెప్పుచున్నవి.

ii. మఱియొక వాక్యముతో నొకేరీతి సంబంధముగల వాక్యపరంపరలోని వాక్యముల నన్నిటిని బిందుయుతఖండముచే వేఱుచేయుదురు. ఉ॥ ఏమహామహుం డీప్రపంచములను సృజించుచున్నాండో; యేమహాత్ముం డీప్రపంచములనుగాచి, యందలి జీవకోటులను రక్షించుచున్నాండో; యట్టి భగవంతునికి జోహారు వానర్చెద. గోపాలుండే తానాడినమాటను దప్పంజూచినట్లయితే; ధనము నపహరించు సంకల్పముతోనే యున్నట్లైతే; దొంగగమునకుం బాల్పడంజూచుచున్నట్లైతే; యిఁకం బ్రపంచములో మంచికి నిలువ నీడయే యుండదు.

iii. "లేనిచో - కాంబట్టి -" యను నర్థములు గల శబ్దములచే వేఱుచేయంబడు వాక్యముల చివరలందు బిందుయుతఖండము నుపయోగింతురు. ఉ॥ నేను జట్కామీఁద వచ్చితిని; లేనిచో నింతత్వరగా నిచ్చటికి రాలేకపోదును. ఈత్రిభుజముయొక్క రెండుభుజములుసమాన

ముగా నున్నవి; కాఁబట్టి వీని కెదురుగా నుండుకోణములు సమాన ముగా నుండును.

iv. దీర్ఘములగు నుపవాక్యముల చివరలందు బిందుయుతఖండము నుపయోగింతురు. ఉ॥ కర్ణునికి నాయందుఁ బ్రేమ సమగ్రము, కావున నేనాతనికొఱకు విచారించితిని; వాఁడదృష్టవంతుఁడు, కావున వాని యదృష్టమునకు సంతసించితిని; వాఁడు పరాక్రమశాలి, కావున వాని పరాక్రమమునకు మెచ్చితిని; నాయందు వాని కీసు కలదు, కావున నే నాతనిని జక్కాడితిని.

5. ద్విబిందువు (Colon): బిందుయుతఖండముచేఁ బ్రకటితమగు విరతికంటె నెక్కువవిరతి కావలెనని రచయితలకుఁ దోఁచినప్పుడాయా తావులందు ద్విబిందువు నుపయోగింతురు. ఉ॥ ఇఁక నేనియు నా దేశపుఁ బ్రజల నొక్కటిగాఁ జేసియుండెడివాఁడను: ఇఁక నేనియు నా దేశపు వాణిజ్యము నంతగా ధ్వంసము చేసియుండెడివాఁడ కాదు.

i. పూర్వమునందుఁ జెప్పఁబడిన విషయమును ధ్రువపఱచునట్టి కాని, వేఱొండు నిరూపణవాక్యమునుగాని ద్విబిందువుచే వేఱుచేయుదురు. ఉ॥ నీ వెట్టి వ్యాపారమును జేసి జీవించుచున్నను సరేనియారోగ్యమును గాపాడుకొనవలయును: అనారోగ్యపు జీవితము నిరర్థకంబని యెఱుంగవే? నాకు భారతమనినఁ జాలనిష్టము: అందును నన్నయ భట్టుగారి భాగమన్న నెక్కుడుప్రీతి.

ii. ఒకసూత్రమున కుదాహరణముల నిచ్చుచు-ఉ-కారమునకు వ్రాయనియప్పు డీద్విబిందువు నుపయోగింతురు. ఉ॥ " దక్కు " లోలగువాని దాకు డకారంబు విభాషనగు: డక్కు - డగ్గరు - డాఁగు - డిగ్గు.

6. బిందువు (Full Stop): విశ్రాంతచిహ్నము లన్నిట నెక్కుడు విశ్రాంతిని బ్రకటించునది బిందువు. వాక్యముచేఁ బ్రకటమగు భావము పూర్తియైనదని యీచిహ్నము ప్రకటించుచుండును.

i. ప్రతిసంపూర్ణ వాక్యముచివరను బిందువును నెలకొల్పుదురు.
ఉ॥ రాముఁడు పరాక్రమశాలి. అతఁడు రావణుని సంహరించెను.

ii. పదములకు బదులుగా వాడఁబడెడి సంకేతాక్షరముల తరువాత బిందువు నుపయోగింతురు. ఉ॥మ. రా. రా. (=మహారాజరాజశ్రీ) శా. సం. (=శాలివాహనసంవత్సరము) క్రీ. పూ. (=క్రీస్తుపూర్వము) క్రీ. శ. (క్రీస్తుశకము).

7. ప్రశ్నార్థకచిహ్నము (Note of Interrogation) : (i) దీనిని ప్రశ్నవాక్యములచివరలం దుపయోగింతురు. ఉ॥ పాఠములను జదివితివా? పరీక్షలోఁ గృతార్థుఁడ వయితివా? పైకిఁ జదివెదవా?

ii. ప్రశ్నవాక్యముల పరంపరయుండెనేని వానిలోఁ గడపటిదాని చివరమాత్రమే ప్రశ్నార్థక చిహ్నము నుపయోగింతురు ; తక్కినవాని చివరలందు ఖండమునేని బిందుయుతఖండమునేని యుపయోగింతురు. ఉ॥ నీవు బడికిఁబోయెదవా, పోవా? భోజనము చేసెదవా; బండిని దీసికొని వచ్చెదవా?

8. భావచిహ్నము (Note of Exclamation) : ఆశ్చర్యార్థకముల తరువాతను, ప్రశంసనార్థకముల తరువాతను, సంతాపార్థకముల తరువాతను, సంప్రార్థనముల తరువాతను, నావేశముతోఁ బల్కెడి శబ్దములయు వాక్యములయుఁ దరువాతను, నుత్తరములు లేని ప్రశ్నముల తరువాతను, భావచిహ్నము నుపయోగింతురు. ఉ॥ ఆహా! ఏమి యీవింత! బళీ! ఏమిపాటకుఁడు!- అయ్యో! యెంతటిపాపమును జేసితినోగదా !-హా! దైవమా! యెందున్నావు. "కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!"- ఏమిటీ! నటికిపై చెదను జాగ్రత్త!- "భూసురాన్వయం బెక్కడ! యీతనూవిభవ మెక్కడ!".

9. ఉద్ధరణచిహ్నము (Inverted commas or Quotation Marks): i. ఒకఁడు పలికినపలుకులనట్లేవ్రాసి ప్రకటించినపు డామాటల యాద్యంతములయం దుద్ధరణచిహ్నముల నుపయోగింతురు. ఉ॥ కృష్ణుఁడర్జునునితో, "ఫల్గునా! శిఖండిని ముందిడుకొని భీష్ముని నేయు"మనెను.

ii. ఒకగ్రంథమునుండి యెత్తివ్రాసిన భాగముయొక్క యాద్యంతములం దీయుద్ధరణచిహ్నముల నుపయోగింతురు. ఉ॥ "పాపవ్యవసాయుల చెయ్వు లర్థనంతము లగునే?" యను నన్నయవాక్య మపార్థమగునా! "బుద్ధిజాడ్యజనితోన్మాద లగుదా శ్రోత్రియుల్" అని మను చరిత్ర ముద్ఘోషించుచున్నది.

iii. గ్రంథనామముల నుద్ధరణచిహ్నముల మధ్యనుంచి వెలయింతురు. ఉ॥ నేను "రసగంగాధరము" ను జదువుచున్నాను.

iv. ఉద్ధృతంబయిన వాక్యమునందలియుద్ధృత వాక్యము(=ఎత్తి వ్రాయఁబడిన వాక్యము) యొక్క యాద్యంతములయందొక్కొక్క యుద్ధరణచిహ్నముమాత్రము నెలకొల్పి వెలయింతురు. ఉ॥ దుర్యోధనుఁడు కర్ణునిఁ బిలిచి వానితో, "రాధేయా, మనయుధిష్ఠిరుఁడు ద్రుపదునిఁ బట్టితెచ్చినపుడు ద్రోణాచార్యులారాజేంద్రునితో, 'క॥ వీరెవ్వరయ్యా, ద్రుపదమహారాజులే! కృపణులై పట్టువడిన్ వీరికి వలసెనే! యహహా! మహారాజ్యమదాంధకార మది వాసెనొకో?' యనె.

10 అడ్డగీఁత (Dash): (i) వివిధభావములు కారణములుగాఁ గలయసంపూర్ణోక్తులతరువాత నడ్డగీఁత నుపయోగింతురు. ఉ॥ నగూధని తనచేడియలను "జల్లులాడుఁడు జల్లులాడుఁ" డని ప్రోత్సహించుచు, నలు కెలంకులు గలయఁజూచి యొక్కెడఁ బ్రవరుని గాంచి, "జల్లు—."

ii. విరహాదులవలనఁ గలుగుచిత్తచాంచల్యము కారణముగాఁ బల్కెడియసంబద్ధాలాపంబులకును, నప్పుడే యొడ లెఱింగిపల్కెడి వివరణవాక్యము (=హేతూపన్యాసము) లకును నడుమ నడ్డగీఁత నుపయోగింతురు. ఉ॥ ఓభూజములారా, నాప్రియునిజాడను దెలుపరే?— చెట్లు మాటాడవు.

11. కుండలీకరణములు : వాక్యమునందు గ్రహణసౌలభ్యముసకై యుపయోగించెడి పర్యాయపదములను గుండలీకరణములచే వేఱుచేయుదురు. ఉ॥ ఇంద్రతనయుఁడు (అర్జునుఁడు) ధనుష్టంకారము గావింపుడుఁ ద్రిలోకంబు లాకులంపడు.

12. హంసపాదము ∧: ఆయాతావులందు మఱచినయక్షరము లనుగాని, పదములనుగాని, పైన వ్రాసి ప్రకటించితిమని సూచించుటకై హంసపాదము నుపయోగింతురు.

13 పువ్వు *, శూలము †: వీని నేయేతావులందు నెలకొల్పుదురో యాయాతావులందుఁ బాఠకులు స్మరణమునకుఁ దెచ్చికోఁదగు విషయములనుగూర్చి యాపుటక్రిందిభాగమున ముద్రితములయిన "పదలక్షణము"(Foot note) లను జూడవలసినదని యివి ప్రకటించుచుండును.

14. శృంఖలము §: ఇది పై రెండింటివలెఁ బదలక్షణములను జూడుఁడని ప్రబోధించుచుండును. దీనిప్రక్క నేదేనియంకె యున్నచో నాగ్రంథమునందాయంకె గలపుట్టమును (పేరాను) జూచినచో నా విషయమునకుసంబంధించిన వాక్యములందుండునని ప్రకటించుచుండును.

## 19 సంగ్రహరచన (Precis writing)

1. ఒకరు వ్రాసినవిషయముయొక్క సారాంశమును సంగ్రహముగ వ్రాసి ప్రకటించుటను సంగ్రహరచన యందురు. ఏదో యొకరచనాభాగమునందున్న ముఖ్యవిషయములను సంగ్రహముగా వ్రాసి ప్రకటించు శక్తిబాలుర కలవడుచుట కేర్పడుపఁబడిన రచనావిధాన మిదియే. విషయసంగ్రహము దాని మాతృకకంటెఁ జాలఁజిన్నదిగా నుండవలయును. ఇది మాతృకలో మూఁడవవంతుకంటెఁ బెద్దదిగా నుండఁగూడదు. పరిసంపవ్యాసంగము సలిపినచో నీసంగ్రహములు మాతృకలో నైదవవంతుండునట్లు వ్రాయుకౌశలముకూడ బాలుర కలవడును. సంగ్రహమునందు మాతృకలోనిముఖ్యవిషయము లన్నియు నుండవలయును. మాతృకలోని యేముఖ్యవిషయమునుగాని, భావమునుగాని సంగ్రహములో విడిచిపెట్టఁగూడదు. సంగ్రహమునందు మాతృకలోని భావములను సొంతమాటలలో వ్రాసి ప్రకటింపవలయును. మాతృక

లోనిపదములను బదసముదాయములను గూడ సంగ్రహములందుఁ బ్రయోగింపవచ్చును. విషయమును దేటతెల్లముగా నొనర్చుటకు మాతృకలోని యంశముల క్రమమును మార్చినను మార్పవచ్చును. సంగ్రహము మాతృకలోని యన్నియంశములను బ్రకటించుటయేగాక దానియం దుత్తేజించుజీవకళలను, శక్తిసామర్థ్యములను సమగ్రముగఁ బ్రతిబింబించుచుండవలయును. కావుననే, విషయసంగ్రహములు సంక్షిప్తములుగను, సమగ్రములుగను, దేటతెల్లములుగను నుండి మాతృకకుఁ గలజీవకళల నుట్టిపడఁజేయుచు మాతృకలోనివిషయములను జదువరుల మనంబులందు చిరస్థాయిగ నెలకొనున ట్లొనర్చుచుండవలయును.

2. మన కిచ్చినమాతృకలోని ముఖ్యాంశ మేదియో దానిని నిర్ధారించుట యంతసులభమయినపని కాదు. అది బుద్ధికి తీవ్రమయిన ప్రయాసమును గల్పించును. అట్లు గావించుటలో మనము మనబుద్ధిని దీవ్రముగా విషయమునందు విమగ్నముగావించి, శ్రద్ధతో నామాతృకను జదువుచు, తీవ్రముగ నాలోచనలు సలుపుచు నేది ముఖ్యవిషయమో యేది కాదో యనువివేచనమును జేయవలయును. సాధారణముగా సంగ్రహరచనమును గావించువిధానము i చదువు. ii. సంతరింపు iii. రచనము ననుమూఁడు విభాగములుగ నేర్పడుచున్నది.

3. చదువు :—ఇచ్చినమాతృకను మొదటినుండి చివరవఱకును జాగరూకతతోఁ జదివి, యది యేముఖ్యవిషయమునుగూర్చి వ్రాసిన వ్రాఁతయో గ్రహింపుము. ఒకసారి చదువుటవలన విషయము గ్రాహ్యముకానియప్పుడు, మన కిచ్చినమాతృకను రెండుమూఁడు మారులు చదువవలయును. ఇచ్చినరచనాభాగము నెన్నిసారులు చదివిన నంత మంచిది. ఇట్లు చదివినకొలఁదిని మన కందలిముఖ్యవిషయమును, దానినిగూర్చి కర్త నెల్లడించిన యభిప్రాయములను స్పష్టముగాఁ దెలియవచ్చుచుండును. మనసంగ్రహమున కొకశీర్షికను నిర్ణయించికొను సామర్థ్యమును మన కిప్పటికేఁ గలుగును. మన కిచ్చినమాతృకయందలి

విషయమును బ్రకటించుసామర్థ్యము గలవాక్యమునో, సమాసమునో లేక పదమునో యొకదాని నాలోచించి దానిని శీర్షికగా నిడుము.

4. శీర్షికను నిర్ణయించికొనుసామర్థ్య మలవడునప్పటి కప్పుడే మన కిచ్చినమాతృకలోనిముఖ్యవిషయములయొక్క స్వరూపము మన మనంబులకు గోచరించుచుండును. మాతృకయందలి ముఖ్యవిషయములను, నందలియన్నియంశములను నీవు సరిగా గ్రహించితివో లేదో దృఢపఱచికొనుటకు గాను మన కిచ్చినమాతృక నింకొకసారి జాగరూకతతోఁ జదువవలయును. ఈపర్యాయము చదువునపుడు మాతృకలోని ప్రతిపదముయొక్కయు సమాసముయొక్కయు, వాక్యముయొక్కయు నర్థమును, నభిప్రాయమును, పోఁడిమిని, వాఁడిమిని గుర్తించి గ్రహింపవలయును. మాతృకలోని పదాదులయర్థములు తెలియనపుడు వానిని గోశములసహాయమునఁ దెలిసికొనవలయును. ఇట్టితీవ్రమునుయినచదు వావశ్యకము. ఏదైన నొకముఖ్యమైన వాక్యముయొక్కగాని, సమాసముయొక్కగాని, పదముయొక్కగాని యర్థమును సరిగా గ్రహింపనిచో, మనభావన లన్నియుఁ, బెడదారినిబట్టి, మనము వ్రాసినసంగ్రహము మాతృకనుండి వేఱుపడినదై, విపరీతములను బ్రకటించునదిగఁ గూడ నగుచుండును.

5. ఇప్పటికప్పుడే మనకిచ్చిన మాతృకలోనియేభాగములుముఖ్యములో, యేయభిప్రాయములు సారవంతములో యేవి యనవసరములో గోచరించుచుండును. మనము మాతృకలోనిముఖ్యవిషయమును సునిశ్చితముగ నిర్ణయించినపుడు, మన కందలియేవిషయములు ముఖ్యములో [illegible] ముఖ్యములు కావో సువ్యక్తము లగుచుండును.

6. సంతరింపు:— ఇప్పుడు మాతృకలోని ముఖ్యవిషయములని మనకుఁ దోఁచినవానిని తుంపుమవాక్యములుగా వ్రాసికొని, వానిలో ననవసరములని తోఁచినవానిని దొలఁగించి, మిగిలినవాని నొకక్రమములో సంతరింపుము. ఇప్పుడు నీవు వ్రాసినప్రణాళికను (Skeleton) మాతృ

కతోఁ బోల్చిచూచి, (i) ముఖ్యవిషయము నెద్దానిని విసర్జింపలేదనియు (ii) అనవసరవిషయములుగాని, ప్రకరణమునకు సంబంధింపని విషయములుగాని దానిలో లేవనియు నిర్ణయించుకొనుము. అట్టివిషయము లేవి కాన్పించినను వానిని నీప్రణాళికనుండి తొలఁగింపుము.

7. రచనము :— నీసంగ్రహముయొక్క పరిమాణ మెంతయుండవలయునో దృష్టియం దుంచికొని, నీప్రణాళికసాహాయ్యమున నొకచిత్తు సంగ్రహమును దయారుచేయుము. నీవు వ్రాయుసంగ్రహ మాద్యంతము నీసొంతమాటలలోనే యుండుట యుక్తము. మాతృకలోనిపదములును, సమాసములును, వాక్యభాగములును నీసంగ్రహములో నున్నను దోషము లేదని కొందఱనుత మయినప్పటికిని, స్వతంత్రరచనమునకే యెక్కువగణ్యత గలదు.

8. సంగ్రహమునకు సందర్భశుద్ధియు, క్రమాభివృద్ధియు నుండవలయును. ఇది సమగ్రమైనదిగ నుండి, విషయములను గరతలామలకములుగ నొసరించుచుండవలయును. సంగ్రహమును జదువువాని కెట్టి సంశయములును గలుగఁగూడదు. మాతృకను జూడవలసినయవసరము గలుగఁగూడదు. కావున నీసంగ్రహములు గ్రహణసౌలభ్యము గల్గి, క్రమము ననుసరించి రచియింపఁబడినవై, సమగ్రములుగను, సంశయరహితము లయినవిగను నుండవలయును. మాతృకలో నున్న చర్విత చర్వణములకును, నుదాహరణములకును, పదాడంబరరచనములకును, శయ్యాచమత్కారములకును, అలంకారములకును, సంభాషణములకును సంగ్రహములందు తావే లేదు. ఆయావిషయములసారాంశములను సూటిగాఁ బ్రకటించుటయే సంగ్రహముల ముఖ్యోద్దేశము. కావున సంగ్రహము సులభముగను, విషయములను సూటిగఁ బ్రకటించునదిగను, దోషరహితమై సలక్షణమైనభాషలో రచింపఁబడినదిగను నుండవలయును. తేటతెల్లముగా భావములను బ్రకటించుటే సంగ్రహముల యాశయము గావున సీగుణము రచనకుఁ గలుగునని తలఁచినపుడు

మాతృకలోని విషయములక్రమమును మార్చి యనువగు క్రమములో సంతరించి ప్రకటింపవచ్చును.

9. సింహావలోకనము :- చిత్తుసంగ్రహమును సిద్ధముచేసిన తరువాత దానిని మాతృకను బోల్చి సరిచూడవలయును. ఇట్లొనర్చుటలో నీదిగువవిషయములను దృష్టియం దుంచుకొనవలయును.

1. మాతృకలోని యన్ని ముఖ్యవిషయములును సంగ్రహములో నున్నవా లేవా. 2. మాతృకలో లేని క్రొత్తవిషయము లేవియును సంగ్రహములో లేవుగదా. 3. సంగ్రహములోనున్న i. అనవసరము లగుపదములను, సమాసములను దొలగించికాని, ii. వాక్యములనుమార్చి వ్రాసికాని, యాచిత్తుసంగ్రహమును సాధ్యమగునంతవఱకు నింకను సంగ్రహపఱుపుము. 4 వర్ణక్రమదోషములను, వ్యాకరణదోషములను, జాతీయమునకు లేక తెనుఁగునుడికారము (idiom) నకు సంబంధించిన దోషములను దొలఁగింపుము. 5. ఆ వాక్యములందు విరామచిహ్నముల నుంచి నీభావములు ప్రస్ఫుటము లగునట్లొనర్పుము. 6. శైలిని జక్కఁజేయుము.

అన్నివిధములచేతను, నీకు సాధ్యమగునంత చక్కఁగా నొనర్చిన యాచిత్తుసంగ్రహమునకు శుద్ధప్రతి (సాపు) వ్రాయుము.

6. బాలురయుపయోగార్థ మిచ్చట రెం డుదాహరణములను బొందుపఱిచెద : ఈదిగువదాని సంగ్రహమును వ్రాయుము:—

[1] "లోభము మోహమును బుట్టించును. మోహము దుఃఖము నుత్పాదించును. దుఃఖము జ్వలనమువలె స్వాశ్రయమునకు నాశము పుట్టించును. కాఁబట్టి లోభమునకు బుద్ధిమంతుఁడు లోఁబడఁడు.

ధనలోభము సర్వాపదలకును మూలముగదా! తద్వర్జనంబుకంటె లోకమందు సుఖమేదియు లేదు. ఆశ దిగనాడినవాఁడే సత్పురుషుఁడు. వాఁడే సర్వశాస్త్రములును జదివినవాఁడు. వాఁడే సర్వధర్మము లాచరించినవాఁడు. ఉదరమునకై పరులఁ గోరక ప్రాప్తలాభమునకు సంతోషించువాఁ డొక్కఁడు లోకమందు ధన్యుఁడు. వాఁడే సుఖి."

(చిన్నయసూరి : మిత్రలాభము.)

## సంగ్రహము.

సర్వానర్థదాయక మగుధనలోభము మోహమును, దుఃఖమును బుట్టించి నాశమును దెచ్చును. లోభవర్జితుఁడీప్రపంచమునందు సుఖముల నందుచు సత్పురుషుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వధర్మకర్మజ్ఞుఁడు ననుపొగడ్తను గాంచును. పొట్టకొఱకితరులను పీడించి యాచింపనివాఁడే ధన్యుఁడై సుఖముల నొందుచున్నాఁడు.

[2] ఒకనాఁడు విష్ణుచిత్తుఁడు మాలలు గట్టుటకుఁ బుష్పములను నాకుజొంపములను గోయుటకై కోవెలయందలి శృంగారవనములోనికిఁ బోయెను. రసాలపల్లవశోభితంబై, పూఁబొదరిండ్లతో నొప్పునావనంబున విశాలమైన వీథి యొక్కటి కలదు. ఆవీథిచెంత నొక తెల్లని గచ్చుటరుగు కలదు. అచెంత వృక్షములావేదికయందుఁ బ్రతిఫలించుచున్నవి. దానియందలి ప్రతిబింబితము లగుచెట్లగంగుల వలన నది మరకతమయ మగు వేదికయా యనుభ్రాంతి గలుగుచుండెను. అతిన్నియచెంతఁ దెల్లతామరల కాకరమగు నొక కోనేరు గలదు. అకమలాకరమునకుఁ జెంత నొక తులసీవనంబు గలదు. విష్ణుచిత్తుఁడు తులసీవనసీమను డాయఁబోయి, యచ్చట శుభలక్షణలక్షిత యగు నొక్కయరవిందలోచనను గాంచెను. అతఁడామె సౌకుమార్యమును, ధనుద్యుతిని, దేజమును, జెలువంబును, అప్పవాల్పక చూచి యచ్చెరువందెను. విష్ణుచిత్తుఁడు కొంతవడికిఁ దెలివితెచ్చుకొని "యనపత్యుఁడనగు నాకు ముకుందుఁడీమెను దనయగా దయచేసినాఁ" డనుచు హృష్టుఁడాయెను. అతఁడాలేమను దనగేహంబునకుఁ గొనిపోయి యామెను దనధర్మగేహిని కొసఁగెను. ఆమెయాడె నాలతకూననుజూచి, సంతోషముతో నుప్పొంగుచు, గోదాదేవి యనునామం బిడి గోముప్పఁ బెంచుచుండెను. ఆమె దినదినప్రవర్ధమానయై యౌవనవతి యాయెను.

## సంగ్రహము.

విష్ణుచిత్తుఁ డెప్పటియట్లు దండలు కట్టుటకై పూవులను నాకుజొంపములను దెచ్చుటకుఁ గోవెలయందలి శృంగారవనములోని తులసివాటికకుఁ బోయెను. అందాతఁడు శుభలక్షణములు గలయొక బాలికను జూచి, బిడ్డలు లేనితనకు దైవ మొక్కకూఁతును బ్రసాదించెనుగదా యని సంతోషించుచు, నాబాల నింటికిఁ గొనిపోయి భార్య కొసఁగెను. ఆమె యాపిల్లకు గోదాదేవి యని పేరుపెట్టి గారాబముతోఁ బెంచుచుండెను. కాలక్రమమున నామె పెరిగి యౌవనవతి యయ్యెను.

## Exercise.

ఈక్రిందివానిని సంగ్రహముగా వ్రాయుడు:

### I

హిందూదేశములో నేఁడాగికి పదునాలుగులక్షలటన్నుల పంచదార ఉత్పత్తి యగుచున్నది. దీనిలో పదిన్నరలక్షలటన్నులుమాత్రము ఈదేశములో నేఖర్చయి మిగిలిన మూఁడున్నరలక్షలటన్నులపంచదారయు నితరదేశముల కెగుమతిచేయుటకు వీలులేక పోవుటచే మిగిలిపోవుచున్నది. అందుమూలముననే బెల్లపుపరిశ్రమ తీరనిదెబ్బ తినవలసి వచ్చుచున్నది. చెఱకు పండించువ్యవసాయదారుఁడును, ఆబేరములో వర్తకముచేసి మేఁడలు కట్టువర్తకులును, నష్టపడకుండ నుండుట కొక్కటే మార్గ మున్నది. ఇతరదేశములనుండి మనదేశములోనికిఁ ద్రోసివేయఁబడు పంచదారమీఁద నాంక్ష విధించి, మనదేశములో మిగిలిపోవుచున్న చక్కెర నితరదేశముల కెగుమతిచేయుసౌకర్యములను ప్రసాదించుట యమలులోనికి రావలయును. లేనిచో మనదేశపుపంచదార పరిశ్రమకు మోక్షములేదు.

[2] భారతదేశము చేనేతపరిశ్రమకు జన్మస్థానము. వేదకాలమునాడుకూడ నూలువడుకుట, నేర్పుతో వస్త్రములను నేయుట చాల సున్నతదశలో నున్నట్లు కనపడుచున్నది. కౌటిల్యుఁడు, తాను వ్రాసిన అర్థశాస్త్రములోకూడ నీపరిశ్రమ ఔన్నత్యమును పొగడెను. ఇదియునుగాక మనదేశము వచ్చి చూచిన విదేశప్రయాణికులు వ్రాసిన గ్రంథములలోఁగూడ, మన దేశీయులకు నీ పరిశ్రమలోఁగల చాకచక్యమును, మన మగ్గములమీఁద తయారైన వస్త్రములను, చాలప్రశస్తముగాఁ గొనియాడిరి.

టావర్నియర్ అను నతఁడు నీక్రింది విధముగా నొక యుదాహరణము నిచ్చెను. పర్షియాదేశపు పావద్షకు నొకరాయబారివెళ్ళి, ఉష్ట్రపక్షి గ్రుడ్డుపరిమాణముగల, నవరత్నఖచితమగు కొబ్బరికాయ నొక దాని నీయగా, నందు 60 మూరలు నిడివిగల 'మల్లు' తలగుడ్డ యిమిడియుండెను. మన చేతులతో నా మల్లు గుడ్డను తీసికొన్నను. మనచేతులలో నేమియు లేదని చెప్పదగినంత తేలికగాను, సున్నితముగాను నుండెవట, ఒక మొగలాయి చక్రవర్తి తన కూఁతును నెల్లప్పుడును శరీరము వెలుపలికి కనుపించెడి వస్త్రముల నేలధరియించెదవని కోపముచేఁ దిట్టెను. అందుల కామె "అప్పటికిని నొక వస్త్రముపై మఱొకటి ఏడువరుసలు ధరించితిని" అని తన తండ్రికి సమాధానము చెప్పెనట. భారతదేశములోఁ దయారైన మల్లులు ఎంతసున్నితములైనవో పైనిదర్శనములవలన గ్రహింపఁదగును.

ప్రస్తుతము ప్రతిభారతీయుని దృష్టియు సేవాగ్రామముపై నున్నది. అందుచేతనే సేవాగ్రామమును, హిందూదేశముయొక్క అనధికారముఖ్యపట్టణమని అనేకులనెదరు. ఆసేవాగ్రామమునుగుఱించి, యీవ్యాసములోఁ గొంత తెలిసికొందము.

సేవాగ్రామము వార్ధాకు సుమారు 5 మైళ్ళదూరములో నున్నది. మహాత్ముఁడు మొట్టమొదటనుండియు, ప్రకృతియన్న నభీష్టము గలవాఁడు. మొట్టమొదట జమ్నాలాలు బజాజు మొదలగు నాయకుల కోరిక ననుసరించి, గాంధీజీ వార్ధాకు మొట్టమొదట వచ్చినను, వార్ధా ఆయనను సంతృప్తిపఱుపకున్నందున, గాంధీ యొక చిన్నగ్రామమునకుఁ బోయి, పల్లెటూరిప్రజలతోఁ గలిసి తిరుగుచు హరిజనుల యభివృద్ధికై పాటుపడ వాంఛించుచుండెను. ఇట్లుండఁగా, గాంధీజీ యొకనాఁడు సైగాను [Seogan] చూచుట తటస్థించెను. వెంటనే వారు సైగానునకు మరలి, యచ్చట నొక యాశ్రమమును స్థాపించిరి.

వీరు సైగానునకుఁ బోయియున్నరోజులలో, నది పాములు, తేళ్లు మొదలగు వానితో నిండియుండెను. ఐనను వారి యాశ్రమములో నివసించువారెవరును నేవిషజంతువును చంపనీయరు. ఆశ్రమము దినదినము వృద్ధిచెందుచున్నందున, నిప్పుడు వీరియాశ్రమము చిన్నగ్రామముగా మాఱినది. అచ్చటి కట్టడములు చూచిన ప్రాచీనఋష్యాశ్రమముల వలె నుండును.

## IV

‘నేను నలనాభుఁ డనుగంధర్వరాజు కుమారుఁడను. బ్రహ్మమిత్రుఁ డనువైద్య పండితుఁ డాయుర్వేదమును శిష్యులకుఁ జెప్పుచుండువాఁడు. ఆవైద్యులయొజ్జకడ నావిద్య నభ్యసింపఁదలంచి, నాతనికడ కేఁగి, భక్తితో నాతనికిఁ బ్రణమిల్లి, నన్నుఁ దనఛాత్రు నిగాఁ జేసికొమ్మని ప్రార్థించితిని. “నటవిటగాయకగణికాదిజనంబుల పరిహాసోక్తుల నాలించుచు వారితోఁ గాలముఁ గడుపువారికి శాస్త్రము శ్రుతికటువుగా నుండును. నీవు మాకడ నీవిద్యను నేర్చుకొనకపోవుటచే మాకు జరుగుబాటున కెట్టిలోటును వాటిల్ల”దని యాతఁడు నాకుఁ బ్రత్యుత్తర మిచ్చెను. అంత నే నాతనితో “స్వామీ! నే నాదినుండియు మీవంటిపెద్దల శిక్షలో నే పెరిగితిని. నా కావిద్య నెట్లైనఁ గరపుఁడని” వేఁడికొంటిని. దీని కాతఁడు కోపముతో, “ఓరీ! ధనరాజ్యగర్వమదమున నీకుఁ జెప్పలేక పొ”మ్మని వక్కాణించెను. దీనికి నే నలిగి యాతనితో, “ఓయీ! నీవైద్యవిద్య యెవరికిఁ గావలెను. నీవు నాకు విద్యను జెప్పకపోయినఁ జెప్పకపోవచ్చునుగాని యిట్లు తూలనాడుట కేవల మనుచిత” మని పలికి యచ్చోటు వాసిపోయితిని. తదనంతరము నా కావిద్య నెట్టులనైన గ్రహింపవలె ననుకుతూహలము గలిగినది. అంత నేను కపటాంతేవాసినై యాతనిశిష్యులతోఁ గూర్చుండి విషయవిచారములను సలుపుచు నష్టాంగములతో నలరారువైద్యము నెనిమిదినెలలలో సాంతముగా నేర్చుకొంటిని. షడ్రసములలో నెద్దానిపై నేయేదోషములవలన నరుచి పుట్టునో, వానివానికిఁ బరిహారము లెవ్వియో తెలిసికొంటిని. ఎల్లరోగములకుఁ జికిత్సల నభ్యసించితిని. నేను నాయీ నేర్చినవిద్యతోఁ దృప్తిఁ జెందక, గర్వించి, మదాంధ్యమునఁ గన్నుగానక, మాయావే

మును వీడి, "తండ్రీ! నా కాయుర్వేదమును గఱపు" మని యక్కఱమీఱ నిన్నుఁ బ్రార్థించితిని. కాని నీవు నన్ననేకభంగుల నిందించి, తిరస్కారవచనంబు లాడి, నన్నవమానపఱచి పంపితివి. ఓయీ కష్టముష్టింపచా! దృఢసంకల్పుల కెట్లయినను విద్య రాకుండునా! గుండ్రాఁడిన పెండ్లి యాగునా!" యని గురువును దిక్కరించితిని. నామాటల నాలించి యామహాని గోపోద్దీపితుఁడయి, కక్షపాలలోని బూదిని గేలంగొని "ఓయీ! నన్నాసురి యనుమాటవలన వంచించిన కారణమున నీ వసురవై పిశితంబును, వసను, నసృగాసవంబును, రసంబుగా మెసవుచు నసురయోనియందు జనింపు"మనెను. ఇంటికిఁ దిరిగి వచ్చినతరువాత వికృతాకృతి నొంది దనుజుఁడనైతిని.

## V

నిమివంశంబున ధర్మధ్వజుఁ డనురాజొకఁడు పుట్టెను. ఇతనికి మితధ్వజుఁడు కృతధ్వజుఁడు ననునిద్దఱు పుత్త్రులు గల్గిరి. మితధ్వజునికి ఖాండిక్యుఁడును, కృతధ్వజునికిఁ గేశిధ్వజుఁడును ననుకొమరులు పుట్టిరి. పితృవ్యపుత్త్రులగు నీరాకొమరు లిద్దఱును నొకరిరాజ్యము నొకరు కబళింపవలయు ననుకాంక్షతోఁ బన్నెండుదినంబులు ఘోరముగఁ బోరిరి. ఆయుద్ధసంగ్రామంబున ఖాండిక్యుఁ డోటువడి యరణ్యమున కేఁగి యచ్చటిపర్వతశృంగముమీఁదఁ బర్ణశాలను నిర్మించుకొని యందుఁ గాఁపుర ముండెను.

ఖాండిక్యునిరాజ్యమును స్వాధీనముచేసికొని కేశిధ్వజుఁడు కొంతకాలము రాజ్యపాలనము నొనరించెను. కేశిధ్వజుఁ డైహికసుఖంబులఁ దనిసి, యాముష్మికసుఖములం దాసక్తిగలవాఁ డయ్యెను. ఇట్లుండ నాతనికిని గర్మమార్గానపేక్షితంబుగ మృత్యువును గెలువవలయుననియుఁ, దన్నావరించియున్న యజ్ఞానతిమిరమును జ్ఞానభానూదయంబుచే మాపుకొనవలయుననియు, జననమరణరహితంబైనముక్తినిఁ బడయవలెననియుఁ దలఁపు గల్గెను. ఈమనోనిశ్చయంబుతో నాతఁ డొకమఖమును జేయఁబూని యజ్ఞదీక్ష వహించెను. దానిహోమధేనువు యజ్ఞశాలానికటభూములందు గడ్డిని మేయుచుండెను. అది యట్లు పులు మేయుచు నాచెంత, నేటిదరి నంటిపోవుచుండెను. ఆనదీతీరపరిసరంబున నున్నయొక్కపొదలో నొకపెద్దపులి పొంచియుండెను. ఆయజ్ఞగవి తనపొదరింటిని, దాఁటఁగనే, యామువ్వన్నెమెకము మొదవుపై కుఱికి దాని మెడను గొఱికి, దానిశోణితమును గ్రోలుచు, దానిని గుహలోని కీడ్చుకొనిపోవ నుంకించుచుండెను. ఆచెంత పొలములలోనివా రావ్యాఘ్రమును జూచి చప్పటులు చఱవఁ జొచ్చిరి. వెంటనే కొందఱు గుఱ్ఱపురౌతు లచ్చటికి వచ్చి యాబెబ్బులిని దఱిమిరి. అంత నాద్వీపి యాధర్మగవిని విడిచిపెట్టి పాఱిపోయెను.

కొనయూపిరితో నున్నయామొదవును జూచి కేశిధ్వజుఁ డచ్చటిఋత్విజులతో "ఓబ్రహ్మలారా! నాయీయజ్ఞపశువు కొఱప్రాణముతోఁ దన్నుకొనుచున్నది. దీన

నాముఖంబున కంతరాయము గల్గనై యున్నది. ఏది యెట్లున్నను నాకు సవనమునకు విఘ్నమే గల్గును. కావున దీనికి నిష్కృతిని జెప్పవలసినదని విన్నవించెను. వారు దాని ప్రాయశ్చిత్తము నెఱుంగమనియుఁ, గసేరు వను ఋషి యొక్కఁడు దానిని జెప్పఁగలఁడనియు రాజుతో నుడివిరి. రాజు కసేరునొకడకుఁ బోయి యడుగఁగా నాతఁడు శునకు నడుగు మనెను. శునకుఁడు వానితో నయ్యంకిలికిఁ బ్రాయశ్చిత్తము నివేదింప నొక్క ఖాండిక్యుఁడే సమర్థుఁడని పల్కెను. అంత కేశిధ్వజుఁడు ఖాండిక్యునికడకుఁ బోయి యాతనికి [illegible] కారణంబుఁ దెల్పి దానికి నిష్కృతిని జెప్పుమని ప్రార్థించెను. ఖాండిక్యునివలనఁ దగునిష్కృతిని దెలిసికొని, కేశిధ్వజుఁడు యజ్ఞవాటికకేఁగి యాక్రతువును సాంగముగా నొనరించెను.

## VI

చేదిదేశమున నర్థస్థానపురము కలదు. ఆపట్టణమును వసురాజు పాలించుచుండెను. ఆభూమీశుఁడు తనకృపాణముచే వైరవీరులను సంహరించి, తనకీర్తిని దిగంతములకుఁ బ్రసరింపఁజేయుచుండెను. తనప్రతాపాగ్నిచే నెండినసముద్రముల నాతఁడు తానొసఁగు దానజలధారలచే నింపుచుండును. అశేషునిచేతను కులపర్వతములచేతను ధరింపఁబడు భూదేవి వానిభుజరక్షణము చేయుచుండ. ఒక పర్వతములందుండి ఘోరతపమాచరించి, వసువల్లభునిఁ బ్రేమించి వసుమతియైనది. ఆధనిసుగుణములవాసన నొంది యామె గంధవతి యను పేరిటి కెక్కినది.

హిమవంతునికిఁ గోలాహలుఁ డనుతనయుఁడు కలఁడు. ఆకోలాహలనగాధీశుఁడు శుక్తిమతీప్రవంతిపై వలపుగొని దాని నడ్డగించెను. అంత వసురాజు కోలాహలునిఁ గాలి బొటనవ్రేలితో తేగవ్వను మీటిన నది బైటఁబడెను. పర్వతశాసనగర్వోద్ధతుఁ డగు నింద్రుఁడు దీనిని జూచి నివ్వెఱఁగంది వసురాజుతో సఖ్యము చేసికొనెను. ఆకోలాహలపర్వతము దిక్కులేనిదై యారాజుకడఁ జేరెను. ఆమహీజాని యానగేంద్రమును దనక్రీడాశైలముగ జేసికొనెను.

అప్పుడు వసంతఋతువు ప్రారంభమయ్యెను. ఆక్రీడాశైలముమీఁది వృక్షములు చిగురుపట్టి పూలతో శోభిల్లుచుండెను. ఆమనికి, పునికిపట్టై, యత్యంతశోభాయమానంబయి విరాజిల్లు నాక్రీడావనంబుసౌందర్యమును వనపాలురు వసురాజుకడఁ బొగడిరి. వసంతాగమనంబున తనక్రీడావనంబునకుఁ గల్గిననూతనసౌభాగ్యము నవలోకింప కుతూహలము గల్గి రాజు తనరథమును దేర నాజ్ఞాపించెను. మణిఖచితంబగురథంబు నెక్కి వసురాజు వనభూమికిఁ గదలెను. తనతో వచ్చినవారి నెల్లర నందుండ నియమించి, మంత్రియుఁ దానును వనమును బ్రవేశించెను. వారందలి తరులయు, లతలయు, కొలఁ

కులయు సౌందర్యాతిశయంబులఁ గన్నులారఁజూచుచు సంతోషాంబుధి దేలుచు నొక వృక్షమును జేరిరి. ఆవృక్షాగ్రమున నున్న కిన్నరమిథునము సకలజంతుభాషల నెఱింగిన వసురాజుతో, "ఓ వసువల్లభా! అన్యదురాసదం బయినయొక్క శుభం బతిశీఘ్రకాలముననే నీ కయ్యెడు" నని పల్కి జరుగనైయున్న గిరికావసురాజుల వివాహమును సూచించెను.

## VII

"జన్మమాదిగ నేను భుజంగములను దినుచుంటిని గాని యిట్టి యురగుని నే నెన్నఁడును జూడలేదు. ఇమ్మహాత్ముఁడు బాధపడకుండుటేగాక యానందమగ్నమానసుఁడు గూడనైయున్నాఁడు. వీని నాడులను వీకి రక్తము ద్రావినపుడు ప్రసన్నత నొందుచు, నత్యంతాపకారినగు నన్ను మహోపకారిని జూచినట్లు జూచుచున్నాఁడు. ఈతని ధైర్యవృత్తులఁజూడ నాశ్చర్యము గొలుపుచున్నవి. నే నీతనిని భక్షించుట మాని యీతఁ డెవ్వఁడో యడిగి కనుగొందును గాక" యని గరుడుఁ డనుకొనుచుండెను. గరుడి తన్నుఁ దినుటమాని యూరకుండుటఁ జూచి జీమూతవాహనుఁడు తార్క్ష్యనందనునితో, "ఓయీ విహంగపుంగవా! నానాడులం దింకను రక్తము గలదు; నామేన నింకను మాంస మున్నది. నీవు తృప్తినొందినట్లు కాన్పించుట లేదు. నీవు భోజనము నేల మానితి" వనెను. ఇట్టి దురవస్థయందుఁగూడ, నాతని హృదయరక్తమును ద్రావుచున్న నాతో నింత యూర్జితముగ మాటాడు, నీవెవ్వరవో చెప్పుమని గరుడి వేఁడెను. "ఆఁకొన్న నీవు నావార్త వినఁదగినస్థితిలో లేవు, నన్నారగించి క్షుద్బాధ నడఁచికొ" మ్మని జీమూతవాహనుఁడు వల్కెను. ఆసమయముననే శంఖచూడుఁ డచ్చటికి వచ్చి గరుడునితో, "ఓయీ గరుత్మంతుఁడా! ఆతఁడు నాగుఁడు గాఁడు. నీకాహారార్థము వాసుకిచేఁ బంపఁబడినవాఁడను నేనుగాని యాతఁడు గాఁ"డని విన్నవించెను. జీమూతవాహనుఁ డీమాటలు విని, దిగులంది యాత్మగతంబున, "శంఖచూడునిరాకచే నాకోరిక విఫలమయినది యగునేమోగదా" యని తలపోయఁజొచ్చెను.

గరుడుఁడు:— "మీరిద్దఱును గూడ వధ్యచిహ్నములనే ధరించియున్నారు. మీలో నాగుఁ డెవఁడో తెలిసికొనఁజాలకున్నాఁడను."

శంఖచూడుఁడు:— నాయెడ స్వస్తికచిహ్న మున్నది. నాకు మేన కుబుసంబు గలదు. నేను ద్విజిహ్వుఁడ. నేను నాగకుమారుఁడనుట కివియే తార్కాణములు.

గరు:— నే నిప్పటివఱకు భక్షించుచున్న యీతఁ డెవఁడు?

శంఖ:— విద్యాధరవంశతిలక మగుజీమూతవాహనుఁడు నీకు భోజ్యమయినాఁడు.

గరు:— ఇతఁడా విద్యాధరపతి యగుజీమూతవాహనుఁడు! ఈతనికీర్తిగేయములనే నాచారణులు సదా పాడుచుందురు. నే నీయకార్యమును జేసి మహాత్తరమైన

పాపపంకమున మునింగితిని. నాకు భోజనముగ నేర్పఱుపఁబడిన నాగకుమారుని గాపాడుటకుఁ దన దేహము నిచ్చిన యీ బోధిసత్త్వు నేనఁ జంపితిని. ఈ మహాపాతకమున కగ్నిప్రవేశము కంటె వేఱు ప్రాయశ్చిత్తము లేదు. నాకిప్పు డగ్ని యెక్కడ దొరకును? బళీ! వీరెవ్వరో యగ్నిని దీసికొని యిటకే వచ్చుచున్నారు. వారు వచ్చుదాఁక నే నిటనే యుండెద.

గరుడుఁడు వారాడుకొను మాటల నాలించి యా వచ్చువారు జీమూతవాహనుని మాతాపితరులని గ్రహించి, "మీరు తెచ్చునగ్నితో నన్ను నే నెట్లు దహించికొనఁ గలుగుదును? వీరి పుత్త్రుని జంపి వీరి మొగ మెట్లు చూడుదునా! ఇఁక నే నీ సముద్రంబునఁ బడి ప్రాణత్యాగము చేసికొనియెదను గాక" యని నిశ్చయించుకొనెను. ఇది విని జీమూతవాహనుఁడు, "గరుడ చేసిన పాతకమున కాత్మహత్య ప్రతీకారము కాదనియు, నిఁక హింస చేయకుండుటయు, ముందు చేసినదానికిఁ గుందుటయు, నెల్లప్రాణులను గాపాడుచుఁ బుణ్యోపార్జన మొనరించుటయు దీనికి నిష్కృతి" యని వక్కాణించెను. అంతనుండి యట్లు మెలఁగుటకు దృఢసంకల్పుఁ డాయెను. జీమూతవాహనుఁడు తార్క్ష్యుని దృఢనిశ్చయమును విని హృష్టుఁ డయ్యెను.

అప్పటివఱకుఁ బరార్థసంపాదన రసపారవశ్యముఁ జెందియున్న జీమూతవాహనుఁడు తన వేదన నెఱుంగకుండెను. కృతకృత్యుఁడైన యాతఁ డిప్పుడు మరణావస్థను జెందుచుండెను. జీమూతవాహనుఁడు శంఖచూడుని సహాయంబునఁ దలిదండ్రులకుఁ గడసారి నమస్కరించి, యా యాదిదేవునిపై దృష్టినిడి, "ఓయీ దయామయా! ముందు జన్మములందుఁ గూడఁ బరోపకారార్థము నేనుపయోగపడున ట్లనుగ్రహింపవే" యని తలపోయుచుఁ ద్రిదివంబున కరిగెను.

## VIII

అట్లు పూర్వము సత్యసంధుం డగు రామభద్రుండు సీతాలక్ష్మణసమేతంబుగ నయోధ్యానగరంబు వెడలి, తమతండ్రి యగు దశరథునివలనను, కైకేయీకుబ్జలవలనను, రాజ్యభ్రంశంబు నొంది, యితరజనదుర్లభం బగు నైశ్వర్యంబు పరిహరించి, దండకారణ్యంబున కరిగిన చందంబున, ధర్మాత్ముం డగు పాండవాగ్రజుండు నీచుం డగు సుయోధనునివలనను, మాయాబలశాలి యగు శకునివలనను, దండ్రియగు ధృతరాష్ట్రునివలనను గపటద్యూతంబునఁ బరాజితుఁ డగుచు, సత్పురుషధర్మం బవలంబించి, యపారం బగు నైశ్వర్యంబును దొఱంగి, రాజ్యహీనుండై హస్తిపురంబు నిర్గమించి, భార్యాసోదర సహితంబుగ విపినభూములకుం జనినంతఁ గుమారులమర్ణయంబువలన శోకాకులితమానసుండును భయభ్రాంతుండు నగు నంబికానందనుండు తనమనంబునం బెద్దయుం బ్రొద్దు

చింతించి శాంతిం బొందఁజాలక విదురుని శీఘ్రంబునం దోడితెమ్మని పనిచిన నతండు ధృతరాష్ట్రునిమందిరంబుఁ బ్రవేశించె. అట్లు వచ్చినవిదురు నుద్దేశించి, భీతుండగునై చిత్రవీర్యుండు, "ధర్మనందనుండు వనంబునకుం బోయెడుసమయంబున నెవ్విధంబునఁ జనియె? భీమార్జుననకులసహదేవులును, మహాతపస్విని యగుద్రౌపదియును, బురోహితుం డగుధౌమ్యుండును నెట్లేఁగుచు నరిగిరి. వారల యింగితచేష్టంబులు నా కెఱింగింపు" మనిన విదురుండు, "కౌంతేయాగ్రజుండు వస్త్రంబు ముఖంబునఁ బొదివికొని యరిగె, వృకోదరుండు బాహుదండంబులు వీచుచుం జనియె, విజయుం డిసుకఁజల్లుచు యుధిష్ఠిరునికిం బిఱుందనె నడిచె, చిత్తవిహ్వలుండును సౌందర్యశాలియును వీరాగ్రేసరుండు నగునకులుండు ధూళిధూసరితగాత్రుం డగుచు వెడలె. సహదేవుండు రేణువు వదనంబున నలందుకొని వెలువడియె.

అతిమనోహరాకారయును విశాలలోచనయు నగుపాంచాలి రోదనంబు గావించుచుం గుంతలంబుల ముఖంబుఁ గప్పికొని యజాతశత్రుని పిఱుంద నరిగె.

ధౌమ్యుండును గరంబునఁ గుశముష్టి గీలించి, యమదేవతాకంబులును, రుద్రదేవతాకంబులును నగుసామంబులు మార్గంబున గానంబుఁ గావింపుచు నరిగె" నని తెలిపె. అంత నతండు విదురు నుద్దేశించి వారు అరణ్యమునకుం బోవునప్పు డిట్లు నానాచేష్టితంబులతోడం జనుటకుం గారణం బేమి? అది వివరింపు మనిన నతండు వైచిత్రవీర్యు నాలోకించి యిట్లనియె.

అజాతశత్రుండు నీపుత్త్రులమాయోపాయంబున రాజ్యంబును ధనంబును గోల్పడుటవలనఁ గ్రోధోద్దీపితుం డయ్యును హృదయంబున ధర్మంబు నెలకొలిపి తనయుగ్రదృష్టిం జూచిన నెల్లవారును భస్మం బైపోయెదరని ధార్తరాష్ట్రులయెడం దయగలిగినవాఁడగుట వస్త్రంబున ముఖాచ్ఛాదనంబుఁ గావించుకొని చనియె. దోర్బలదర్పితుం డగుపవననందనుండు భుజాటోపంబునఁ దనకు సమానుం డగువాఁడు లేఁడని బాహువులు వీచుచు నీభుజంబులచే శత్రుసంహారంబు గావింపంగలవాఁడ నని యెఱింగింపుచు నేఁగె.

అర్జునుం డిసుకఁ జల్లినచాడ్పున నతినిశితంబు లగుశరసందోహంబులు తండోపతండంబులుగాఁ బ్రయోగింపంగలవాఁడ నని సూచింపుచుం బోయె. అతిసౌందర్యశాలి యగునకులుండు స్త్రీజనంబులకుఁ దనయెడ మోహంబు గలుగకుండ రజోదూషితాంగుండై ధర్మంబు ననుసరించె. సహదేవుండు తనయాననసౌందర్యంబు గనుంగొని వధూజనంబులు మోహింపక యుండవలయు ననుతలంపున ముఖంబున ధరణీపరాగంబు నలందుకొని యరిగె.

ఏకవస్త్రంబు ధరించి వికీర్ణకుంతలంబులతోడ రోదనంబు గావింపుచు నెవ్వారి వలనఁ దనకు నిట్టిదురవస్థ ప్రాప్తించె నట్టికౌరవులవనితలు సమరనిహతు లగుపతిసుత బంధుశోణితదిగ్ధాంగలై విస్రస్తచికురభారలగుచు నింకం బదునాల్గవసంవత్సరంబున స్నానంబు లాచరించి యీకరినగరంబుఁ బ్రవేశింతురుగాక యనుచుం జనియె.

ధౌమ్యుం డీపాండవుల నిట్లు పురంబు వెలువరించినధార్తరాష్ట్రులెల్లను సంగ్రామ రంగంబున సంహరింపబడినయనంతరంబ యిట్టే సామగానంబు గావింతునుగాక యని మనంబునం దలంచి కుశలు దక్షిణాగ్రంబుగఁ గరంబునఁ గీలించి చనియె.

## ఆంధ్రవిశ్వవిద్యాలయభాషాప్రవీణప్రవేశపరీక్షాప్రశ్నపత్రములు.

## 1939

ఈక్రింది వాక్యముల సారాంశమును బదిపంక్తులలో సంగ్రహపఱచుఁడు:

అకుమఱుంగుపిండైయై యున్న సరస్వతి యింతవఱకును దాను సుఖవనితయనియే భావించుకొనుచుండెను. తనకుఁ దనప్రాణేశ్వరునిసన్నిధానసౌభాగ్యము లేకపోయినను, సందర్శనానందసామ్రాజ్యము లేకపోయినను, నిరంతర మాప్రేమైకమూర్తిని నిర్మలముగ ధ్యానించుకొనుచు నానందసుఖము ననుభవించుచుండెను. ఇప్పు డామె హృదయాంతరాళమునం దొకవంక ఝంఝూప్రభంజనములు వీచుచున్నవి. ఒకవంకఁ గాలమేఘము లావరించుకొనుచుండెను. అంతటను గాఢాంధకారము గ్రమ్ముకొనుచుండెను.

రాత్రి రెండుజాము లయ్యెను. ఎంతసేపటికిని ప్రొద్దు జరుగుటలేదు. సరస్వతితల్లి మంచమునొద్దఁ గూర్చుండి తదేకదృష్టితో నామెముఖమువంకనే చూచుచుండెను. అన్నపూర్ణ (ప్రేమైకపుత్రి)యగుసరస్వతిమొగముపైఁ బ్రేమాలసవీక్షణములం బ్రసరింపఁ జేయుచుండెను. అవి యంత్యప్రేమావలోకనములని సరస్వతి గ్రహింపలేదు. పాప మాసంగతి యాబాలిక కెట్లు తెలియును? తెలియకపోయినను నామె తనహృదయమునం దేదియో యాందోళనము ననుభవించుచునే యుండెను. అంతవఱకు మేల్కొని యున్న సత్యవతి యాప్రక్కనే యొకచాఁపపైఁ బరుండి నిద్రించుచుండెను.

ఆజననిచూపులంబట్టి సరస్వతి తల్లికి మందు నీయవలెనని ప్రయత్నించెను. అన్నపూర్ణ వలదని సంజ్ఞచేసెను. ఎప్పుడు మందిచ్చినను దీసికొనుచుండునామె యిప్పుడు వలదనుటచే సరస్వతిగుండె గభిల్లుమనెను. అప్పుడు సరస్వతి శోకగద్గదస్వరముతో, అమ్మా! మందు పుచ్చుకొనవా? అనియెను. అన్నపూర్ణ యతికష్టముతోఁ దనచేతిని

సరస్వతిచేతిపై నుంచెను. అప్పు డామె కన్నులనుండి జోటజోట కన్నీరు ప్రవహింప సాగెను. సరస్వతి వికృతస్వరముతో, "అమ్మా! అది యేమి" అనియెను.

అన్నపూర్ణ హీనస్వరముతో, "తల్లీ! కంటఁ దడిపెట్టకుము. ఏమి కావలయునో యది యైపోయినది. నీకష్టమునకు నామరణమునకును నేనే కారకురాలను. ఆఁడుబుద్ధి యసురబుద్ధి యైపోయిన" దని యిఁక మాటాడఁజాలకపోయెను. అప్పుడు సరస్వతి కన్నీటి నాపుకొనఁజాలక, "అమ్మా! నీవు చల్లగనున్న నాకేమికష్ట" మనియెను,

అన్నపూర్ణ యాయాససూచకస్వరముతో, "బిడ్డా! అజ్ఞానముచే నేనే నీసుఖవల్లికను చేతులారఁ ద్రెంచివైచితిని. నా నాలుకపై ముల్లు విఱుచుకొంటిని. నేను పెంచిన బిడ్డయని- నే నదలింపఁదగినవాఁడని- నా మేనల్లుఁడని- ముందు వెనుక లాలోచింపక యొక్కటైన బుద్ధి వచ్చునేమో యను దుర్బుద్ధితో "మూఁడు ముహూర్తములు దాఁటిపోయినవి. లోకులకుఁ జడలేక నీకు బిడ్డనిచ్చినందున బాగుగనే సుఖపెట్టుచుంటివి. నీకీయకపోయినను నాబిడ్డ సుఖపడునుగదా? నీ విట్టి వాఁడ వగుదువని నే ననుకొనలేదు." అని యాతనిదూషించిపలికితిని. -పాప మాబిడ్డ యానాఁడు పిన్నగాఁ దిండియైనను దినలేదు. అదియే కడసారిరాక- మరల నీయింటిగుమ్మము త్రొక్కి- చూడలేదు- మూఁడేండ్లయినది-" అని యూరకుండెను.

## 1940

ఈక్రింది వాక్యముల సారాంశమును బది పంక్తులకు మించకుండ సంగ్రహముగ వ్రాయుఁడు:—

ఒకనాఁటి ప్రాతఃకాలమున బుద్ధగయలో దేవాలయముముందర మెట్లపైని ధనంజయుఁడు ప్రయాణముచే నలసి నిద్రించుచుండెను. అతనిప్రక్కను కాషాయవస్త్రములు ధరించినయొకయువతి నిలిచి బాష్పపూరితనయనములతో నాబాటసారి నెన్నోసార్లు చూడఁజొచ్చెను.

ఆనిద్రితుఁడు మేల్కాంచునప్పటికిఁ జాలప్రొద్దెక్కెను. తనవైపుచూచుచున్న యాకన్నులను జూచినంతనే యాయువకుఁడు "ఈశ్వరా! ఇది స్వప్నమేయైన యెడల నా కిఁక మెలకువ రానీయకుము" అని ప్రార్థించెను.

"ఓధవపురప్రభూ! నన్నుగూర్చి మీ రిట కేలవచ్చితిరి! ఇల్లు లేక దేశద్రిమ్మరినైన నన్ను మీరనుసరింపఁదగునా?" అని యాతపస్విని పలికెను.

"నాయాత్మనంటిన పాపమును భగవంతుఁడు తుడిచివేసెనా? నాఉమా! ప్రేయసీ! నిన్ను ప్రాణములతోఁ జూడఁగల్గితినా?" యని ధనంజయుఁ డాత్రముతో ననెను!

"మీయెడమ కాదు. మీప్రేయసి కాదు. నాశరీరము, నామనస్సు, నాహృదయము భగవంతున కర్పించితిని. ఇంక నే నేమనుష్యునకును భార్యగా నుండుట కిచ్చగింపను."

"ఉండు ఉమా! నీపాదములు స్పృశించి క్షమింపుమని వేడుకొననిమ్ము. చిన్నతనముననే, నేను నీకుఁ గల్గించినకష్టము లిన్నన్ని గావు. నిన్ను నాహృదయము నుండి తొలఁగించితిని. హృదయమునుండియే గాదు నాయింటినుండియుఁ దరిమి వేసితిని. శుద్ధాంతకాంతను నిన్ను దేశద్రిమ్మరిని జేసితి" నని యతఁడు విలపింపఁజొచ్చెను.

"స్వామీ! పూర్వాశ్రమవృత్తాంతమును స్మరణకుఁ దేవలదు. అది మనయిరువురి నడుమను భూస్థాపితము కావలసినదే. ఎన్నఁడు మనపాపములను బాపనోపునో యతనినే మార్పణ వేడుఁడు—" అని యామె గద్గదస్వరముతోఁ బల్కి కొంచెము దూరముగ నిల్చెను.

"అతఁడే నాపాపమును క్షమించుఁగాక. నాచిత్తక్షోభము నెఱిఁగితివేని నీవును నన్ను దప్పక క్షమింతువు. గతవృత్తాంతము మిగుల భయంకరమై రేయింబగలు నన్ను వేధించినది. స్త్రీహత్య చేసినమహాపాపినని నేనహోరాత్రములు కుందితిని. మధురహృదయమును మంటిపాలుచేసితినని గ్రహించి పిచ్చరగా నేడ్చితిని. నాయేడ్పు వినువా రెవ్వరు!" అని యతఁడు వాపోయెను.

"నాథా! పూర్వకృతదోషములకు మీరు పశ్చాత్తాపముచేఁ బ్రాయశ్చిత్తము చేసికొన్నారు. నాహృదయమునకు మీయెడల రవంతయైనఁ గోపము లేదు. నేను యావజ్జీవము నిట్లే యుందును. ఇందు కీశ్వరుఁడే సాక్షి" యని యుమ నిట్టూర్పు విడిచెను.

## 1941

ఈక్రింది వాక్యముల సారాంశమును పదిపంక్తులలో సంగ్రహించి వ్రాయుఁడు:—

సరస్వతి నేఁటియుదయమునుండియుఁ దనశయనమందిరమందే యొంటిగఁ గూర్చుండి యేమేమియో యాలోచించుకొనుచుండెను. ఆమె కనుకొలకులనుండి యశ్రుకణములు రాలుచుండెను. నడుమనడుమ వేడినిట్టూర్పులు వెలువడి యామె యరుణాధర పల్లవమును వివర్ణముగఁ జేయుచుండెను. గృహకృత్యములయందు నిమగ్నయై యున్నయన్నపూర్ణకుఁ గూఁతు రొక్కసారియైనఁ గంటఁబడకుండుటచే నేమియుఁ దోఁచలేదు. అన్నపూర్ణాగౌరీషతులకు సరస్వతి యేకైకపుత్త్రిక, జనయిత్రి పుత్త్రికాదర్శనమునకై సరస్వతిగదిగుమ్మమువద్దకు వచ్చి 'అమ్మా ఏమిచేయుచున్నావు?' అనెను. సరస్వతి కన్నుల నీరు తుడిచికొని "ఏమియు లేదమ్మా" అన్నది.

ముద్దుబిడ్డ కన్నులనీరు గాంచఁగనే యన్నపూర్ణహృదయము కలుక్కు మనెను. అప్పు డామె విగతభావసూచక ముఖముతో "అమ్మా నీకు మతిపోవుచున్నదా? అనెను. సరస్వతి మొగ మింతచేసికొని యేమియు మాటాడలేకపోయెను.

అన్నపూర్ణ:- అమ్మా! రావుబ్రహ్మము రాలేదనియేనా? [సరస్వతి తలవంచుకొని యూరకుండెను.]

అన్న:- తల్లిదండ్రులు లేనివాఁడని మేనల్లుఁడని చిన్నప్పటినుండియుఁ బెంచి బిడ్డ నిచ్చుకొన్నందుకు విచారము మాకుఁగాని చిన్నపిల్లవు నీకేమి తెలియు నమ్మా?

సరస్వతి:- తెలియకేమి? తెలిసికొనకుండ నెంతకాల మిట్లు చిన్నబిడ్డనై యుండఁగలను?

అన్న:- ఉండక నీ వేమి చేయఁగలవు? ఎవ రేమి చేయఁగలరు? మొదటి నుండియు వాఁడట్లే యున్నాఁడు. చదువే కావలసినచో నింటిలోనుండి మేనమామ యొద్ద నింకను జదువుకొనఁగూడదా? దేశాంతరములకుఁ బోవుట యెందుకు! వెట్టివెట్టి పూజ లెందుకు? తీర్థయాత్ర లెందుకు? ఇరువదియేండ్లయినను నిండలేదుగదా? అనిష్ట లెందుకు? అశ్రోత్రియులను పిలుచుట లెందులకు? ఈయిల్లనిన పెద్దపులిగాఁ జూచు టెందులకు! చిన్నప్పటినుండియుఁ గన్నుల కద్దుకొని పెంచుకున్నందుకుఁ బ్రతిఫలమా యిది?

సర:- అమ్మా! తొందరపడి యూరక నిందింపకుము. నీమాటలకుఁ బ్రత్యుత్తర మిచ్చుటకు వారిచ్చట లేరుగదా!

అన్న:- అమ్మా! నేనూరకున్నను లోకులు నిందింపరా? ఈడువచ్చినబిడ్డ నింట నుంచుకొన్న తల్లిదండ్రులవిచారము పసిపిల్లవు నీ కేమి తెలియును?

## 1944

ఈక్రింది వాక్యముల సారమును, పదునైదు పంక్తులకు సంగ్రహించి వ్రాయుము:-

"ఒకనాఁడు ప్రభాతంబున నాచార్యుం డెల్లశిష్యులరావించి, మీ రస్త్రవిద్యార్జిత శ్రములరయితిరి. నాకు గురుదక్షిణయొసంగుఁడనవుడు, వారందఱు వందనంబులుచేసి, దేవా! తావక మనోవాంఛితంబు సెలవొసంగుఁడన నతండిట్లనియె-కుమారులారా! నేనుధన ధాన్యంబులు, రథగజతురంగంబులు, పల్లెలు, పట్టణములు నడుగను. నన్నొకఁడ లెఱుఁగక, యవమానపఱిచిన, యవివేకి నైశ్వర్యగర్వితునిఁ బాంచాలునిఁ గొంచి తెండు. ఇదియ నా యిష్టంబు నావుడు నిదియెంత కార్యంబని సుయోధనాదు లవార్యవీర్యంబున వర్మ కార్ము

క బాణతూణీరంబులు ధరియించి రథము లెక్కి కందంబుల చందంబునఁ జెందంబుఁ గురియు చుండ, గుభులు గుభులు మను ప్రస్థానదుందుభులు కకుభంబుల భేదింపఁ గాంపిల్యనగరంబును కరి తురగ రథ పదాతినికరముతోఁ జుట్టుముట్టిరి. పాండవు లేవురు మాత్రము ముందు పోవక, భరద్వాజు ననుసరించి వానివెంబడి నరుగుచుండిరి. అప్పు డాచార్యున కర్జునుం డిట్లనియె- స్వామీ! కౌరవులు దుర్వారగర్వంబునఁ బాంచాలురతో నాలంబు సేయ ముందెయరిగిరి. అతండు విలువిద్యను భవదీయసఖుండని యెఱుంగరు గాఁబోలు ననుచు వారు పాంచాలరాజధాని దఱియవచ్చుటకు ముందఱ, ద్రుపదుండు చతురంగబలములతో వచ్చి ప్రతిఘటించి ప్రావృషేణ్యధారాధరంబు గర్జిల్లుచు వారిధారల సారసంబుల గప్పునట్లు మహోద్రేకఘోరంబుగా శరాసారంబునఁ గప్పుచుండె. అప్పుడు గాంధారేయులందఱు నొండొరులఁ బిలుకొల్పికొని యొక్కమాఱుగఁ బెక్కునారసంబులు నిగుడించి పాంచాలుని దిరోహితుని గావించిన నతండును సూర్యుండునుంబోలె తేజరిల్లి నాసుతులకుఁ జేయార్పరాకుండఁ బుంఖానుపుంఖముగా పెక్కుమెయి సేయుచుండె. అతఁడు విడుచు బెడిదంపుటమ్ములు కడుదురులుపోలెఁ బొడువందొడఁగిన నరుని యెదుర నిలువ లేక మిడుకుమంబడిచి యప్పుడుచు నాచార్యుం జేరిరి.

అయ్యవసరంబున నర్జునుండు కుంభజ ధర్మజులకు నమస్కరించి- భీముండగ్రచరుండుగా నకుల సహదేవులు చక్రరక్షకులుగా ద్రుపదరాజ సేనాముఖ్యంబునం బ్రవేశించి శిలీముఖశిఖాజాలంబునఁ బాంచాలసైన్యారణ్యంబును జూఱుచు మెఱయించుచుండఁ గాంచి, పాంచాలుండు పంచాననంబుఁ జందంబున గెరలివచ్చిన వారిద్దరకు నతిఘోరం బగు ద్వంద్వయుద్ధం బత్యద్భుతంబుగా నయ్యె. అప్పుడు ద్రుపదుండు విరథుండై పాండవోత్తము ధనుర్దండంబు నొక చండకాండంబున ఖండంబుగా నేసి యార్చిన నతండు సింగపుఁగొదమ తెఱంగునఁ బాంచాలరాజపుంగవుని శతాంగంబుమీఁద గుభేలు నుఱికి వానిం బట్టుకొని రథకూబరంబునకుఁ గట్టి తెచ్చి కురుకుమారులకు, కన్నగుట్ట గురునకు గురుదక్షిణగా నర్పించె. అప్పుడు తనపాదంబులకడకు వచ్చిన రాజవర్యుం గాంచి యాచార్యుం డిట్లనియె- ఓహోహో! మీ రెవ్వరు? అఖండభూమండలాఖండలు లగు ద్రుపదమహారాజులవారు గాఁబోలు! అరిన్నపాలురు పాయసంబులు పెట్టిన చేకట్టులు చూపవచ్చిరో! మహారాజుల కివియొక్కో రాజచిహ్నంబులు. ఎంతటి నేత్రపర్వము సేయుచున్నయవి! పగ పరాభవాంజనంబున రాజ్యమదాంధత్వంబు వాసెం గాన నూఱూరు దిరిగి దేవురించుకొను పేదబాఁపలిపుడు గానంబడుదురని యుల్లసం బాడి, ద్రోణుం, డమ్మలహీవల్లభుని విడిపించి పుచ్చి, విద్యచ్చ మెచ్చి, గ్రుచ్చి కౌఁగలించుకొని శిష్యులతో హస్తిపురంబునకుఁ బోయెను. అహా! విప్రుని యలుకయును, తృణహుతాశనంబును దత్క్షణంబునన యుపశమించుం గాదె."

## 1945

ఈక్రింది గ్రంథసారమును జమునైదుపంక్తులకు సంగ్రహించి వ్రాయుడు:—

భాస్కరయ్యగారి యింటినుండి యందఱు వారివారి స్వగృహములకు వచ్చిచేరిరి. మరునాటిమధ్యాహ్నము భాస్కరయ్యగారి గృహములో హరికథ కావున వీరినందఱను వారు పిలిచిరి. అక్కడకుఁ బోవుటకుఁబూర్వము బాలలత రాధకడకు వచ్చి, "మన మీదినము హరికథకుఁ బోవుచున్నాము. నీ వేచీరఁగట్టుకొనెదవు" అనియడుగ నేనక్కడకు రానుగదా యని రాధ చెప్పెను. నీవు వచ్చుటలేదా యని బాలలత యాతురతతో నడిగెను. రాధ యొకనిమిషమూరకుండి చెలిమనస్సు నొప్పింప నిష్టములేక "మీయమ్మ నన్నురమ్మని పిలువలేదు. అంతియ కాదు, అక్కడ నందఱును నాకుఁగ్రొత్త. నే నెందుల కక్కడకురావలయును. నీవు నాకొఱకు మీయమ్మతో వ్యర్థముగా మాటలాడి లేనిపోనిసంకటమును దెచ్చిపెట్టుకొనకుము" అనెను.

బాలలత:— మాటిమాటికిని బోవుచుండినఁగదా క్రొత్తవారు స్నేహితులగుదురు. నీ వవశ్యము వచ్చితీరవలయును.

అని రాధతోఁజెప్పి తనతల్లియొద్దకువెళ్లి యెన్నియోవిధముల రాధవిషయము చెప్పిచూచెను. బతిమాలెను. వేడుకొనెను. ఏమిచేసినను బ్రయోజనము లేకపోయెను. ఆహరికథకు రాధ వచ్చుట కాటంకము లెన్ని కావింపనగునో యన్నియునొనరింపఁబడెను. భామినీభాస్కరులు రాధ యెవ్వరైనదియు మొదటిదినమునఁ దెలిసికొనలేదు. భామినికిఁ గూడఁ జాలపనియుండెను. హరికథకు నిద్దఱుతప్పఁ దక్కినయందఱును వెళ్లిరి. వారిరువురెవరనఁ బినాకపాణియు రాధయు. పినాకపాణికి మొదటిదినపు విందు సరిపడనందున నతఁడు కడుపునొప్పితో బాధపడుచుండెను.

అమృతవల్లి యందఱుఁదోడ్కొని హరికథకుఁ బోవుటకుపూర్వము రాధ యితరవిషయములందు కాలము వ్యర్థపుచ్చకుండునట్లు చేయుటకై రెండుగంపలజాజిపూవులను, గులాబిపూవులను జిరునగవుతో రాధకడకుఁ దెచ్చి "అమ్మా! రాధ! నీవు నిన్న బాలలతకొఱకొక దండఁ గ్రుచ్చితివే! దానిని నేఁజూచితిని. దండలు కట్టుటలో సమర్థురాలవు. వినాయకునకుఁ బండ్రెండు పెద్దమాలలు కట్టిసమర్పించెదనని మ్రొక్కుకొంటిని. ఈరెండుగంపల పూవులను బండ్రెండు మాలలుగాఁ గట్టిపెట్టుము. ఈసాయంకాల [illegible]క కోవెలఁ జేరవలయును" అనినుడువ విని రాధ యధికసంతోషమునంది చిఱునగవుతో "నాకెప్పుడును స్వామికార్య మొనరించుటయం దధికోల్లాసముఁ గుతూహలముఁగలదు; తప్పక మీయభీష్టము నెరవేర్చెదను." అనుచు నిట్టిభాగ్యము

తనకుఁ గలిగెఁగదా యని మాలలుకట్టుట కొప్పుకొనెను. రాత్రి పదిగంటలవఱకు రాధకుఁ బనిఁగల్పించితినిగదా యని యమృతవల్లి యుప్పొంగెను.

అద్దములోని ప్రతిబింబమునువలె నీమె హృదయమునందలి కోరికను రాధ గ్రహించెనని యమృతవల్లి తలంపలేదు. రాధను మోసపుచ్చితినిగదా యని యుప్పొంగెను. అంబికాపతియును దాను బయటికిపోకముందు పినాకపాణి కడకేతెంచి "ఏమోయీ! ఏమి యీనిర్బంధము? ఈహారికథ యెవరికిఁ గావలెను? నాకును దలనొప్పియని నేనును నిలిచిపోదునా? నన్నటుల నొంటరిగావిడిచి నేఁబోవుటకు నాకుఁ గాళ్లురాకున్నవి నాకిష్టమే లేదోయి" అనిపలుకఁగాఁ బినాకపాణి, "అట్లు నీవు నిలిచియుండుట యమృతవల్లికి నిష్టముండదు. అదిగో! అందఱు నిన్నుఁ బిలుచుచున్నారు. నీవుపోయి త్వరగా రమ్ము." అని చెప్పిపంపెను. అందఱును వెళ్లిరి. పినాకపాణి తలనొప్పివలన బాధపడుచు మూలుగుచుండెను. రాధ తన గదిలో మాలికలను గట్టుచుండెను. ఈమె స్వామి మాలలు గట్టుటలో నేర్పరియగుటచే నారెండుగంపల పూవులను మూఁడు గంటలలో నతిమనోహరముగా నితరులకు నలవికానివిధంబునఁ బండ్రెండుమాలలు గట్టిపెట్టెను. జాజిపుష్పముల మాలఁ గట్టుట బహుకష్టము, చిక్కుపని. సామగ్రివిశేషంబున నాపనిముగించి కొంతసేపు భగవద్ధ్యానముసలిపి, యొకపుస్తకము నెత్తి చదువనెంచి పుస్తకభాండాగారమునకు వెళ్లనక్కడఁ దలనొప్పితో బాధపడుచుండిన పినాకపాణి రాధహారికథకుఁ బోలేదని తెలియనివాఁడుగాన దేవతవలె మందగమనముతో వచ్చినరాధనుగని పడకనువిడిచి దిగ్భ్రమఁజెంది లేచినిలిచెను.

ఒకరి కొకరిట్లుచిత మర్యాదలను జేసికొనిన తరువాత వారిద్దఱును బు కములను గుఱించియు, సంఘ సంస్కరణములను గురించియు, ముచ్చటించిరి. రాధను జూచి నప్పటి నుండియుఁ బినాకపాణికిఁ దలనొప్పి నెమ్మదించెను. సాయంకాలము కాఁగానే వారందఱును దలనొప్పితో నుండిన పినాకపాణి యెట్లున్నాడోయని యింటికివచ్చుటయే తడవుగ నతనికడకువచ్చి పుస్తకాలయమును ప్రవేశించిరి. రాధయొకపుస్తకమును తనయొడిలోఁ బెట్టుకొని చదువుచు దానిలోని పటములను బినాకపాణికిఁ జూపించుచునుండుటయుఁ బినాకపాణి శ్రద్ధతో భక్తితో వినయముతో వినుచుఁ జూచుచునుండుటయు, నమృతవల్లిచూచి యత్యాగ్రహముతో మాలలుకట్టుట ముగించితివా యని రాధనడిగెను. "మూఁడుగంటలలోనే ముగించితినమ్మా! నాగదిలో నున్నవి. వినాయకుని కోవెల కనుపవచ్చును! అనుమాటలను వినఁగా నామెకు మనస్సులోనుండు కోపము పొంగిపొరలి వచ్చుచుండెను. కాని యమృతవల్లి యెట్టివిపరీతగుణసహితనో భావములనుగూడఁ దనహృదయపేటికయందు

భద్రపఱచి తాళము వేయఁగల శక్తికలదిగాన మహాసంతోషమును జెందినదానివలె "రాధా! నీవెంత గడుసరివి. నీవు చేసినయుపకారము మఱచిపోలేనమ్మా! స్వామి కార్యము నెఱవేర్చితివి. నాకు నిన్ను జూచిన బ్రహ్మానందముగానున్నది." అనిపలికి లోనికిఁబోయెను.

## 1946

ఈక్రింది గ్రంథసారమును బదునైదు పంక్తులకు సంగ్రహించి వ్రాయుఁడు:—

ఒకనాఁడు మునులందఱుఁ దపోవనమునం దొకయిక్కనుపవిష్టులైయుండఁ దన యఖండబ్రహ్మచర్యానిష్పన్నమగు బ్రహ్మవర్చసముచే రెండవసూర్యునివలెను, జుట్టుముట్టిన మునిగణముచే నక్షత్రగణముతోడి చంద్రునివలెను, బచ్చనిజడలచే నెగయుచున్నమంటలుగల నగ్నిదేవునివలెను, బ్రకాశించుచుఁ, దపస్వులకును యోధులకును మొదటివాఁడగుటచే మార్దవకాఠిన్యముల కేకాయతనమై, సకలక్షత్రసమవాయము నుమ్మూలించి స్యమంతపంచకము నిర్మించినవాఁడును, నశ్వమేధమహాక్రతుకర్తయై విద్యలకుంబారదర్శియై నిఖిలవసుధావలయంబును భూదేవులకు ధారాపూర్వకముగా దానమొనర్చిన శరణాగతరక్షకుఁడు జమదగ్నికుమారుఁడు నగు పరశురాముఁడను మహాముని యామునులకుఁ బ్రత్యక్షమయ్యెను.

అతనిఁ బొడఁగాంచి మునిమండలమెల్లఁ జేతులెత్తి నిలువంబడెను. పిమ్మట విధివిధానంబున నామునివరుంబూజించి యాతనియాజ్ఞచేఁ దమతమయాసనములం దుపవిష్టులైరి. ఇష్టగోష్ఠిగాఁ గొంతసేపు ప్రసంగించినపిమ్మట సృంజయమహారాజు తన దౌహిత్రి నతనిపాదములపైఁ బడవైచి స్వబంధకథనపూర్వకముగా నయ్యంబా వ్యసనకారణమును నివేదించి, "శరణాగతవత్సలా! నీవీమెకభయదానమొసఁగి భీష్ముఁడీమెను దయఁజూచునట్లు చేయవలయును." అని ప్రార్థించెను. అదివిని కొంతసేపు దుఃఖించి యాముని యామెను లేవఁదీసి, "బిడ్డా! ఏడువకుము; నేటితో నీకష్టములు గట్టెక్కెను; నీమాతామహుఁడు నాకుఁ బరమమిత్రము. సుఖదుఃఖములను బంచుకొని యనుభవించుటయేగద మిత్రధర్మము! కావున దుఃఖమెల్ల మాయదియు ఇది నీదిగాని నీమాతామహునిదిగాని కాదు. మాతో నిజమావేదింపుము. మఱియు విపన్నజనము తమ్మభయము వేడకున్నను దాముపోయి రక్షింపఁదగినది. శరణాగతుల విషయము చెప్పవలసినదేమి? నిశ్శంకముగ నీయభిమతమును దెల్పుము, భీష్మునకుగాని సాల్వునకుగాని, మాయాజ్ఞ యనతిక్రమణీయమే! వీరిలో నీకప్రియము గావించిన వాఁడెవ్వఁడో తెల్పుము." అనియడిగిన నయ్యంబ యాతనితో "ఓదేవా! భీష్ముని శిక్షింపుము. ఇదియే నాకు మిక్కిలిప్రియము" అని చెప్పెను. అదివిని మఱియు నతఁడు,

"బిడ్డా! క్షత్రియ కాంతకు సహజమగు మాటాడితివి. ఇట్టివ్యసనమునఁగూడ రౌక్ష్యము నించుకంతయు విడువకుంటివి. కానిమ్ము! నిన్నుఁ బరిగ్రహింపుమని భీష్ముని ముందుగా నియోగించెదను. నామాట నాతఁడు నిరసించిన నీమనోరథ మీడేరును." అన నెల్ల వారలాతని పలుకులభినందించిరి. వెంటనే పరశురాముఁ డామెఁదీసికొని రాజచంద్రుని వీడ్కొని మునిమండలముతోఁగూడఁ గురుక్షేత్రమున కేఁగెను.

భీష్ముఁ డాతనిరాకఁదెలిసికొని సంభ్రమముతోఁ బూజోపకరణములఁ గైకొని యాతనిసన్నిధికేగి నమస్కరించి పూజించెను. పిమ్మట దయాపరుండగు భార్గవరాముఁ డాశీర్వదింపఁదలఁచి, "వత్సా! దేవవ్రత! నీకువలయు సద్గుణములన్నియు నీవఱకే యున్నవి. పూజ్యులయెడ వినయప్రపత్తులు గలిగియుందువు. ప్రమాదాదిదోషములు నీకొందవవు. సత్స్వభావులలో నగ్రేసరుఁడవు. గురుభక్తిపరులలో మొదటివాఁడవు. వీరులలో నగ్రగణ్యుఁడవు. ఇట్టి నీకింకేమి యాశీర్వాదము నేఁగావింపఁగలను? అయిన నిట్లాశీర్వదించెదను. ఇప్పటివలె నఖండితచరితుఁడవై పురుషాయుషజీవివగుము." అని యాశీర్వదించెను. తనకభిమతమగు నాశీర్వాదముచే ద్విగుణితమగు భక్తితోఁ బ్రాంజలియై "గురువరా! ఇది యాశీర్వచనము కాదు. వరప్రదానమే. ఎల్లప్పుడును మచ్ఛీలమున కవిరుద్ధముగఁ బ్రవర్తించుటయే నాకభిమతము. శిష్యప్రియుండవగు నీవును దీనినే ప్రసాదించితివి. ఈజనుఁడెద్దియైననుత్కృష్టకృత్యము నాచరించిన నదియు భగవత్పాదుల యనుగ్రహముననే యైనదని చెప్పవలసియున్నది. పితృభక్తి నిష్ఠ మనయిరువురయందును సమానమే. జన్యజనకములకు రూపసామ్యము గురుశిష్యులకు వృత్తిసామ్యము నుండుట నియతమేకదా!" అని యిట్లభినుతించుచు మఱియు, "ఓగురువరా! ఆప్తకాములగుటచే నేకోర్కెతోఁ దామిట్లు వెంచేసిరని యడుగుటయు నాకుసరి కాదు. తపోనిష్ఠులకుల కాలము మిగుల విలువైనది. వారు క్షణకాలమైన నిరర్థకముగఁ బోనీయరు. ఎద్దియో ఘనకార్యము చేయఁదలఁచి తామిట్లరుదెంచితిరని యూహింపవలసియున్నది. అనుగ్రాహ్యజనమందుఁ గలవాత్సల్యముచే నిర్వ్యపేక్షులకుఁగూడ సాపేక్షులకువలెఁ బ్రవృత్తియుండుట చూచుచున్నారము. ఏతెన్నున నాకీదినమును సుదినము కావింప నెంచితిరో యాజ్ఞాపింప వేడుచున్నాఁడను.

## 20. గ్రహణశక్తి (Comprehension)

1. విద్యార్థులు తాము మనస్సులోఁజదివికొనిన సంగతులను బాగుగా గ్రహించుచున్నారో లేదో యను సంగతిని దెలిసికొనుటకు, వారిచేఁగొంత గద్యగ్రంథభాగముయొక్కగాని, యొకపద్యగ్రంథభాగము

యొక్కగాని సారాంశమునో లేక వానియందలి విషయములకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానములనో వ్రాయించుచుందురు. ఇట్లు పరీక్షలలో నడుగుగద్యముల సంగ్రహములను వ్రాయువిధానమును గూర్చి పూర్వప్రకరణమునందుఁ జెప్పియున్నాను. ఈప్రకరణములో పద్యాత్మకములయిన కథలనుజదివి వానియందలి కథలను వ్రాయు విధమునుగూర్చి వివరించెదను.

2. మనకుఁ బరీక్షలో నొసఁగుపద్యాత్మకమగు కథ సుమారు పదిపద్యములు పరిమితిగలఁదిగానుండును. ప్రశ్నపత్రమునందొసఁగిన పద్యములను జాగరూకతతో జదివి వాని సారాంశమును మొత్తముమీఁద గ్రహింపుము. మొదటిసారి చదివినప్పుడు పద్యములందలి కథాంశములు బాగుగబోధపడనిచో రెండవసారి వానిని జదివి వానియందలి కథను తేటతెల్లముగఁ దెలిసికొనుము. రెండవసారి చదివినతరువాతఁ గూడ సందేహములున్నచో మూఁడవసారి గూడఁ జదివి కథను బాగుగా గ్రహించి విషయజాలమునంతను దృష్టిపథమున నుంచుకొనుము.

3. పద్యములలోని విషయములనన్నిటిని బాగుగా గ్రహించిన తరువాత, నందలి యంశములను నవి జరిగినక్రమమున నేర్చికూర్చి, వాని నాక్రమమున క్లుప్తముగా సంతరించికొనుము. ఇప్పుడు నీవు కూర్చికొనిన యీప్రణాళికలో (Skeliton) పద్యములలోని యేముఖ్యాంశమును విడిచిపెట్టలేదనియు, పద్యములలో లేని యేయితర విషయములను క్రొత్తగా దెచ్చిపెట్టలేదనియు, నిర్ధారణచేసికొనుము.

4. ఇట్లు విషయనిర్ధారణముగావించిన తరువాత కథారచనము నకుఁగడఁగుము. కథనంతను నీసొంతమాటలతోనే వ్రాయవలయును గాని పద్యములందలి వాక్యములనే యుపయోగించి వ్రాయగూడదు. అందఱకును సుపరిచితములయిన పదములను బ్రయోగించుచు, సరళమైనశైలిలోనే కథను వ్రాయవలయును. అలంకారభూయిష్ఠములైన

రచనలనుగాని, రమ్యములైన రచనలనుగాని, యీకథలందు జొనిపింప రాదు.

5. పద్యములందలి కథను రచించినతరువాత దానిని మొదటినుండి చివరవఱకును జాగరూకతతో జదివి దానియందలి వర్ణక్రమదోషములను, వ్యాకరణదోషములను, శాంతచిహ్నములదోషములను, తొలఁగించి, దానిని నిర్దుష్టముగా నొనర్పవలయును.

6. ఇచ్చిన పద్యభాగముమీఁద గొన్నిప్రశ్నలనొసఁగి వానికి సమాధానములను వ్రాయుమని యడిగినప్పుడు మనము యాపద్యములను రెండు మూఁడు సారులు చదివి, వాని యభిప్రాయమును బాగుగా గ్రహింపవలయును. మనమా పద్యములను రెండవ సారియో లేక మూఁడవసారియో చదువునప్పుడు మనకిచ్చిన ప్రశ్నలకు సమాధానములు వానిలో నెక్కడెక్కడనున్నవో, నాయాప్రశ్నల కేవేవి సమాధానములో మనస్సులో నిర్ణయించుకొనుము. అంత నొక్కొక్క ప్రశ్న నే తీసికొని వానికి సమాధానములను వరుసగా వ్రాయుము. ప్రశ్నలసమాధానములు సంపూర్ణవాక్యములలోను, నీసొంతమాటల లోను నుండవలయును. ప్రశ్నకెంతసమాధానమావశ్యకమో యంతే వ్రాయవలయునుగాని కొంచెము ఎక్కువగా గాని, కొంచెము తక్కువగా గాని, వ్రాయఁగూడదు. పదములను బద సముదాయములను వ్రాయుమనినచో నడిగినవానినే వ్రాయవలయును. నీయుత్తరములు సులభశైలి లోను నిర్దుష్టమైన భాషలోను నుండవలయును.

7. బాలుర యుపయోగార్థ మిటకొన్ని గ్రహణశోధనముల (Comprehension Tests) ను బొందుపఱిచెదను.

### I. రంతిదేవునికథ [ Model question Paper 1946. ]

### Exercises

ఈక్రిందివిషయములను జదివి వానియందలి విషయమును 20 పంక్తులలో వ్రాయుము.

సీ. రంతిదేవుండను రాజోత్తముఁడు మహా । దాతృత్వకీర్తితోఁ దనరుచుండు
నారాజు తన సంచితార్థంబులన్నియు । నెడపక దీనుల కిచ్చియిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద । యై కూడు నీరులే కధమవృత్తి
నొందెని నలువదియెనిమిది దివసముల్ । గడియింప, నొకదివసంబు రేపు

గీ. నెయ్యి పాయసంబు నీరును గలిగిన । బహుకుటుంబ భార భయముతోడ
నలసి నీరువట్టు నాఁకలియును మిక్కి । లొదవఁజూచి, తినఁగ నుత్సహించె.

వ. అయ్యవసరంబున.

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహారమడిగిన । గడపక, ప్రియముతో గారవించి
హరిసమర్పణమంచు నన్నంబులో సగ । మిచ్చిన భుజియించి యేఁగె నాతఁ
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి । పాడుసూప, లేదనఁబోక, తనకు
నున్న యన్నములోన నొకభాగమిచ్చిన । సంతుష్టుఁడై వాఁడు సనినవెనుకఁ

గీ. కుక్కగమిగొని యొక్కఁడొక్కఁడే తేరనా । యన్నశేషమిచ్చి సన్నయంబు
లాడి మ్రొక్కి పంప, నొక చండాలుఁ । డొక్కఁడరుగుదెంచి చక్కనిలిచి.

క. హీనుఁడ జలదాహంబున । మానవకులనాథ దప్పినమానను; యవలం
బో నేర నీసఁజిక్కన । నీయము నాకుఁ బోసి పంపంగదవే.

క. అనఘుని కనికరముప్పవఁగఁ । దనకున్న జలంబుఁబోసెఁ దత్పాత్రిమునన్
వనజాసనాదులచ్చటఁ । గనుపట్టి నృపాలుకిడఁగఁ గైవల్యంబుల్.

Glossary:— రేపు = ఉదయము. నీరువట్టు = దప్పి. గమి = గుంపు.

[N. B. Alternatively the pupils may be asked to answer questions set on the poem in complete sentences.]

## II. S. S. L. C. 1946.

సీ. పుండరీకంబను పురమొప్పునప్పురం । బునకధీశ్వరుఁడు 1 ప్రభూతయశుఁడు
సంపాతియనురాజు సద్గుణశీలుఁడా । చారవంతుఁడు నిత్యసత్యధనుఁడు
చర్చింప శ్రీరామచంద్రుతో నెనవచ్చు । నితరులతరముగాదతనిఁబోల
నిట్టి భూతలనాథు నర్ధాంగశోభిని । వర్ణితరూప లావణ్యసదన

గీ. చంద్రరేఖయనఁగ జానకిఁబోలున । ప్పడతి 2 వంధ్యయగుడుఁ బార్థివేంద్రుఁ
డధికనిష్ఠ 3 నభవునర్చించి సంతాన । మడిగెనంత నభవుఁడట్లయొసఁగె.

వ. పరమేశ్వరుఁ డట్లొసంగిన వరప్రసాదమునఁజేసి యొక్క పుణ్యదివసంబునందు.

క. విమల 4 పయోనిధివీచీ । సముదితయగు లక్ష్మివోలె సౌందర్యాద్యు
త్తమలక్షణలక్షితయై । కుమారియుదయించె రాచకొమలికెందున్.

క. సుతయుదయవేళ నయ్యెడు । వితతశుభాశుభము తెలుపవేఁడి ధరిత్రీ
పతి యడిగినఁ జెప్పెఁబురో । హితుఁడు గ్రహస్థానములు నిరీక్షించి తగన్. 4

ఉ. ఇప్పటివేళ చూడమనుజేశ్వర తక్క నగండదోషముల్
చెప్పఁగ లేవు; భావిఫలచిహ్నమొకండటు చిత్తగింపుఁడా;
యిప్పుడతిం గిరగ్రహణమెవ్వఁడు చేసెనతండు 5 లేఁడగుం
దప్పదు బ్రహ్మరాక్షసుకతంబునఁ దొమ్మిదినాళ్లనాఁటికిన్. 5

క. అనిచెప్పినఁ గర్ణద్వయ । మును 6 జూఁడిన చందమైనమూర్ఛాగతుఁడై
జనవిభుఁడు కొంతవడపున । కు నొకింతుక తెలిసి యెలుఁగుకుతుకదగులన్. 6

ఉ. పట్టపురాజునంచు నొడఁబాటులు దప్పను; భూజనంబులన్
గట్టియుఁగొట్టియున్ బహుముఖంబులనర్థముగూడఁబెట్ట; నే
పట్టున నర్థులం 7 గడపఁ; బ్రాహ్మణసీమల కగ్గుసేయ; నేఁ
బుట్టి ప్రభుత్వతామహిమఁబొందిన కోలెనొనర్పఁ బాపముల్. 7

వ. అట్టి నాకు విధిప్రతికూలుండగుట కెయ్యదికతమోయని దురన్త. 8

[Glossary:—1. పరిభూతము = అధికము. 2. వంధ్య = గొడ్రాలు. 3. అధవుఁడు = ఈశ్వరుఁడు. 4. పయోనిధిరాజీసముదిత = పాలసముద్రపుటల నుండుఁబుట్టినది. 5. లేఁడగున్ = నశించిన లేక మరణించినవాఁడగును. 6. చూఁడు = కాల్చు; అధికముగా బాధించు. 7. కడపు = ఈయక పొమ్మను.]

ఈ క్రిందిపద్యములను జదివి, వీనిక్రింద నొసఁగిన ప్రశ్నలకు సమాధానములను వ్రాయుఁడు.

III రావణగర్వభంగము

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు । ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు । నారాధనముసేసి యతనివలన
1 పరిపంథిజయమును బాహుసహస్రంబు । నణిమాది గుణములు యశముబలము
యోగీశ్వరత్వంబు 2 నోజయుఁ దేజంబుఁ । నైపనియింద్రియములు సిరియుఁబడసి

తే. గాలికైవడి సకలలోకంబులందుఁ । దనకుఁ బోరాని రారాని తావులేక
యెట్టిచోనైనఁ దనయాజ్ఞ 3యేపుమిగుల। ధరణి పాలుగొంచు వినుపీథిఁ 4 దరణిమాడ్కి. 1

మ. ఒకనాఁడా మనుజేంద్రుఁ డంగనలతో 5 నుద్దాముఁడై వీటనుం
డక రేవానదికేగి యందుఁ జెలిసీటంజల్లు పోరాడి దీ
ర్ఘకరాబ్జంబుల నానదీజలములం గట్టెన్ వడిన్ నీరుమ్రో
లకుఁ బెల్లుబ్బి రణాగతుండయిన యాలంకేశుపైఁ దొట్టఁగన్. 2

వ. ఇట్లు దిగ్విజయార్థంబువచ్చిన రావణుం డారాజు చెంగటం 6 దొట్టినయేటి

నీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మేటిమగనితోడి పోరాటకి దొడరినఁ బాటింపక తనబాహుపాటవంబున.

కం. వీఁక మెయి నతఁడు రావణుఁ । 7 గూఁకటులగలించి పట్టికొని మోఁకాళ్లం
దాఁకించి క్రోఁతికైవడి । నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్.

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి.

కం॥ ఆరాజేంద్రుఁడు రావణు । నోరీ యిటమీఁద నూరకుండుము జగతిన్
వీరుడ ననకుము కాచితిఁ । బోరాయని సిగ్గుపఱచి పుచ్చెన్ మరలన్॥

(Glossary: నిఘంటువు:— 1. పరిపంథి=శత్రువు. 2. ఓజ=ఉత్సాహము 3. ఏపుమిగులన్=విజృంభింపఁగా. 4. తరణి=సూర్యుఁడు. 5 ఉద్దాముఁడు=స్వతంత్రుఁడు. 6. తొట్టిన=వ్యాపించిన. 7. కూఁకటులు=పిల్లజుట్లు.)

1. కార్తవీర్యార్జునుఁ డేవంశమువాఁడు? 2. కార్తవీర్యార్జునుని నాలుగుపంక్తులలో వర్ణింపుము? 3. ఒకనాఁ డతఁ డేమిచేసెను 4. ఆసమయమున రావణుఁ డేమిచేయుచుండెను? 5. రావణుఁ డెందులకు కోపించెను? 6. రావణార్జునుల యుద్ధమును వర్ణింపుము? 7. ఆయుద్ధములో నెవ్వ రెగ్గిరి యెవరోడిరి? 8. కార్తవీర్యార్జునుఁడు రావణు నెట్లు పరాభవించెను?

## IV భరతుఁడు

క. బంధుర యశుఁడు జగన్నుత । సంధుఁడు దుష్యంతుఁ డుచిత సమయజ్ఞుండై
గంధగజగమ నవప్పుడు । గాంధర్వవిధిన్ వరించె 1 గహనాంతమునన్. 1

వ. ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నారాచపట్టి 2 దపసిరాచూలికిఁ జూలు నెక్కొలిపి చనునాఁడు తనవీటికిం జనియె నయ్యింతియుం గొంత కాలంబునకుఁ గొడుకుం గనినఁ గణ్వమునీంద్రుండా రాచపట్టికి జాతకర్మాది మంగళాచారంబు లొనర్చె నా శిశుఁడును దినదినంబునకు బాలచంద్రుఁడునుంబోలె నెదుగుచు. 2

క. [illegible] గాక నాఁడు । త్రుంచెం దన చిన్ననాడె [illegible] వనచర
త్రుంచెద [illegible] । కంఠములంబట్టి యడుచుఁ గట్టున్ విడుచున్. 3

వ॥ [illegible] నా కణ్వమునీంద్రుండు బాలకుంజూచి శకుంతల కిట్లనియె. 4

సీ. [illegible] నీమగఁడు పాపఁడు నంతకు నెక్కుడన్నిటం
ఒక్కప్రదే[illegible] 3 గాంచు బాగుననుండక పాలువారితో
గిట్టినవారలతో నవయఁగాఁ బనిలేదిటఁ దర్లిపోఁగదే
పుట్టినయింట [illegible] మానినులు 4 పొగడిగా ననిశంబునుండరే. 5

వ. అనిపలికిన 6

క. ఆపిన్నవాని నతుల । వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం
జూపెదనంచు శకుంతల । భూపాలునికడకువచ్చెఁ బుత్రునిగొనుచున్. 7

వ. వచ్చి దుష్యంతుఁ డున్నసభామండపంబునకుం జని నిలిచియున్నయెడ. 8

మ. వలకేలన్నరు చక్రరేఖయుఁ బదద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ విందువచ్చిన రమాకాంతుండు నాఁ గాంతిన
గ్గలమైయున్న కుమారు మారసదృశాకారున్ విలోకించితాఁ
బలుకండయ్యె విభుండెఱింగి సతి 5 విభ్రాంతాత్మయై వందురన్. 9

వ. ఆసమయంబున 11

మ. అదె నీవల్లభ వాఁడు నీసుతుఁడు భార్యాపుత్రులం బాఁగులన్
వదలంగా దలనాఁటి కణ్వవనికా వైవాహికారంభముల్
మదినూహింపు, శకుంతలా వచనముల్ మాన్యంబులౌ భూవరేం
ద్రదయం జేకొనుమంచు మ్రోసెను వియద్వాణీ వధూగీతమున్. 12

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుఁ దేటపడ గ్రహింపుమని పలికిన నాకుమారుండు భరతుండయ్యె నంత నారాజు రాజవచన నంగీకరించి తనూభవుంజేకొని కొంతకాలంబు రాజ్యంబుసేసి పరలోకంబునకుం జనియెఁ దదనంతరంబ. 13

క. రెండవ హరిక్రియ ధరణీ । మండలభారంబు నిజసమంచిత బాహా
దండమున నిలిపి తనకును । భండనమున నెదురులేక భరతుండొప్పెన్ 14

[Glossary (నిఘంటువు) :—1. గహనాంతమునన్ = అడవిలో. 2 తపసి రాచూలి = రాజర్షికూఁతునకు. 3. గఱువబాగున = గొప్పతనముతో. 4. పోరచిగా = వ్యర్థముగా. 5. విభ్రాంతాత్మయైవందురన్ = కలఁతనొంది దుఃఖింపఁగా. 6. వియద్వాణీవధూగీతముల్ = ఆకాశవాణియను స్త్రీ పలుకులు.]

1. దుష్యంతుఁడెట్టివాఁడు? 2. అతఁడెవతెనెట్లు వివాహమాడెను? 3. శకుంతల గర్భవతియైనదను సంగతి యేవాక్యమువలన దెలియుచున్నది? 4. ఆమెకొడుకునకు గణ్వమహాముని యేమికర్మలు చేయించెను? 5. ఆబాలుఁడు కణ్వాశ్రమమున నున్నపుడు కావించిన కార్యములను వర్ణింపుము? 6. ఎదిగిన బాలునిఁజూచి కణ్వుఁడు శకుంతలతో నేమనెను? 7. తండ్రిమాటల నాలించి శకుంతల యేమిచేసెను? 8. తన సభాభవనమునకువచ్చి యందు నిలబడియున్న శకుంతలను గొడుకునుజూచి దుష్యంతుఁ డేమిచేసెను? 9. శకుంతల యేమనుకొనుచుండెను? 10. సభవారు విన యశరీరవాణి యేమని పలికెను? 11. రాజేమిచేసెను? 12. ఆబాలునికి భరతుఁడను పేరెట్లుగలిగెను? 13. తండ్రితరువాత రాజైన భరతుఁడెట్లు వర్ణింపఁబడెను?

V. వాల్మీకి (రామాయణరచనోద్భవము)

క. వాల్మీకి భరద్వాజయు । తుల్మానుగ గంగకనతిదూరమునలతా
1 గుల్మాంచిత తీరయు ని । ష్కల్మషజలయునగు తమస కడకేఁగిరతగన్. 1

వ. వాల్మీకి తనశిష్యుండగు భరద్వాజుని చేతివల్కలంబులు పుచ్చుకొని ధరియించి యాపుణ్యవాహిని 2 నవగాహంబుచేసి, వెసనిలువంబడునెడ 2

క. అంచితగతిఁ దత్తటమునఁ । గ్రౌంచంబులు రెండులీలఁ గ్రాలుచునుండం
బొంచియొకశబరుఁడందొక । క్రౌంచముఁ జంపనడిచెరక్త కణములుదొరఁగన్. 3

క. శిరమునరక్తము వెడలఁగఁ । బొరలెడు తనవిభునిఁజూచి పొడమినవగతోఁ
బరుషధ్వని 3 వాపోవుచుఁ । గరమువిషాదించు క్రౌంచిఁగనుగొని కరుణన్. 4

వ. కటకటంబడి వాల్మీకి యధికరోషసంజనితకుటిలభ్రుకుటియగుచు నిషాదుంగనుంగొని 5

ఉ. ఓరి మహోగ్రపాతకుఁడ యోరినిషాదుడ క్రౌంచయుగ్మమిం
పారఁగఁగామకేలి మెయిన్నాడఁగ నందొకపక్షినిల్లని
ష్కారణమేలచంపితటు గావున నీవును వేగచావుపో
రోరి దురాత్మయంచుఁ గడునుగ్రతనమ్ముని పల్కెఁబల్కినన్. 6

క. ఆకరుణానిధియగు వా । ల్మీకుల శాపాక్షరములు మితసమవర్ణ
శ్రీకరపాదచతుష్క । శ్లోకంబయి జగతిఁబరఁగె సుశ్లోకంబై. 7

వ. అంతనమ్ముని యభిషేకంబుసేసి, యుచితానుష్ఠానంబులు, నాహ్నికవిధులు నాచరించి 8

క. తనవెనుక భరద్వాజుఁడు । దనరగ జలపూర్ణకలశధరుఁడయిరాఁ దే
రనిజాశ్రమమున కొనఁగ । జనితగఁ గూర్చుండియోగసమ్మిత బుద్ధిన్. 9

క. ధ్యానంబుసేయునెడఁజతు । రాననుఁడే తేరలేచి 5 ప్రాంజలియయి స
మ్మానముతోడుతమ్రొక్కుచు । నానావిధపూజలిచ్చి నలినజుచేతన్. 10

క. అనుమతుఁడయి యుచితాసన । మునునుండఁ బితామహుండు ముదితాత్ముండై
కనుఁగవలను గారుణ్యం । బెనయఁగ వాల్మీకిఁజూచి యిట్లనిపల్కెన్. 11

ఉ. జానుగనీముఖాబ్జమున శారదయున్నది నాయనుజ్ఞ
జ్ఞానముతోడమున్ను సురసంయమిచెప్పినవాక్యపద్ధతిన్
సూనృతభాషణార్థముల శ్లోకనిబద్ధముగాఁ గవిత్వ [illegible]
శ్రీనొగి విస్తరించి తగఁజెప్పుము రామకథాప్రపంచమున్.